# సర్వమతసార సంగ్రహము





కవిరాజ్ : **యస్. యమ్. జాన్**

సిద్ధాంతం (ప. గో. జిల్లా)



**1959**

 [వెల రు **2-00.**

# అంకితము

సృష్టిస్థితిలయకారకుడు - సర్వజ్ఞుడు - నిర్వికారుడు - ప్రేమమూర్తి - ఆద్యంతరహితుడు - పరమేశ్వరుడు - అల్లాః - యోహోవా పేర్లంబరగుచు యొప్పుచున్న ఒక్కరుండగు శ్రీ దేవదేవునికి హృదయపూర్వకముగ అర్పించుచున్నాను...

# తేనెచినుకులు

1. భగవంతుడు ప్రేమమూర్తి - హిందువులు, మహమ్మదీయులు అని వేరుచేయుట పాపహేతువు - ఐకమత్యము ఆత్మశుద్ధికి మూలము. — శ్రీ గురునానక్.

2. ఏకేశ్వరోపాసనమే సత్యము - ధర్మము నగు మతము. దురాచారములు తొలగినగాని సంఘమునకు ఉన్నతి కలుగదు. — శ్రీ రాజా రామ్‌మోహనరాయ్.

3. దైన్యమును, దారిద్ర్యమును తొలగించి - జాతిని ఉద్ధరించునదియే సత్యమైన మతము - సేవాత్యాగము చూపగలవాడే కర్మవీరుడు. జాతి సౌభాగ్యమే మత ప్రయోజనము. — శ్రీ వివేకానందస్వామి.

4. జాతి, మత, కులద్వేషములు దేశమున కరిష్టములు. సహనము - ఐకమత్యము మానవజాతికి అలంకారములు.

— శ్రీ మహాత్మా గాంధి.

ప్రథమ ముద్రణము - ౧౦౦౦ ప్రతులు — అక్టోబరు ౧౯౫౯.

# అభిప్రాయము



సిద్ధాంతం వాస్తవ్యులు కవిరాజ్ యస్. యమ్. జాన్‌గారిచే రచింపబడిన "సర్వమతసార సంగ్రహ"మను పొత్తమును తిలకించితిని. గ్రంథకర్తగారి సహజ సౌజన్యత, సర్వమానవ సౌభ్రాతృత్వాభిమానము, మత సామరస్యము, లోకజ్ఞత, ఆధ్యాత్మికానుభవము, లోకసంగ్రహాభిలాష యీ గ్రంథరచనకు వీరిని పురికొల్పినవి. వీరి యీ సత్ప్రయత్నము మిక్కిలి ప్రశంసనీయము.

మానవులు జ్ఞానులై ఆధ్యాత్మిక విద్యావైభవోపేతులై యెల్లరకు నొక్కండగు దేవదేవుని చేరుటకు ఘటింపబడిన మార్గము లనదగు మతముల నపార్థమొనర్చుకొని, అహంకారులై వైషమ్యములు పెంచుకొని యొండొరులు కలహించుట పరిపాటియైనది. పెక్కురు పండితులు, పామరులు, ప్రభువులు ఈ దోషములకు గురియై పెక్కు వాగ్వాదములకు, కలహములకు, యుద్ధములకు, స్త్రీహత్యలు, శిశుహత్యలకు కారకులైరి. ఇట్టి ఘోరవిపద్దశ చూచిన యొకకవి "మతమే మారణయంత్రమయ్యెనే మహాత్మా! భక్తచింతామణీ!" అని విలపించినాడు. నేటికిని మనకీదుర్దశ తప్పలేదు.

ఇట్టి తరుణమున నిట్టి విశాలదృక్పథముతో కూడిన గ్రంథము లత్యావసరము. ఇందు వీరు 1. హిందూమతము, 2. బౌద్ధమతము, 3. మహమ్మదీయమతము 4. క్రైస్తవమతము మొదలగు పలువిధములగు మతముల ప్రాశస్త్యము, అందందు బోధింపబడిన కర్మకాండ, ఆచారకాండ, జ్ఞానకాండ, పండుగలు, ప్రార్థనలు మున్నగువానిని గూర్చి చక్కగ వ్యాఖ్యానించిరి. దేశకాలపాత్రల ననుసరించి, ఆచారభేదములు కలిగెను. కాని ఈశ్వరీయవిజ్ఞానమంతయు నొక్కటేయని శ్రీమద్భగవద్గీతనుండియు, ఖురాన్‌షెరీఫ్ నుండియు, బైబిలు నుండియు సోదాహరణముగా నిరూపించిరి.

వీరు బిందువునుగూర్చియు, తిలకము, అడ్డబొట్టు, నిలువుబొట్టు, అల్లాహ్ అనుటలో అలీఫ్‌తో కూడిన శబ్దముల సామరస్యమును పండిత మనోరంజకముగ వ్యక్తీకరించిరి.

భక్తులెల్లరకును మనోహరములగు ప్రార్థనాగీతములను భగవద్గీత, శివానందలహరి, ఖురాన్ షరీఫ్ మొదలగు పొత్తములనుండి యెత్తి వ్రాసిరి.

భౌతికవిజ్ఞానము గగనమార్గమున చంద్రమండలమ్మునుగూడ తలదన్ని పైకెగబాకుచున్న యీ తరుణమున విమానయాన సౌకర్యములచే ప్రపంచమంతయు మిక్కిలి సన్నిహితమైన యీ కాలమున ఒక్కటే మానవజాతి ! ఒక్కటే మతము! ఒక్కడే దైవము ! అని ప్రబోధించుటకు తగినసదవకాశము చేకూరినది. ఇట్టితరి నీ గ్రంథకర్తగారు కర్షకుడు తగినఅదనులో విత్తనము నాటినటుల ఈ గ్రంథము ప్రకటించుట యెంతయు లోకోపకారము. ఇట్టి గ్రంథములు పఠించినచో మతవైషమ్యములు నశించును.

సర్వ సోదరభావమును గ్రహించి మానవులు సుఖులై జీవింపగల్గుదురు. కావున ప్రతివారును బాలురు, పెద్దలు దీనిని పఠింప గోరెదను.

సర్వమతస్థులు, సకలసంస్థలు దీనివ్యాప్తికి తోడ్పడి యీకావ్యకర్త గారిచే యింకను నిట్టిగ్రంథములనేకములు రచింపజేయుదురుగాత. పరమేశ్వరుడగు 'అల్లాః' వీరిని రక్షించుగాత.

ఇట్లు విద్వద్విధేయుడు,
మంచం బుచ్చిలింగప్పశాస్త్రి.
శతావధానులు,
ఆధ్యాత్మిక వేదాంతోపన్యాసకులు.

వడలి
30—5—59

# విజ్ఞాపన

ఆర్యులారా !

భగవంతునిసృష్టిలో మానవజన్మ ఉత్కృష్టమైనది. అట్టిసృష్టి ప్రశంస మహిమముతో ఏర్పాటైనది. ప్రశంసమహిమను లరయుటకు ధర్మార్థకామముల సారాంశమగు మోక్షసామ్రాజ్యమును బడయుటే మానవతరణోపాయము. అట్టి మోక్షసామ్రాజ్యమును బడయుటకు ప్రతిజాతికి ఒక్కొక్కమతము ఏర్పాటైయున్నది.

ప్రపంచములో హిందూ, బౌద్ధ, ముస్లిం, క్రైస్తవమతములు ముఖ్యము. మతములు వేరైనప్పటికి గమ్యస్థానముచేరుటకు దేవుడు ఒక్కడనియు, ఒక్కటే మతమనియు, మానవులంతా ఒక్కటే జాతియనియు, అంతా ఒక్కటేయన్న సారాంశముగ వేదములు, శ్రీమద్భగవద్గీత, ఖురాన్, బైబిలు ఘోషించుచున్నవి. ఈ వేదగ్రంథముల ధర్మసూత్రములు ఒక్కటే అనియు, ప్రపంచాభివృద్ధి కలుగుటకు ఆసాకారములైనవనియు అందరికి విదితమైయున్నది. చాలమంది మహాపురుషులు, భక్తులు భగవత్పురాణములను, గీతాసూత్రములను, బైబిలు సువార్తలను, ఖురాన్ సూరాలను తాత్పర్యార్థాది వ్యాఖ్యానములచే తెనిగించి లోకోద్ధారకులైరి.

కాని ప్రతిమతస్థులు ఆచారవ్యవహారములు, ప్రార్థనాదికములు, నడవడులు, కర్మకాండలు వ్యతిరేకములనియు, ఇతరమతస్థుల పద్ధతులు మంచివికావనియు, తామాచరించు మతధర్మములే మంచివనియు తలచుట పరిపాటియైనది. అందుచేతను, ఇతరమతస్థుల ధర్మములు సరిగా తెలియకుండుటచేతను, ప్రతివారికి హృదయ పరిపక్వము కలుగుటకు, మతసహనము పాటించుటకు, సచ్ఛీల నిర్మాణమునకు (ఇల్మిఅఖాయద్) స్వధర్మవిజ్ఞాన మవసరమైయున్నది. అట్టివిజ్ఞానమును ప్రతివారు నేర్చుకొన్ననాడు ప్రపంచములోని ప్రతిమతస్థులు యితరమతాలలోని సారాంశము గ్రహించి వేరు వేరు మతాలలోయుండే సూక్తులు అన్ని గ్రహించి సంఘములో భిన్నభిన్నవర్గాలవారితో వ్యవహరించేటప్పుడు వాట్లను ఆచరణలో పెట్టుదురు.

అప్పుడు ప్రపంచములోని ప్రతి మతస్థులు మతసహనముకల్గి ఐకమత్యముతో నేటి పంచశీల గమ్యస్థానముచేరుటకు ప్రయత్నింతురు. నాడు ప్రపంచ ప్రజా స్వామ్యము వృద్ధిచెంది, పంచశీలచే వెలుగొంది, సర్వమానవ సౌభ్రాతృత్వాభిమాన ములు కల్గి మానవజన్మలు సార్థకములై వెలుగొందును.

వేదములు - భగవద్గీత - ఖురాన్ - బైబిలు - ధర్మసూత్రములు ఆధారముగ "ఈ సర్వమతసార సంగ్రహము" ఎంతవరకు సఫలీకృతమైనదియు విజ్ఞానులు గ్రహింప ప్రార్థన. మతమనే మహాసాగరమును ఆధ్యాత్మికముగ తరచుట చాలాకష్టము. కనుక యిట్టి ప్రయత్నమునకు గడంగినందులకు క్షమించి యిందులోనితప్పులను దయతో మన్నించి తెలియపరచిన కృతజ్ఞతాభివందనములతో గైకొని సవరించుకోగలవాడను.

వేదగ్రంథములలోని మంత్రతంత్ర ప్రార్థనాదికములు పవిత్రవంతమైన వసుటు చేతను, బాహ్యాంతర శుచిశుద్ధములు కలవారలై, గురుముఖముగ ఉదాత్త అనుదాత్త స్వరితములతో వేదాధ్యయనము చేయుచు ఆచరించువారలు పరమేశ్వరానుగ్రహము బడసి ముక్తిగాంచెదరనుటకు సందేహములేదు.

ఈ గ్రంథమునకు ప్రధానప్రోత్సాహకులగు భక్తులు, పరోపకారపారీణులు, ఆంధ్ర శివానందలహరి కృతికర్త, దేవగ్రామ పంచాయితీఅధ్యక్షులు, భూస్వాములు అయిన శ్రీ మన్నెబులి తిరుపతిరాయుడుగారికి అనేకవందనములు.

దీనిలోని ఖురాన్‌షరీఫ్ అర్థములు జనాబ్ మౌల్వీమున్షీఫాజిల్ మహమ్మద్ అబ్దుల్ గఫూర్‌సాహేబ్, వైస్‌ప్రిన్సిపాల్, ఇస్లామియా అరబ్బిక్ కాలేజి, కర్నూలు వారి తెలుగుగ్రంథమునుండి గ్రహింపబడినవి. వారి కనేక కృతజ్ఞతాపూర్వక సలాములు.

ఈ గ్రంథవిషయములో తమసలహాలొసంగిన ఏలూరువాస్తవ్యులు జనాబ్ మీర్జాఖాజా మొహ్యద్దీన్‌సాహెబ్‌గారికి, శ్రీకృష్ణరాయబార గ్రంథకర్తగారగు శ్రీ దళిక సూర్యనారాయణమూర్తిగారికి, నర్సాపురం చర్చి ఫాస్టరు శ్రీ M. దేవ సహాయంగారికి అనేక వందనములు.

అనారోగ్యస్థితిలోనుండియు కోరినవెంటనే ఈ గ్రంథ మామూలాగ్రము శ్రమయనక పరిశీలించి తమ పీఠిక వ్రాసియిచ్చిన శతావధానులు, ఆధ్యాత్మిక వేదాంతోపన్యాసకులు బ్రహ్మశ్రీ మంచం బుచ్చిలింగప్పశాస్త్రిగారికి నా కృతజ్ఞతా వందనములు.

ఈ గ్రంథమునకగు వ్యయప్రయాసలు భరించి, అందముగ అచ్చొత్తించిఇచ్చిన ఉదారులు, భక్తులు, పరోపకారధురీణులు, వేంకట్రామ్ పవర్ ప్రెస్ అధిపతులైన శ్రీ ఈదర వేంకట్రావుపంతులుగారికి, వారి కుమారులైన శ్రీ ఈదర వేంకట్రామయ్య పంతులుగారికి, వారిమిత్రులు శ్రీ కె. విజయరామయ్యపంతులుగారికి, ఇందలి దోసగులను శ్రమయనక సవరణచేసిన సదరు ప్రెస్ మేనేజరులైన శ్రీ గోపాలుని వెంకట శేషయ్యపంతులుగారికి, పండితులు శ్రీమాన్ తెలికిచర్ల కందాడై వెంకట జగన్నాథాచార్యులుగార్లకు వందనసహస్రము లర్పించుచూ వీరలను పరమేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యములిచ్చి రక్షించుగాక యని ప్రార్థించుచున్నాను.

సిద్ధాంతం
15—8—1959

ఇట్లు విధేయుడు,
యస్. యమ్. జాన్.

## గుణశీలములు

మనదేశపు పౌరసత్వశీలం ముఖ్యంగా విద్యార్థిదశలోనే నిర్మాణమవుతూఉంది. కాబట్టి విద్యార్థిసంఘాలు మన జాతీయశీలస్వరూపాన్ని దిద్దితీర్చేవన్నమాట. మనము ఎలా ప్రవర్తిస్తున్నా మన్నదే శీలం. సాధారణముగా విద్యార్థుల ప్రవర్తనలనుబట్టి ప్రజలభావాలు రూపొందుతూఉంటాయి. అంటే నేటివిద్యార్థులే రేపటిపౌరులు గనుక విద్యార్థిదశలో వారి కలవడిన శీలాన్నిబట్టే ముందుముందు వారి భావాలు ప్రకటనమవుతూ ఉంటాయి. అందువలన విద్యార్థులు తమ పైనందిన జీవితరంగా లన్నింటను సచ్ఛీలాన్ని కనబరుస్తూ, జాతి ఔన్నత్యానికి ఆదర్శప్రాయంగా వ్యవహరించాలి. అయితే సచ్ఛీలనిర్మాణానికి స్వధర్మవిజ్ఞానం అవసరం. కాబట్టి పాఠశాలల్లో విద్యార్థులకు మతబోధ చేయాలి. అయితే ఈ బోధ "అన్ని మతాలు ఒకే లక్ష్యాన్ని చేరతాయి" అన్న ప్రాతిపదికమీద జరగాలి. అలా జరిగిననాడు మతవైషమ్యాలకు తావే యుండదు.

—శ్రీ రాజాజీ.

## విద్యార్థులు - జిజ్ఞాస

ఉపాధ్యాయులు విద్యార్థులలో జిజ్ఞాస బాగా రేకెత్తించాలి. ఉపాధ్యాయులు వ్యక్తిగతంగా ప్రతివిద్యార్థికి మార్గదర్శకులు కావాలి.

విద్యార్థులకు అన్నిమతాలలోయుండే పరమార్థాలూ, ముఖ్యమైన నైతిక సూత్రాలూ బోధించాలి. "మతవిరహితమైన రాజ్యం మనది" అన్నంతమాత్రాన మరి మతం మనకింక అవసరములేదని భావించరాదు. విద్యార్థులు వేరు వేరు మతాలలో ఉండే సూక్తులన్నీ గ్రహించి సంఘంలో భిన్న భిన్న వర్గాలవారితో వ్యవహరించే టప్పుడు వారు వాటిని ఆచరణలో పెట్టాలి. ఇందుకు తగిన మతబోధ విద్యార్థిదశలోనే జరగాలి.

—డాక్టరు కట్జూ.

## మతం

మానవజాతికి మతం చాలాఅవసరం. అయితే అది సమాజంలో ఒక నిర్మాణాత్మకశక్తిగా మారాలి. ఇందుకు మతాన్ని ఒక క్రొత్తపంథాలో నిర్మాణాత్మక విషయంగా మలచటం అవసరం. దీనికి మతసహనం ముఖ్యప్రాతిపదిక కావాలి.

—శ్రీ నీలం సంజీవరెడ్డి.

# విషయసూచిక

## మొదటి భాగము



## రెండవ భాగము

### సర్వమత నిబంధనలు



## మూడవ భాగము

### (సర్వమత ఆచార - పండుగ - ప్రార్థనాదికములు)

# సర్వమత సార సంగ్రహము

## మొదటి భాగము

### బిందువు

● బిందువు చుక్క. వాక్యాంతపు బొట్టు. Point. Full Stop. Atom. నుఖ్‌త – నుక్త:—

ఇలమ్ అనగా విద్య. అనగాజ్ఞానము (వేదమనగా జ్ఞానము). అటువంటి జ్ఞాన మరయు కీలకము ఒక బిందువు (Point – నుఖ్‌త) తో ఆధారపడియున్నది. అనగా తన్నుతాను తెలిసికొనేశక్తి కీలకము ఒక బిందువుతో (నుఖ్‌తేమే హై బేద్ సారా) సృష్టిస్థితిలయ రహస్యము లన్నియు ఆధారపడి యున్నవి.

శ్లో॥ బిందుమధ్యే జగత్సర్వం । బిందు త్రైలోక్యదర్పణం
బిందుమధ్యేస్థితం దేవం । బిందు ఖేచరమవ్యయం॥

అ॥ ప్రపంచము బిందువుయొక్క మధ్య యున్నది. ఆ బిందువే మూడులోకములకు అద్దమువలె ఆధారము. బిందువుయొక్క మధ్యనే దేవుడు గలడు. బిందువే సమస్తమునకు ఆధారము. (అనగా సృష్టి స్థితిలయములు అన్నియు ఆధారపడి యున్నవి).

హ॥ స॥ ఫిల్ – హల్ షాఖాదరిగారి కావ్యగ్రంథములో
తుజ్–హుస్‌నక్–ముస్‌హాఫ॥ మునే–హై–ఇస్‌మ్–బిసిమిల్లాహక–
నుఖ్‌తేమే–వుస్‌కే–హై–సిఫిత్–నూరే–రసూలుల్–ల్లాహక.

ఒక్క బిందువునుండి సమస్తసృష్టి ఏర్పాటయ్యెను. ప్రతి జీవరాశి ఆ యొక్క బిందువు నారయుట కష్టము. అటువంటి బిందువును ప్రవక్తలు – ఋషీశ్వరులు – మహాభక్తులు – వేద సంపన్నులై యోగాభ్యాసనలతో సాధించి దివ్యదృష్టి – దూరదృష్టి – దీర్ఘదృష్టి కలవారలై ఆగతానాగతములు – భూత భవిష్యద్వర్త

మానములు చెప్పగల ఆధ్యాత్మికశక్తిసంపన్నులై వెలుగొందిరి. వారలు వైరాగ్యసంపన్నులు.

నేడు అటువంటి అణువునుండియే సమస్తము ప్రారంభించు చున్నాము. శాస్త్రజ్ఞుడు ఆయొక్క బిందువును సాధించి చంద్ర, శుక్ర, సూర్యలోకము లారయుటకు ప్రయత్నించుచున్నాడు. ఎంతవరకు కృతకృత్యుడు కాగలడో చరిత్రయే నిరూపించవలసి యున్నది. కనుక ఆధ్యాత్మికముగ శాస్త్రము లగాయతు, విజ్ఞానశాస్త్రమువరకు ప్రపంచములోని చతుష్షష్టి కళలు, సమస్తవిద్యలు ఒకగరిమనాభియగు బిందువునుండియే ప్రారంభమగు చున్నవి. ఇట్లు సమస్త చరాచరము లన్నిటికి బిందువే జీవనాధారము. దానినే భగవత్స్వరూప మందురు. అందుచేతను హిందువులచే నీ బిందువు బొట్టుగా ధరింపబడు చున్నది.

అటువంటి బిందువును ఆధ్యాత్మికముగ యోగాభ్యాసనతో గురుశుశ్రూషచేసి సాధింపవలసి యున్నది.

## యోగాభ్యాసన

| | | | | |
|---|---|---|---|---|
| బిందు | — | నాద | — | కళ |
| ఓం | — | నమః | — | శివాయ |
| లా | — | యిలాహ | — | యిల్లిల్లాహ్ |

సృష్టికర్తకంటె యితరదైవము లేడు. ఉదాత్త, అనుదాత్త స్వరితములతో గురుశుశ్రూషద్వారా దీనిని సాధించవలసి యున్నది.

ఉపనిషద్వాక్యం:—

శ్లో॥ ఓంకారం బిందు సంయుక్తం । నిత్యంధ్యాయంతి యోగినః
కామదం మోక్షదంచైవ । ఓంకారాయ నమోనమః.

అ॥ భగవత్స్వరూపమైన ఓంకారము బిందువుతో కూడియున్నది. అటువంటి ఆ బిందువును యోగులు నిత్యము యోగాభ్యాసముతో ధ్యానించుచున్నారు. అది ధర్మార్థ కామముల సారాంశమైన మోక్ష సాధనము. అటువంటి ఓంకార స్వరూపుడైన దేవునికి వందనములు.

# రేఖలు

। — ||| — ≡ రేఖలు - గీటులు - గీతలు - ఒకటులు - నిలువు బొట్టులు - అడ్డబొట్టులు - I అలీఫ్ - ఇంగ్లీషు I ఐ - అక్షరము I అలీఫ్ = (ముస్లింవేదగ్రంథమందు ప్రథమాక్షరము) అలీఫ్‌తో కలిసి అల్లాః (దేవుడు.) నేను దేవుడను - సర్వజ్ఞుడను.

అద్వైతులబొట్టు = బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపు లగు (సృష్టిస్థితిలయకారకులు) కర్త ఒక్కడు.

. ద్వైతము =



విశిష్టాద్వైతము =  = అల్లాః (దేవుడు)

I (ఐ) ఇంగ్లీషుఅక్షరము (సోఽహంబ్రహ్మ)

అర్థము = నేను దేవుడను - ఒక్కడను - సర్వజ్ఞుడను. . బిందువు నిలువుబొట్టులు - అడ్డబొట్టులు - (నిలువుగీతలు) అడ్డగీతలు - వీనితో ఏర్పడుబొట్టులు, అక్షరములు భగవంతుడు సర్వజ్ఞుడని నేను అనియు అర్థములైయున్నవి. వీనిపైననే సృష్టిస్థితిలయములు ఆధారపడి యున్నవి. వీనిని అరయుట ఆధ్యాత్మికశక్తిపై ఆధారపడియున్నది. బిందువుతో ఏర్పాటైన నిలువుగీతలు - అడ్డగీతలు భగవత్స్వరూప ములు హిందువులచే ముఖమందు ధరింపబడి భక్తిశ్రద్ధలతో గౌరవింపబడుచున్నవి.

బైబిలు:—— ఆదియందు వాక్యముండెను. వాక్యము దేవుని యొద్ద యుండెను. వాక్యము దేవుడైయుండెను. యోహా 1 :: 1 : 4

. । ≡ ||| బిందువు - నిలువుగీతలు - అడ్డగీతలపైననే ప్రపంచ సృష్టిస్థితిలయములు ఆధారపడియున్నవి. నేటి నవనాగరికత ప్రపంచ మునకు భగవత్స్వరూపములైన యీ గుర్తులు సాధించిన మహా పురుషుల యోగాభ్యాసన సాధనలవలననే ప్రపంచము యింతగా

అభివృద్ధిలోనికి వచ్చినదని గుర్తింపవలసియున్నది. సైన్సుఅయినా శాస్త్రజ్ఞానమైనా, స్వయంపోషకమైనా, మానవుని అమూల్య మేధా పరిజ్ఞానమయినా, ఎంత ధైర్య సాహసబుద్ధి పరాక్రమములు కలిగినా దైవనూడుమార్గములు లేనిదే ప్రపంచసృష్టిస్థితిలయములు లేవని గ్రహించవలసియున్నది.

ప్రపంచపరిణామములు సాధించుట కవసరమైన బిందువు గరిమనాభితో ఏర్పాటైన గీతలతోనే జీవితపరికరములు తయారు చేసికొని మానవులు తమ జీవితములను సుఖప్రద మొనర్చుకొను చున్నారు.

నేటి టెలివిజన్ – రాకెట్సు – రేడియో; టెలిఫోన్ – అణువు (Atom) బిందువు ఆధారములేనిదే సాధ్యముకాదని ఘంటాపదముగ చెప్పవచ్చును. కాని యిది అంతయు శాస్త్రజ్ఞుడు శాస్త్రజ్ఞాన మను చున్నాడు. కాని భగవంతుని శక్తిసామర్థ్యములు గ్రహించవలసి యున్నది.

బిందువు – నిలువుగీతలు – అడ్డగీతల అర్థములలో సృష్టిస్థితిలయ ములు ఆధారపడియున్నవని తెలిసికొన్నాము.

## దేవుడు త్రైకదేవుడు

మత్త 3 : 13; 17; 28 : 16-20

నీదేవుడైన యెహోవానునేనే. నేనుతప్ప వేరొకదేవుడు నీకుండకూడదు అని దేవుని 10 ఆజ్ఞలలో ఒకఆజ్ఞ. దేవుడు ఏకదేవుడై యున్నాడు. ఆయన తండ్రి – కుమారుడు – పరిశుద్ధాత్మ అను బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపులుగ 3 మూర్తులుగా యున్నారు. వీరు ముగ్గురు ఏకదేవుడైయున్నారు. కాని ముగ్గురు దేవుళ్లుగారు. క్రీస్తు తన శిష్యులకిచ్చిన చివరియాజ్ఞవలన పరిశుద్ధత్రిత్వములో ముగ్గురు మూర్తులున్నట్లు తెలిసికొనగలము. ఈ ముగ్గురు 1. తండ్రి 2. కుమారుడు 3. పరిశుద్ధాత్మ క్రీస్తు బాప్తిస్మ మొందినసమయములో

కనబడిరి. అట్టి పరిశుద్ధాత్మ త్రిత్వము నారయుట గురుశుశ్రూష చేయుచూ యోగాభ్యాసనలతో అంతః బాహ్యశుద్ధి కలవారలై ఆ యొక్క బిందువును పరమాత్మ స్వరూపమును (ఐ) I నేనుఅనెడి భగవంతు నారయుచున్నారు.

నిలువుబొట్టు I అలీఫ్ – ఇంగ్లీషు అక్షరము ఐ అక్షరముల అర్థము నేను అనే అర్థము పరమాత్మునికి ఒప్పుచున్నది. (అటువంటి త్రిగుణాత్మకమగు దేవుడు–కుమారుడు – పరిశుద్ధాత్మ, బ్రహ్మ విష్ణు మహేశ్వరరూపములుగ) దేవు డగుచున్నాడని తెలిసికొన్నాము గనుక అదేవిధము సోహంబ్రహ్మ–నే నేబ్రహ్మను అను ఆధ్యాత్మిక ముగ దేవుడు ఒక్కడు అని గోచరించుచున్నది. సోహంబ్రహ్మను ఆత్మవిమర్శనను చూడుడు.

## వేదము : ఆధ్యాత్మికము

వేదమనగా జ్ఞానము. దానినే ఇలమ్ అందురు. తన్నుతాను తెలిసికొనుటయే విద్య. (జ్ఞానమని తెలిసికోవలసియున్నది.)

ఆస్మాన్ అనగా ఆకాశము; జమీన్ అనగా భూమి; జిసమ్ అనగా శరీరము; రూః హ్ అనగా జీవుడు ఇవి ఎట్టివి అని తర్కించుకొని, మబ్దా (అనగా ప్రారంభసృష్టి) మేము ఎక్కడనుండి వచ్చితిమి? ఏ స్థితిలో యుంటిమి? మ ఆష్ (అనగా జీవనస్థితి అందుకు) అనగా ఏమి తినవలెను? ఎచ్చట నివసింపవలయును? మ అద్ అనగా మరణించినపిదప ఏమగును? నాకేమి ఫలితము? అని విమర్శించుకొనుటయే ఆధ్యాత్మిక మందురు; అనగా భగవత్సంబంధమైనది; ఆత్మకు సంబంధించినది.

## ఆ త్మ వి మ ర్శ

ఆత్మఅనగా జీవుడు. ఆత్మవిమర్శమనగా ఆత్మకుసంబంధించిన శ్రోత్రాదులును ప్రాణమనోబుద్ధ్యాదులునుగూడ ఆధ్యాత్మికములేగనుక వానిని విమర్శించుటయే ఆత్మవిమర్శనము. అనగా తానుచేయవలసిన

ధర్మాధర్మములు, ఆచరించవలసిన విధ్యుక్తధర్మములు విమర్శించు కొనుటయే ఆత్మవిమర్శ. ఈ విధముగా ఎవరు విమర్శించుచూ, ఎవరీ సమస్తము తెలిసికొనుచున్నారో! ఈ సమస్త భూతములు ఎవరిని తెలియజాలవో ఆ పరతత్వస్వరూపమగు ఆత్మస్వరూపము దేవుడని తెలియజేయుచున్నవి. ఆత్మస్వరూప మనగా తన్ను తాను తెలిసికొనేశక్తి నెరుగుట.

## ఆత్మస్వరూపము : ఆనందోబ్రహ్మ

ఆత్మస్వరూపుడే దేవుడనియు, సృష్టిస్థితిలయముల ఏర్పాటు గురించి తెలిసికొన్నాము. అటువంటి భగవంతుడు చరాచరులన్నిటిని బిందువృత్తోను, రేఖలతోను ఏర్పాటుచేసి దేవుని సృష్టిచిత్రము లెవరికి తెలియదని నిరూపించియున్నాడు. అటువంటి సృష్టిలో మానవజన్మ ఉత్కృష్టమైనది.

ఆడ మగ వివక్షతఏర్పాటుచేసి కాలములఏర్పాటువిధముగనే బాల్య యౌవన కౌమార వృద్ధాప్యదశలు కలిగించి జీవరాసులయొక్క విలాసములు, వేడుకలు, కష్టసుఖములు తిలకించుచూ భగవంతు డానందించుచున్నాడు. నేడు మానవుడు చంద్ర సూర్యలోకములు చేరుటకు ఎంత ప్రయత్నించి కృతకృత్యుడయ్యెను, ఇవియన్నియు దేవునిమూలముననేతప్ప వేరుసాధ్యముకాదని చెప్పనవసరములేదు. పురాణపురుషులు, భగవదంశ సంభూతులు, ప్రవక్తలు మొదలగు మహాపురుషులు స్వర్గలోకమునకు వెళ్ళుట, తిరిగివచ్చుట మొదలగు విషయములు సత్యములని యిప్పుడు పూర్తిగా నమ్ముట కాస్కార మయ్యెను.

ప్రతి జీవరాశికి బాల్యావస్థ దాటి యౌవనావస్థ ప్రారంభము కాగానే విషమైపిణాం అనునట్లు విషయముల గ్రహించుట కను కూలమైన కామము ఏర్పాటు చేసియున్నాడు. అనగా కోర్కెలు కోరుట అను విషయవాంఛ ఏర్పడి కామముగలవాడై తన యంత రాత్మకు శాంతినిచ్చు పదార్థమునకు వెదుకవలసినవా డగుచున్నాడు.

అదియే సంతోషము. అటువంటి సంతోషమువలననే భగవంతుడు స్త్రీపై పురుషునికి, పురుషునిపై స్త్రీకిని ఒకరిపై నొకరికి ఒక ప్రేమ పాశమును తగిలించినాడు. ఆ ప్రేమయే సంతోషము. ఆ సంతోష మనెడి ప్రేమవలన ప్రతిజీవి ఆనందమున నోలలాడుచున్నది. సంతోషముచేత భావ మణగును. దేహమును మరచి మనోదేహముల నధిగమించి ఆత్మ ఎచ్చటికో పోవును. అదియే నిజమైన సౌఖ్యము. అదియే ఆనందము. అదియే ఆనందస్వరూపము. ఆ ఆనందమే భగవత్స్వరూపము – భగవంతుడే ఆనందము – ఆనందమే భగవంతుడు – అదియే ఆశాజ్యోతి – ఆ ఆనందమే ప్రపంచ మార్గదర్శి. అదియే మానవకల్యాణము – అదియే లోకకల్యాణము – దానివలననే సంతానాభివృద్ధి – ఆ సంతానమువలననే ప్రపంచవృద్ధి క్షయములు ఏర్పాటై యున్నవి. అనగా ఆనందమనెడి భగవంతునివలన ప్రపంచము (ప్రకృతియొక్క) సృష్టిస్థితి లయములు సంభవించుచున్నవి. ఆ ఆత్మ స్వరూపమగు బ్రహ్మస్వరూపమే నేను. ఆ బ్రహ్మను (అహం) నేను అనే వాక్యమును విమర్శించుటయే ఆత్మవిమర్శ. ఆత్మస్వరూపమగు బ్రహ్మస్వరూపమే నేను.

## నేను : (అహం)

ఆధ్యాత్మోపనిషత్తు

శ్లో॥ యత్రైష జగదాభాసో – దర్పణాన్తః పురం యథా
తద్ బ్రహ్మాఽహమితిజ్ఞాత్వా కృతకృత్యో భవానఘ॥

అ॥ అద్దమునందు అసత్యనగర ప్రతిబింబమువలె ఏ బ్రహ్మ స్వరూపమునం దీ మిథ్యాప్రపంచము తోచుచున్నదో ఆ బ్రహ్మము నేనేనని తెలిసికొని నెఱవేర్చబడిన ప్రయోజనుడవు కమ్ము.

శ్లో॥ అహం మమేతి యో భావో దేహాక్షాదావనాత్మని
అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా బ్రహ్మనిష్ఠయా॥

అ॥ అనాత్మయగు దేహము బుద్ధి యింద్రియ ప్రాణ మనస్సు లందగు (అహం) నేను నాయొక్క మాటకు అధ్యాస మందురు. ఈ మాటను బ్రహ్మనిష్ఠచేత విద్వాంసులు విడిచిపెట్టవలయును.

శ్లో॥ జ్ఞాత్వా స్వప్రత్యగాత్మానం బుద్ధి తద్వృత్తి సాక్షిణమ్
సోఽహ మిత్యేవ తద్వృత్త్యా స్వాఽన్యత్రాత్మమతిం త్యజేత్॥

అ॥ దేహేంద్రియ ప్రాణమనోబుద్ధ్యవిద్యలకంటె వేరగు నాత్మ ప్రత్యగాత్మ (అనగా ఆ ప్రత్యగాత్మయే నేను) కావున నా ప్రత్యగాత్మ బుద్ధ్యాది రూపుడు గాక బుద్ధికిని, నిశ్చయాధ్యాత్మికములగు తద్వ్యాపారములకు సాక్షి అని తెలిసికొని తానేనన్న భ్రాంతిని విడిచి పెట్టవలయును.

శ్లో॥ అహంకారాగ్రహే స్మ్రక్తః స్వరూప ముపపద్యతే
చంద్రవత్ విమలః పూర్ణః సదానన్దః స్వయంప్రభః॥

అ॥ అహంకారముయొక్క స్వరూపముయొక్క ధర్మమును విచారించినవానికి అహంకారము నశించి చంద్రునివలె మాలిన్యము లేనివాడై సంపూర్ణమైన సచ్చిదానందస్వరూపముచే వెలయుచూ స్వయముగా ప్రకాశించును. అనగా నేను అనెడి అహంకారమును గుర్తించి విమర్శనచేయగా అహంకారము నశించును.

## అనాత్మ

అనాత్మయగు నేను అగు దేహేంద్రియ మనోబుద్ధ్యాదులగు అహంకార మమకారములు విడిచిపెట్టి, ఆత్మస్వరూపుడే బ్రహ్మ యని యెరింగి యెల్లప్పుడు ఆత్మనే ధ్యానించవలయును. దీనిచే అనాత్మ తిరస్కరించబడి వెలుగు (జ్ఞానము) తేజస్సు స్వయముగానే ప్రకాశించును. కనుక దేవుని గీతావాక్యములును సద్గురువలన మనోవాక్కాయ కర్మల నేకీభూతంబుచేసి అంతరార్థ పర్యాలోచనకలిగి అరిషడ్వర్గములును, సప్తవ్యసనములును అరికట్టి అంతఃబాహ్యశుద్ధిగల వారలై నేనెవడని విచారించి, భగవంతునిధ్యానమందు లీనమై యోగాభ్యాసనలతో సాధించి ఆత్మస్వరూప సాక్షాత్కారమును బడయుటయే జన్మించినందులకు సార్థకమగును.

# ఆత్మగుణములు

శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం - పుష్ప మింద్రియ నిగ్రహః
సర్వభూతదయా పుష్పం - క్షమాపుష్పం విశేషతః
శాంతిపుష్పం తపః పుష్పం - ధ్యానపుష్పంచ తథైవచ
సత్య మష్టవిధం పుష్పం - విష్ణోః ప్రీతికరం భవేత్.

పై ఎనిమిది ముఖ్యగుణములు సమస్త మానవులకు ఆవశ్య ముగ యుండవలయును.

1. సర్వభూతములయందు దయ (మొహబ్బత్):—ఇది ఆత్మ గుణములలో మొదటిది. సమస్తప్రాణులయందు దయకలిగియుండుట. ఇది లేనిమానవుడు ఎన్ని యుత్తమగుణములు కల్గియున్నను పశు ప్రాయుడే యని చెప్పవచ్చును.

2. క్షాంతి (సబర్):— ఇది రెండవ యాత్మగుణము. ఎట్టి బాధలనైనను సహించుటయే క్షాంతి. ఆబాధలు శీతవాతాదులనుండి గాని, మానవులనుండిగాని రావచ్చును. వానిని భరించునపుడు విచారము పొందరాదు. వానిని కలిగించిన మానవుని ద్వేషింపరాదు.

3. అనసూయ (బేకీనా):— 3 వ ఆత్మగుణము. ఇతరుల కేవిధమైన యభివృద్ధికలిగినను అందులకు బాధపడకుండుట, వారిని ద్వేషింపకుండుటయు అనసూయ యనబడును. అసూయ హృదయ ములో చిచ్చువలె కాల్చుటయే గాక యొకప్పు డితరులకు హాని కలిగించును.

4. శౌచము:— (వపా) 4 వ ఆత్మగుణము. శరీరము మనకు, మనకు సంబంధించిన వస్తువులను, వాక్కును, మనస్సును పరిశుద్ధముగ నుంచుకొనుటయే శౌచము. శరీరశుద్ధిలేనివారికి మనశ్శుద్ధియుండదు. శరీరము స్నానము ధౌతవస్త్రధారణముచే శుద్ధినొందును.

(క) సత్యభాషణము, ప్రియహితభాషణము ఇవి పుణ్య కర్మలు. వీనివలన ఇహమందును, పరమందును ఉత్తమగతి ప్రాప్తించును. అసత్యము, వాక్పారుష్యమువలన వ్యతిరేకఫలము కలుగును.

(ఖ) వాక్శుద్ధివలన మనశ్శుద్ధికూడ కలుగును. వాక్శుద్ధి అభ్యుదయ హేతువు.

మనశ్శుద్ధివలన ప్రయోజనములు:— మనశ్శుద్ధి సత్వగుణ లక్షణము. సత్వము జ్ఞానమార్గముగాన మానవులకు మనశ్శుద్ధి తరుణ సాధనము. మనశ్శుద్ధివలన ధర్మాసక్తి, నిష్కామకర్మాసక్తి కలుగును. వీనివలన జ్ఞానము ప్రాప్తించును. ఇట్లు యీ 4 విధములైన శౌచములు కల్గియుండుట దైవసంపత్తులోనిది. ఇది లేకుండుట అసురప్రకృతి లోనిది.

5. అనాయాసము (హుస్‌నె-నియ్యత్):—ఆత్మగుణము తన శక్తికిమించిన ధర్మములు చేయబూనికొని, పరహింస మున్నగు ధర్మములలోగాని, శారీరక మానసికాయాసములను పొందువాడు తమోలక్షణోపేతుడు. అసురప్రకృతిలోనివాడు. భగవంతునకు నివాస మైన మన పవిత్రశరీరమును వ్యర్థముగాగాని, అహంకారయుక్తకార్య ములకొఱకు గాని బాధపెట్టుట యన అందలి పరమేశ్వరుని బాధ పెట్టుటయే అని గ్రహింపవలయును. ఎల్లప్పుడు సంతోషము కలిగి యుండుట ఉత్తమపురుష లక్షణము. ఎట్టి ప్రబలబాహ్యహేతువు లున్నను ఆంతరంగికముగ మనస్సును కలతనొందనీయక నిరంతరము మనస్సౌఖ్యము అనుభవించుట అనాయాసమునకు పరమావధి.

6. మంగళము (అల్‌హందులిల్లా):— ఆరవ ఆత్మగుణము నిరంతరము మనము శుభమునే తలచుచుండవలయును. శుభమునే చూచుచుండవలయును. శుభమునే వినుచుండవలెను. శుభము కావలెనని వాంఛించుచుండవలయును. అశుభవిషయముల దరిచేర నీయరాదు. అశుభకార్యములకు పూనరాదు. అశుభములను పలుక

రాదు. అమంగళమును తప్పనిసరిగ తెలుపవలసినపుడు సాంకేతముగ మంగళపదమునే వాడవలయును.

7. అకార్పణ్యము (తవకల్ అలల్లాః):—ఏడవ ఆత్మగుణము. ఎన్నడును దైన్యమును పొందకుండుట. ఒక బాధకలిగినప్పుడు దానిని తప్పించుకొనుటకై యొకరి సహాయముకోరి దానికొరకై వారికి దాసుడుగ వ్యవహరించుట దైన్యము. ఇట్టి దైన్యపరుడు భగవంతుని యందు విశ్వాసము లేనివాడగుచున్నాడు. సుఖదుఃఖములయందు కోరిక లేకుండుటయే జన్మసాఫల్యము.

8. అస్పృహ (ఖనా - అత్):—ఎనిమిదవ ఆత్మగుణము అనగా కోరికలు లేకుండుట. మానవునిఘనతను నిర్ణయించుటలో కామ విషయము కొలతబద్ద. మానవునికోరిక లెంత హెచ్చుగానున్న వాడంత నికృష్టుడు. కోరికలెంత తక్కువగానున్న వాడంతయుత్తముడు. ఏమియు కోరికలులేనివాడు సర్వోత్తముడు. ఇతరులు తమంతటతాము యేదియైనను దానమొసంగినను గ్రహింపకుండుట అస్పృహయొక్క పరమావధి.

9. ఇతరగుణములు:—ప్రతిమానవుడు పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, అతిథిపూజ, సత్పురుషసహవాసము మున్నగు గుణములు కలిగియుండవలయును. మానవుడు తరించుటకు కర్మకాండ నియమములు - ఆత్మగుణములు కలిగియుండవలెను. పైవానినన్నిటికి ముఖ్యమగు శీలములేనిచో మానవుడు తరింపజాలడు.

10. బైబిలు:—(1)మీరు పరిశుద్ధులై యుండవలెను. మీ దేవుడనైన యెహోవానగు నేను పరిశుద్ధుడనై యున్నాను. లేవీ 19 : 2

(2) దేవుడు ప్రేమస్వరూపి. ప్రేమలేనివాడు దేవుని నెఱుగడు. యోహాన్ 4 : 8

(3) గొప్ప యైశ్వర్యముకంటె మంచిపేరును, వెండిబంగారములకంటె దయయు కోరతగినవి. సామె 22 : 1

(4) యోగ్యమైన నడత. కీర్తన 15

# పరిశుద్ధాత్మ

నేను తండ్రిని వేడుకొందును. మీయొద్ద ఎల్లప్పుడు ఉండుటకై ఆయన వేరొక ఆదరణకర్తను, అనగా సత్యస్వరూపి అగు ఆత్మను మీ కనుగ్రహించును. లోకము ఆయనను చూడదు. ఆయనను ఎరుగదు. కనుక ఆయనను పొందనేరదు. మీరు ఆయనను ఎరుగుదురు. ఆయన మీతోకూడ నివసించును. మీలో ఉండును అని ప్రభువైన క్రీస్తు చెప్పెను. యోహా 14 : 16, 17.

ఆదరణకర్త అనగా తండ్రి నా నామమున పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును మీకు బోధించును. యోహా 14 : 26.

దేవుని పరిశుద్ధాత్మను దుఃఖపరచకుడి, విమోచనదినమువరకు ఆయనయందు మీరు ముద్రింపబడియున్నారు. ఎఫె. 4 : 30.

ఆత్మానుసారముగ మీరు నడుచుకొనుడి. అప్పుడు మీరు శరీరేచ్ఛను నెరవేర్చరు. గలతీ 5 : 16.

దేవుని ఆత్మచేత ఎందరు నడిపింపబడుదురో వారందరు దేవుని కుమారులై యుందురు. రోమా 8 : 14.

ఆత్మపూర్ణులై యుండుడి. ఎఫె. 5 : 18.

ఆత్మ ఫల మేమనగా, ప్రేమ, సంతోషము, సమాధానము, దీర్ఘశాంతము, దయాళుత్వము, మంచితనము, విశ్వాసము, సాత్వికము, ఆశానిగ్రహము – ఇట్టి వానికి విరోధమైన నియమమేదియు లేదు. గలతీ 5 : 22; 22.

"మీరు నిందపాలైనయెడల మహిమాస్వరూపియైన ఆత్మ అనగా దేవునిఆత్మ మీ మీద నిలుచుచున్నాడు గనుక మీరు ధన్యులు. పేతు 4 : 14.

క్రీస్తుగుణములు మనకు మాదిరియై యున్నవి :—

ఆయన సర్వసద్గుణములతో సంపూర్ణుడైయున్నాడు.

ఆయనలో ప్రేమ, వినయము, కృతజ్ఞత, విశ్వాసము, సంతోషము, ఓరిమి, విధేయత, సమాధానము, శాంతము, దయ, ధైర్యము మొదలగు శ్రేష్ఠగుణము లన్నియు పూర్ణముగా నున్నవి. ఆయనకు కలిగిన ఈ మనస్సు మనము కలిగియుండవలెను. ప్రధాన వాక్యము

1. మన మాయన ఆజ్ఞలను గైకొనుటే దేవుని ప్రేమించుట. ఆయన ఆజ్ఞలు భారమైనవి కావు. యోహా 5 : 3

2. ఆయనే మొదట మనలను ప్రేమించెను. గనుక మనము ప్రేమించు చున్నాము. యోహా 4 : 19

## సోహం బ్రహ్మ (నేనే బ్రహ్మను)

ఆత్మస్వరూపమే బ్రహ్మయని ఎప్పుడైతే తనను తాను తెలిసి కొనునో అహంకారము నశించి అహ మంతటను స్వయముగా ప్రకాశించును. అంతట తాను కళానిధివలె సత్యజ్ఞానానందుడగుచు వెలయుచు ప్రకాశించును.

నీవాక్యములు వెల్లడియగుటతోడనే వెలుగు కలుగును.
కీర్త 119 : 130

శ్లో॥ అహంబ్రహ్మేతి విజ్ఞానాత్ – కల్పకోటి శతార్జితమ్
సంచితం విలయం యాతి – ప్రబోధాత్ స్వప్నకర్మవత్॥

అ॥ నేనే బ్రహ్మయనెడి విజ్ఞానమువలన అనేకకోట్ల జన్మములందు సంపాదింపబడిన సంచితకర్మయంతయు స్వప్నమునందలి ప్రబోధమువలె నిశ్శేషముగా నశింపజేయబడును.

# దేవుడు ఒక్కడు

"సర్వభూతాన్తరాత్మా౽పహతపాప్మా దివ్యోదేవ ఏకో నారాయణః"

అ॥ సమస్తమైన భూతములకు అంతరాత్ముడు, పాపరహితుడు, దివ్యుడు, దేవుడు అగు నారాయణు డొక్కడు.

ఖురాన్ – సూ – ఇఖ్లాస్ – మక్కీ – 4 వాక్యములు

1. ఖుల్ – హువల్లాహు – అహద్ 2. అల్లావుస్ – సమద్ 3. లమ్ – యలిద్ 4. వలమ్ – యూలద్ – వలమ్ – యకుల్ – లహూ–కుఫ్వన్ – అహద్

అ॥ దేవుడు ఒక్కడు. అతనినుండి స్వతంత్రముగా నుండునది ఎద్దియు లేదు. అతడు పుట్టినవాడుకాడు. అతనికి పుట్టినవారు ఎవ్వరులేరు.

భగవద్గీత : అ 10 శ్లో. 3

శ్లో॥ యో మా మజ మనాదించ వేత్తి లోక మహేశ్వరమ్
అసమ్మూఢ స్సమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥

అ॥ నేను పుట్టుకలేనివాడను. అనాదిగా యున్నవాడను అని ఎవరు తెలిసికొని జ్ఞానవంతులగుదురో వారు సర్వపాపములనుండి దూరులగుచున్నారు.

అ 9 శ్లో. 17.

శ్లో॥ పితా౽హ మస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజు రేవచ॥

తా॥ ఈ జగత్తునకు నేనేతండ్రిని, తల్లిని, తాతను, తెలియదగినవాడను, సృష్టించువాడను, శుద్ధమైనవాడను ప్రణవస్వరూపమగు ఓంకారమును.

బైబిలు:—మనకు ఒకేదేవుడున్నాడు ఆయన తండ్రి – ఆయన మూలమున సమస్తమును కలిగెను. ఆయననిమిత్తము మనమున్నాము.

మరియు మనకు ప్రభువు ఒక్కడే. ఆయన ఏసుక్రీస్తు (ఏసు = రక్షకుడు; క్రీస్తు = అభిషిక్తుడు) ఆయనద్వారా సమస్తము కలిగెను. మనము ఆయనద్వారా కలిగినవారము. 1 కొరింథీ 6 : 8.

నీ దేవుడనైన యెహోవాను నేనే. నేనుతప్ప వేఱొక దేవుడు నీకుండకూడదు. ని. 2 : 2, 3.

దేవుడు ఆత్మగనుక ఆయన నారాధించువారు ఆత్మతోను, సత్యముతోను ఆరాధింపవలెను. యోహాను 4 : 24.

నేననెడి అహంకార మమకారములకు స్వస్తిచెప్పి ఆత్మస్వరూపుడగు పరమాత్ముడే తానని కర్తవ్యతారూఢుడై తరించుటకు వేదమే ప్రమాణము వేదమనగా జ్ఞానమని తెలిసికొన్నాము. అటువంటిజ్ఞానముతోకూడిన ఆత్మవిమర్శనము ప్రశంసమహిమముతో ఏర్పాటైయున్నది. ప్రశంసమహిమము లరయుటకు వేదములు–భగవద్గీత – ఖురాన్ – బైబిలు మొదలగు వేదవాక్యముల ధర్మసూత్రములవలననే ప్రపంచమంతయు ఆధారపడియున్నది. దేవుడు నుఖ్త (బిందువుతో) సృష్టిస్థితిలయములు ఏర్పాటుచేసెనని తెలిసికొన్నాము.

అటువంటిసృష్టిలో నేను అనగా మానవజన్మ సార్థకమగుటకు ఆత్మవిమర్శతోకూడిన భగవత్స్వరూప మారయుటకు, ధర్మార్థకామముల సార్థాంశమగు మోక్షమార్గాన్వేషణమునకు ప్రశంస మహిమ వేనోళ్ళ కొనియాడవలసి యున్నది.

అందుకు ఆనందమనెడి బ్రహ్మమువలన ఏర్పాటైన సృష్టిలో మానవజన్మ ఉత్కృష్టమైనదని తెలిసియేయున్నది. కనుకనే ఏ జీవ రాశికిని యివ్వనటువంటి జ్ఞానరత్నమును ప్రసాదించియున్నాడు. ఆ జ్ఞానరత్న ముపయోగించుకొన్నవాడే ఇన్సాన్ (మానవుడు). మానవుడు తన సంతానాభివృద్ధికి తగు సేవచేయుట కవసరమైన శీలమును వృద్ధిచేసికొనవలసియున్నది.

## శీలము (ఇల్మి అఖాయద్)

శీలమనగా సదాచారము. దానినే సత్ప్రవర్తన మందురు. దాని నరయుటకు సత్క్రియలు - సాధుసజ్జనసేవ - అతిథి అభ్యాగతుల సత్కారములు - వేదపఠన, భగవత్ప్రార్థన, దానధర్మములు యాత్రాది శుభాశుభ పుణ్యకార్యములు, మాతా పితృసేవలు - గురు భ్రాతృజనుల సేవలు - అరిషడ్వర్గములకు; సప్తవ్యసనములకు లోను కాకుండుట, అంతఃబాహ్యశుద్ధికలవారలగుట, మానవుల కవసరము లైన 8 ఆత్మగుణములు కలవారలై సంచరించుట, గృహస్థాశ్రమ ధర్మములు నిర్వర్తించుటలో దైవారాధన వీడకుండుట మొదలగు పుణ్యకార్యములవలన మానవులశీలము వృద్ధిచెందును.

ఈ శీలమనే మహాశక్తిగల భక్తులకు సాధించరాని కార్యములు లేవు. ఈ శీలమనే మహాశక్తిగలవారలకు శారీరక మానసిక బలము లెంతమాత్రము సరిగాక ఆధ్యాత్మిక శక్తిసంపన్నులై వెలుగొంద గలరు. ఈ శీలమనే శక్తిచే పరిపాలకులు - చక్రవర్తులు - మహా పురుషులు ఋషులు - సంఘోద్ధారకులు - దైవతత్వరులు మొదలగు మహాత్ములు ఎంతటి ఘనకార్యములు సాధించినదియు ప్రత్యక్షముగ చూచుచున్నాము. వారలు మానవసంఘములకు చేసిన మహోప కారములవలననే మన మీ స్థితికి వచ్చినవార మనుటకు సందేహములేదు.

ఇట్లు ఎవరిశీలమును వారు వృద్ధి చేసికొనుచు గృహములోని వారలకు సేవచేయుచూ; సక్రమముగా నడుచుటకు బాటలువేయుచూ గృహములోని వారలు ఎవరి శీలమును వారు వీడకుండున ట్లాదేశిం చుచూ; సంఘ కట్టుబాట్లకు లోనై ఆచరించుచూ, సత్క్రియలు చేయుచూ నిస్వార్థపరులై ప్రేమ అనే ఆశాజ్యోతిని వెలిగించుచూ తన జీవితాశయమును నెరవేర్చుకొనుచూ, తన విధ్యుక్త ధర్మముల యందు ఆధ్యాత్మిక చింతకలవాడై, స్వాతంత్ర్యేచ్ఛతో మెలగుచూ స్వగృహమే స్వర్గసీమగా వెలయుట కాస్కారమైన సామదానము లుపయోగించుకొనుచూ, చిఱునవ్వును చిఱుత ప్రాయమువలె

సంతోషాయత్త చిత్తుడై సంభాషణలతో కూడిన సంసార సాగర సంఘములలో కలుగు వివాదములనే తుఫానులకు లోనుగాక సుడిగాలులైన అభిప్రాయభేదములను దాటి, తప్పులెన్ను వారలయందు హృదయ పరివర్తన కలవారలై మానవుల అవసరముల గుర్తెరింగియు ఎదుట మనుష్యుల ప్రాముఖ్యత గమనించియు, తమ జీవితములో కలుగు కష్ట సుఖముల పరిణామములలో మొక్కవోని ధైర్య సాహస బుద్ధుల నుపయోగించుకొనుచు, సంసార సాగరములో తన నౌకను నడిపి కృతకృత్యుడైనవాడే మనుష్యుడు. అప్పుడే తన నామధేయ మును సార్థక పర్చుకొని సంఘవిజయుడై వెలుగొందును. వీట్లను తరించనివాడనామధేయుడు. అప్పుడే తనశీలముయొక్క ప్రయోజనము. నాడు తనసంఘాభివృద్ధి గ్రామ, దేశ, ప్రపంచవృద్ధియై మానవ సేవయే మాధవ సేవయై విలసిల్లగలదు. అదియే గ్రామకల్యాణము - దేశ - ప్రపంచ కల్యాణము. అనగా తన శీలసంపదతో వెలయుచూ ఖ్యాతి గాంచిననాడు తన జన్మసార్థకమై ఇహపర సౌఖ్యము లనుభవించి ఆచంద్రార్కముగ ప్రకాశించగలడు. ఓమ్ తత్ సత్

శ్లో॥ సంసారసాగరం ఘోరం। తర్తు మిచ్ఛతి యో నరః।
గీతా నావం సమాసాద్య। పారం యాతి సుఖేన సః॥

తా॥ జననమరణములనెడు ఘోరదుఃఖములకు కారణమగు ఈ సంసారసాగరమును దాటుటకు ఏనరుడు కోరుచున్నాడో అతడు గీతయను నావయందు గూర్చున్న యెడల సుఖముగ దాటగలడు.

శ్లో॥ గీకారం త్యాగరూపంస్యాత్। తత్వబోధం తకారకమ్
గీతావాక్యమిదంతత్త్వం। జ్ఞేయం సర్వముముక్షుభిః॥

తా॥ "గీ" అను అక్షరము త్యాగమును బోధించుచున్నది. "త" అను అక్షరము తత్త్వబోధను ఆత్మను ఉపదేశించుచున్నవి. గీత అను రెండుశబ్దములకు యిది అర్థము అని ముముక్షులందరు తెలుసుకొనందగును.

**సూచన:—ఇట్లే సంసారనౌకను నడిపి దాటుటకు గల మార్గములను ఖురాన్ షరీఫ్, బైబిలు, వేదగ్రంథములు ఉపదేశించుచున్నవి.**

# భగవద్విషయములు

మత మనునది ఇహపరసౌఖ్యముల కాస్పదమైన భగవంతుని చేరుటకు సాధనమని సర్వమతములయొక్క సారాంశము. ప్రతి మతములోను మానవు డున్నతస్థితి పొందుటకు మూడు మార్గము లున్నట్లు ఋజువగుచున్నది.

(1) కర్మ (2) భక్తి (3) జ్ఞానము.

ఈ మూడిటికి సామాన్యలక్షణము భగవద్విషయము. దేవుని కిష్టమైన ఆజ్ఞలు, భగవంతుని ప్రీత్యర్థముచేయుట కర్మయోగము. భగవంతుని అనుగ్రహము బడయదగినది జ్ఞానము. కొందరిమతమున భక్తిని దృఢపరచునది జ్ఞానము. ఇట్లు ప్రతిమతములోను సమస్తము భగవన్మయమే కావున భగవంతునితో సంబంధించనిది ఏదియులేదు. దీనినే ఈమాన్ అందురు. అనగా విశ్వాసముయొక్క కళలుగా రూపొందుచున్నవి. విశ్వాసముయొక్క కళలు చూడుడు.

భగవంతుని ముఖ్యలక్షణముల గురించి అన్ని మతములందలి, అన్నిసాంప్రదాయములవారు నేకీభవించుచున్నారు. పరమేశ్వరుడు సర్వవ్యాపి - సర్వజ్ఞుడు - సర్వాధారము - సర్వశక్తిమంతుడు. సృష్టి స్థితిలయ కారకుడు. ఈ జగత్తు అశాశ్వతము. మన యూహకు మాత్రము గోచరమగునట్టియు లేదా యూహాతీతకు గూఢమైనట్టియు, అట్టిపరిస్థితులలో అద్వితీయమై యుండునదియే పరమాత్మ. స్వజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైన ఆ ఆత్మ సచ్చిదానంద స్వరూపమే నేననియు, అటువంటి నేననెడి అహంకార మమకారములు విడిచి పెట్టినవారు నూర్ (తేజస్సు)చేత వెలుగొంది, మహాజ్ఞానులు యోగాసనాది క్రియలచే అనుభవించుచున్నారు.

దేవునిభక్తి విషయములో హిందూమతములోని అద్వైత ద్వైత విశిష్టాద్వైత మతముల భేదములు నామమాత్రములు.

## అద్వైత ద్వైత విశిష్టాద్వైత మతములు విమర్శ

పరమాత్మకును, జీవునకును, జగత్తునకు సంబంధముగురించి ద్వైతాద్వైతవిశిష్టాద్వైత మతములేగాక సాంఖ్యాది ధర్మములుగూడ పరస్పరము భేదించుచున్నవి. ద్వైతులును, విశిష్టాద్వైతులును జగత్తు సత్యమే నందురు. అందు విశిష్టాద్వైతులు జగత్తు పరమేశ్వరుని ఆశ్రయించుకొని యున్నదందురు. ద్వైతులును, విశిష్టాద్వైతులును జగతులో అంతటను పరమేశ్వరుడు మాత్ర మున్నాడని మాత్ర మందురు.

దేవుడు సర్వవ్యాపి గనుక నాతడే సర్వవస్తువులందును యున్నాడని పరమేశ్వరుని దర్శించి పూజించును. అంతమాత్రమున పరమేశ్వరుడు విగ్రహములోనే యున్నాడని మరెక్కడను లేడని అభిప్రాయముకాదు.

పరమేశ్వరుని ధ్యానించుటకు అవసరమైన ఏకాగ్రతకు తోడ్పడు సాధనమాత్రమే విగ్రహారాధన. సమస్త మతములవారు భగవంతు డున్నాడనియు, ఒక్కడని, పరమేశ్వరుని భక్తిశ్రద్ధలతో అర్చించుచూ ఇహపర సౌఖ్యము లనుభవించుటయే మానవతరుణో పాయమని ఈమాన్ అనగా విశ్వాసము.

నిర్గుణబ్రహ్మోపాసన చేయువారి మాట యటుంచుడు. అట్టి వారు చాలతక్కువగా యుందురు.

ఏ వర్గమువారు, ఏ పేరుతో, ఏ ప్రకారముగా భగవంతుని అర్చించిననూ నన్నే చేరుదురని సర్వమతసారాంశము. మతము విషయములో చూడుడు.

పరమేశ్వర ప్రీతికొరకు భక్తులు పరమేశ్వరుని పూజింప వచ్చును. ఇట్టి యుద్దేశ్యముతో నారాధనచేయువారికి పరమేశ్వరుడు సులువుగ సహాయముచేయును. ఆనాటికానాడు వారికి పరమేశ్వర జ్ఞానము కలుగజొచ్చును. పరమేశ్వర ప్రీతికొరకు నిష్కామకర్మ

నాచరించువారి పట్ల దేవుడు సంప్రీతుడై యీ నిష్కామకర్మకు ఫలితముగ (భగవదాజ్ఞలు) నింకను నిష్కామకర్మచేయ బుద్ధిపుట్టించును. ఇట్లు క్రమక్రమముగా నాతని జీవితమంతయు పరమేశ్వరుని ప్రీత్యర్థమైన నిష్కామకర్మలతో గూడినదియగును. జ్ఞానముతో తన్ను సేవించువారలు తనను చేరగలరని సర్వమతసారాంశము.

అద్వైతమతమువలన సోహంబ్రహ్మ, నేనేబ్రహ్మను నాకంటె యితరదైవము లేడన్న జ్ఞానమువలన ముక్తిగలిగి అహంకార మమకారము నశించి సచ్చిదానంద స్వరూపమై స్వయమంతట ప్రకాశించునని తెలుసుకొన్నాము.

జీవాత్మ పరమాత్మలయైక్యమే ముక్తి. ఈ జ్ఞానము పరమేశ్వరానుగ్రహమువలన కలుగును. పరమేశ్వరానుగ్రహమునకు నిష్కామ కర్మ నాచరింపవలయును.

నిత్యనిరతిశయానందమే ముక్తుని స్వరూపము. ఆనందో బ్రహ్మ, సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మని కంటె నితరమెద్దియు సత్యములేదని సర్వమతసారాంశము.

ద్వైతులమతములో ముక్తినిచ్చునది భక్తి. ఇతరమతముల సారాంశముకూడ యిదియే. భక్తిని ధృడపరచునది జ్ఞానము. వీరి మతములో కర్మాచరణ ఈశ్వరానుగ్రహసంపాదన కవసరమే. ద్వైతులముక్తిలో జీవుడు పరమేశ్వరునితో నైక్యము పొందరు. ఇదియు ముస్లిం క్రైస్తవుల ధర్మముకూడ. నిరంతర పరమేశ్వర సేవలో జీవుడు ఆనందముపొందుచు పరమేశ్వరునిసన్నిధిలో నుండును. ముక్తుడు జననమరణముల కతీతుడు.

విశిష్టాద్వైతుల మతమునగూడ మోక్షము పరమేశ్వరుని భక్తిచే కలుగును. విశిష్టాద్వైతములో ప్రపత్తి అనగా పరమేశ్వరుని కాత్మార్పణము గావించుకొనుట యను భక్తివిశేషము ముఖ్య సాధనము. విశిష్టాద్వైతులును ద్వైతులవలెనే జీవుడు పరమాత్మకంటె

భిన్నుడనియే అందురు. కాని గుణములలో జీవుడు పరమాత్మవంటి వాడే అందురు. ద్వైతులు జీవులకును పరమేశ్వరునకును వాస్తవమైన గుణభేదము కలదందురు.

దీనిని అన్ని సంప్రదాయములలోను జననమరణ రాహిత్య లక్షిత శాశ్వతానందము నొందుటకు ఈ త్రిమతములయొక్క సారాంశము భగవత్సంసేవన మెంతయు ఆవశ్యకము గనుక అద్వైత విశిష్టాద్వైత, ద్వైతమతములు వేరైనను సూత్రములు ఒక్కటే అనియు, వీట్ల సూత్రములను కూడ భగవద్గీత, ఖురాన్, బైబిలు - బోధించు చున్నవి.

ఇట్లు సమస్తమతముల ననుసరించి, ఈ లోకమున దుఃఖములు తప్పించు కొనుటకుగాని, పరలోకములో సుఖములను అనుభవించుటకు గాని, జననమరణ రూప సంసారమును దాటి శాశ్వత సుఖము లనుభవించుటకుగాని పరమేశ్వరానుగ్రహము అమోఘమైన సాధన మని తెలియుచున్నది. కనుక స్వవర్ణాశ్రమ విహిత కర్మ నాచరించుచు, పరమేశ్వరానుగ్రహము నపేక్షించుచు నితర వాంఛలను వీడుటయే ప్రతినిత్యము నభ్యసించవలసిన యుత్తమసాధన. ఇదియే సమస్త మతములయొక్క సమస్తమత గ్రంథములయొక్క సారాంశము.

## మతము

నేడీ స్థితిలో మనముండుటకు, ఆదికాలమునుండి నేటివరకు గల సంఘోద్ధారకులు - తమ సచ్ఛీల - నిర్మాణములచేత మానవసేవయే మాధవసేవగా తలచుచూ, తమ దేహములనుకూడా త్యజించి లోకసేవ చేసినందుననే మన మింతగా యభివృద్ధిలోనికి వచ్చినాము. మతము అనునది భగవంతుని పొందుటకు సాధనము. సర్వమత సారముకూడ నిదియే. ఏమతము తీసికొనిననూ గమ్యస్థానము ఒక్కటియేగాని మార్గములు మాత్రము వేరుగానుండును; గాని తామవలంబించు మతమే గొప్పదనిచాటుట మత దురహంకారముతప్ప వేరొండుగాదు.

వేదమే అన్నిమతములకు ప్రమాణము. వేదములు, భగవద్గీత, ఖురాన్, బైబిలు భగవంతునివలన వెలువడిన వగుటచేతను, ఆదిలేని

వగుటచేతను, వాటికిగల ఘనత ఎనలేనిది. వేదములను అంగీకరింపని వాడు మానవుడనిపించుకొనడు. సమస్తధర్మములకు, జ్ఞాన విజ్ఞానములకును వేదములే పెన్నిధానము. మతసౌధములు వేదమను పునాదుల పైననే నిర్మింపబడినవి. వేదములు ధర్మములు మానవుని నిత్యజీవితము నెట్లనుసరింప బడవలయునో, భిన్నధర్మములకు సంఘర్షణ జరిగినపుడు ఎట్లు ప్రవర్తింపవలయునో యను యంశమును విపులముగా దెలుపుచు, ధర్మమునం దాసక్తియు, అధర్మమునందు ద్వేషమునుకలిగించి మానవులబుద్ధిని బలాత్కారముగ త్రిప్పి ప్రవర్తించునట్లు చేయుచున్నవి. ప్రపంచములో అన్నిమతములు సత్కర్మలనే యాదేశించుచున్నవి. సత్యముపలుకవలెనని, భగవంతుని సేవించవలెనని, వ్యభిచారము కూడదనియు, ఉత్కృష్ట ధర్మములను చాటుటయే ఆ చంద్రార్కముగ వెలుగొందుచుండుటకు తార్కాణము గనుక మతవిషయమున బలాత్కారము ఎంతమాత్రము లేదని ప్రబోధించు గీత, ఖురాన్, బైబిలు వేదవాక్యములను చూడుడు.

భగవద్గీత అ 4.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥

అ॥ ఎవరు ఏప్రకారముగ నన్ను సేవించుచున్నరో, వారి సేవల కనుగుణ్యముగనే అనుగ్రహించుచున్నాను. మనుష్యులు ఎన్నో మార్గములచేత నన్ను అనుసరించు చున్నారు.

శివగీతలో :—

శ్లో॥ యేనాకారేణ యే మర్త్యాః మామేవైక ముపాసతే
తేనాకారేణ తేభ్యోఽహం ప్రసన్నో వాంఛితం దదే
విధినాఽవిధినాచాపి భక్త్యా యే మా ముపాసతే
తేభ్యః ఫలం ప్రయచ్ఛామి ప్రసన్నోహం నసంశయః ॥

అ॥ ఏ ఏ మనుష్యులు ఏ యే యాకారములతో నన్ను ఉపాసన చేసెదరో వారల కారూపముతో ప్రత్యక్షమై కోర్కెల యిచ్చెదను. విధ్యుక్తముగాగాని, లేకగాని, భక్తిచే ఎవరునన్ను ఉపాసింతురో వారలకు ఫలము నిచ్చెదను.

ఖురాన్ - కాం. 3. సూ॥ బఖరా - 256 ఆయతా.

లా - ఇక్రాహ - ఫిద్ - దీని - ఖత్ - త -బయ్యనర్ - రుష్ద్ - మినల్ - గయ్యి - ఫమన్ - యక్ఫుర్ - బిత్తా - గూతి - వ - యూమిన్ - బిల్లాహి - ఫఖ - దిస్ - తమ్ - సక - బిల్ - ఉర్ - వతిల్ - వుస్ ఖా - లన్ - ఫిసామా - లహా - వల్లాహు - సమీ - ఉన్ - అలీమ్.

అ॥ మత విషయమున బలాత్కారము లేదు. నిశ్చయముగా, సన్మార్గము దుర్మార్గము నుండి వేరుపడి యున్నది. ఎవరు దారికొట్టు సైతానును తిరస్కరించి దేవుని విశ్వసింతురో వారు గట్టికడియమును పట్టినవారు. అది తెగుట లేదు. మరియు దేవుడు సర్వము వినుచు, నెరుగుచున్నాడు.

కాం - 8. సూ॥ అన్ ఆమ్ - 160 ఆ.

ఇన్నల్ల - జీన - ఫర్రఖూ - దీనహుమ్ - వకానూ - షియ - అల్ లస్త - మిన్ - హుమ్ - ఫీ - షైఇన్ - ఇన్నమా - అమ్రు - హుమ్ - ఇలల్లాహి - సుమ్మ - యునబ్బి - ఉహుమ్ - బిమా - కానూ - యఫ్ - అలూన్ -

అ॥ ఎవరు తమ మతములో భేదములు కల్పించి వేర్వేరు సంఘములుగ నైపోయిరో వారి విషయముగూర్చి నీ కెట్టి భాధ్యత లేదు. వారి విషయము దేవుడు చూచుకొనును. వారు చేయుచున్న కర్మములనుబట్టి యుండును.

కాం - 17. సూ॥ అంబియ్యా - 92 ఆ.

ఇన్న - హాజిహి - ఉమ్మ - తుకుమ్ - ఉమ్మతన్ - వాహిదతన్ - వ - అనా - రబ్బుకుమ్ - ఫఅ - బుదూని.

అ॥ నిశ్చయముగా వీరందరు మీ మతస్థులు - అందరిది ఒకే మతము. మీకు నేను ప్రభువును. కావున మీరు నన్ను ఆరాధింపుడు.

కాం - 17 - సూ॥ హజ్ - 67 ఆ.

లి - కుల్లి - ఉమ్మతిన్ - జఅల్నా - మన్ - సకల్ - హుమ్ - నాసికుహు - ఫలాయు నా - జిఉన్నక - ఫిల్ - అమరి - వద్ ఉ - ఇలా - రబ్బిక - ఇన్నిక - లఅలా హుదమ్ - ముస్ - తఖీమ్.

అ॥ ప్రతిజాతికి ఒక్కొక్క పద్ధతి నియమించియున్నారము. వారు దాని ననుసరించుచున్నారు. కావున వారు నీతో దీని విష

యము వాదులాడకూడదు, మరి నీవు నీ ప్రభువు వైపుకు పిలుచుచుండుము. నిశ్చయముగ నీవు స్థిరమైన సన్మార్గమందున్నావు.

బైబిలు:— మనమందరము గొఱ్ఱెవలె త్రోవ తప్పిపోతిమి. మనలో ప్రతివాడు తన కిష్టమైన త్రోవకు తొలగెను. యెష - 53 : 6.

వివేకియై దేవుని వెదకువాడు కలడేమో అని యెహోవా ఆకాశమునుండి చూచి నరులను పరిశీలించెను. వారందరు దారి తొలగి బొత్తిగా చెడియున్నారు. మేలు చేయువారెవరు లేరు. ఒక్కడైనను లేడు. కీర్త 14 : 2; 3

యేసువారితో ఇట్లనెను:—నేను గొఱ్ఱెలకు మంచికాపరిని, మంచికాపరి గొఱ్ఱెలకొరకు తన ప్రాణముపెట్టును. ఈ దొడ్డివి కాని గొఱ్ఱెలును నాకు గలవు. వాటినికూడ నేను తోడుకొని రావలెను. అవి నాశబ్దమును వినును. అప్పుడు మందయొక్కటియు గొఱ్ఱెలకాపరి యొక్కడును అగును. యోహా 10 : 7; 11; 16.

## మతములు - వానిలోగల శాఖలు

I. హిందువులు:- హిందువులనగా వేదములందలి ధర్మ సూత్రములను ఆచరించుచూ తప్పకుండా అనుసరించువారని అర్థము. హిందూ మతములో ఆర్యులకాలమందు వర్ణాశ్రమ వృత్తులనుబట్టి బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య శూద్రులని 4 జాతులు ఏర్పడెను. ప్రతి మతస్థులలోను వారి వారి వృత్తులనుబట్టి ఆ విధముగ పిలుచుచునే యున్నారు.

1 హిందూమతము, 2 బౌద్ధమతము, 3 జైనమతము, 4 అద్వైత మతము, 5 విశిష్టాద్వైతమతము, 6 ద్వైతమతము, 7 బ్రహ్మసమాజ మతములు ముఖ్యములైనవి. విష్ణుభక్తులకు, శివభక్తులకు ఆచార వ్యవహారములలోను, ప్రార్థనాదివిషయములలోను భేదము లున్నప్పటికి అంతా హిందువులే అని గుర్తించియున్నారు.

II. ముస్లింమ్సు:—అనగా భగవంతుని ఆజ్ఞలు నెరవేర్చు భక్తులు. ఇస్లామ్‌అనగా శాంతి–ఇస్లాంమతమనగా శాంతిమతము. ముస్లిమ్సు లోని మతములు 4. 1 హా. నఫీ, 2 షా. ఫయీా, 3 మాలికి, 4 హాం బలి ముఖ్యమైన శాఖలు. వీరిలో సున్నీమతస్థులు, షియా మతస్థులు అని 2 తెగలుగా యున్నారు. ఈ మతస్థులు శ్రీవిష్ణు శైవభక్తులువలె ప్రార్థనాది ఆచార వ్యవహారములలో కొద్ది వ్యత్యాసములున్నను ముస్లింమ్సు అనియే గుర్తించి యున్నారు.

III. క్రైస్తవులు:—యేసు అనగా రక్షకుడనియు; క్రీస్తు అనగా అభిషిక్తుడని అర్థము. క్రీస్తుమత మనగా దేవుని పవిత్రవాక్యములు పాటించుచూ, మానవసేవయే మాధవసేవగా తలచి ప్రజలను రక్షించుటయందభిలాష గల్గి ప్రజాసేవ చేయు మహాభక్తుల మతమని అర్థము. వీరిలో ప్రొటెస్టెంటులు – కేథలిక్కులు మొదలగు అనేక శాఖలుగలవు.

గమనిక:—ముస్లింమ్సులో నేమి, క్రైస్తవులలో నేమి శాఖలు వేరైనప్పటికి ప్రార్థన విషయములోను, భోజనపంక్తి విషయములలోను అస్పృశ్యత ఎంతమాత్రము లేదు. నేటికి హిందూమతములోగూడ భోజన ప్రార్థనాది విషయములలో అస్పృశ్యత అనే పిశాచమును నిర్మూలించి మతోద్ధారకుడనియు, అవతార పురుషుడని పేరుగాంచిన మహాత్మా మోహనదాసు కరంచంద్ గాంధీ బాపూజీ పితామహుని వలననే హిందూదేశ ముద్ధరింపబడెను.

## మతోద్ధారకుల అవతరణ

ప్రపంచచరిత్రల కాలమందును, ధర్మమడుగంటి, యధర్మము చెలరేగునప్పుడెల్ల భూమిపై ఒక్కొక్క అవతారపురుషుడు బయలు దేరి అజ్ఞానాంధకారములో నున్న ప్రజల నుద్ధరించుచుండిరి. అటువంటివారిలో బుద్ధుడు, శంకరాచార్యులు, రామానుజా చార్యులు, మధ్వాచార్యులు, ఏసుక్రీస్తు, మహమ్మదువారు మొదలగు మతోద్ధారకులు (ప్రవక్తలు) బోధించిన ధర్మసూత్రముల వలన లోకము అజ్ఞానాంధకారములోనుండి యుత్తేజము గాంచినది. కాని మతస్థాపకుల యుద్దేశ్యములకు అపార్థములుకల్పించి, వారి

బోధనలు సరిగ గ్రహింపలేక తిరిగి అజ్ఞానములో మునిగిపోవు చున్నారు.

మన ఆసియాఖండములో యిటువంటి అవతారపురుషులు (ప్రవక్తలు) ఉద్భవిల్లి పశ్చిమవాసులకును జ్ఞానోదయము కలుగునట్లు చేయుట మనయొక్క అదృష్టవిశేషమనియే చెప్పవచ్చును. తూర్పు దిశనుండియే (వెలుగు) జ్ఞానోదయము పశ్చిమవాసులకు కలిగెనని స్వామీ వివేకానంద అమెరికాలో చెప్పినవాక్యముల యధార్థ మెంతేనియు గలదు.

అందుచేత "ఇల్మ్ అఖ్లాయద్" అనగా ప్రవర్తనాశీలమునకు సంబంధించినవిషయములు తెలుపు విద్య ప్రతివ్యక్తి తెలుసుకోవలసిన విధియైయున్నది. అందుచే మతములు, మతోద్ధారకులు వెలయ వలసివచ్చెను. జనులయొక్క అరిషడ్వర్గములు పారద్రోలి, శాంతిని యిచ్చి భగవంతుని ధ్యానమందు లీనముచేయుటయే హిందూ, బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవమతముల సారాంశమైయున్నది.

## (నబీలు) - ప్రవక్తలు - అవతారపురుషులు

భగవద్గీత - అ 4 - 8 శ్లో॥

> పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
> ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

తా. సన్మార్గులను రక్షించుటకు; దుర్మార్గులను నాశనము చేయుటకు; ధర్మము స్థాపించుటకును; ఆ యా కాలములందు, అవసరము కలిగినప్పుడు పుట్టుచుందును.

కురాన్ (తిల్ కల్ - అయ్యామ్ - నుదావిలుహా - బైనన్నాస్) సూర అలె యిమ్రాను - రుకు 14 - వాక్యం 3.

అ 4 - 7 శ్లో॥

యదా యదాహి, ధర్మస్య, గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదా 2. త్మానం సృజామ్యహమ్.

తా॥ ఎప్పుడెప్పుడైతే ధర్మము నశించుచున్నదో అధర్మము వృద్ధిపొందుచున్నదో అప్పుడు నన్ను నేను సృష్టించుకొనుచున్నాను (అనగా మనుష్యరూపము ధరించుచుండుట).

అ 9 - 11 శ్లో॥

అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్.

తా॥ భూతములకు ప్రభువుడను, ఉత్కృష్టుడను అయిన నాయొక్క తత్వమును అవివేకులు మనుష్యదేహధారణముచేసిన కారణమున నన్ను తెలుసుకొనలేకున్నారు.

ఖురాన్ = కాం॥ 3 - సూ॥ బఖరా 253 ఆయతా

ప్రవక్తలలో కొందరికి కొందరిపై ఘనత నొసంగితిమి. వీరిలో కొందరితో దేవుడు సంభాషించెను. కొందరిపదవులు హెచ్చించెను. మర్యము కుమారుడగు యీసాకు స్పష్టమైన సూచనల నొసంగి అతనికి పరిశుద్ధఆత్మ (జిబ్రియీలు) సహాయమునొసంగితిమి. ప్రవక్తలు తదుపరివచ్చిన ప్రజలు కలహించి వేరువేరు అయిపోయిరి. కొందరు విశ్వసించిరి. కొందరు విశ్వసింపకపోయిరి.

కాం - 4 - సూ॥ ఆలె ఇమ్రాన్ - 179 ఆయతా

ప్రవక్తలను తాను యిష్టపడినవారిని ఏర్పరచును. కావున దేవుని అతని ప్రవక్తలను విశ్వసింపుడు. భయభక్తులు కలిగియుండినచో మీకు గొప్పపుణ్యఫలితమున్నది.

కాం - 6 - సూ॥ నిసా - 164 ఆయతా

వరుసులన్ - ఖద్ - ఖససా్న - హుమ్ - అలైక - మిన్ - ఖుబ్లు వరుసులల్ - లమ్ - నఖ్ సుస్ హుమ్ - అలైక - వకల్ల - మల్లా - హు - మూసా తక్లీమా.

అ॥ మరియు నీకు తెలిసియున్న ప్రవక్తలకు సందేశము పంపియున్నాము. మరియు మీకు దెలుపకయున్న ప్రవక్తలకును సందేశముపంపియున్నాము. దేవుడుమూసాప్రవక్తతోమాట్లాడెను.

కాం 6 - సూ॥ మా ఇదా - 19 ఆయతా

యా - అహలల్ - కితాబి - ఖద్ జాఅకుమ్ - రసూలునా - యుబియ్యిను - లకుమ్ - అలా - ఫత్రతిమ్ - మినర్ - రుసులి - అన్ - తఖూలూ మాజాఅనామి - బషీ - రిన్ - వలానజీరిన్ - ఫఖద్ - జాఅకుమ్ - బషీరున్ వనజీరున్ - వల్లాహు - అలా - కుల్లిషైఇన్ - ఖదీర్.

అ॥ ఓ గ్రంథము గలవారలార! ప్రవక్తలు వచ్చుట ఆగి పోయిన పిదప మీయొద్దకు సువార్తను, భయబోధ నిచ్చువాడును రాలేదే అని మీరు పలకకుడి - మీకుస్పష్టముగా దెలుపు ప్రవక్త మీయొద్దకు వచ్చెను. మరి దేవుడు సర్వము పై శక్తిగలవాడు.

కాండ 11 - సూ॥ తౌబా - 128 ఆయతా.

లఖద్ - జా అకుమ్ - రసూలుమ్ - మిన్ - అన్ ఫుసి - కుమ్. అజీ జున్ - అలైహి - మా - అనిత్ - తుమ్ - హరీ - సున్ అలైకుమ్ - బిల్ - మూమి నీన - రఊఫుర్ - రహీమ్

అ॥ మీయొద్దకు మీలోనుండియే ప్రవక్త వచ్చియున్నాడు. మీకు కష్టము కలిగించునది - ఆతని భారముగానున్నది. ఆతడు మీ మేలు చాలకోరువాడు. విశ్వాసులయెడ చాల కరుణదయయును గలిగి యున్నాడు.

కాండ - 11 - సూరయే - యూనుస్ - 47 ఆయతా.

వలికుల్లి - ఉమ్మతిన్ - రసూలున్ - ఫ ఇజా - జాఅ - రసూలుహుమ్ ఖుజియ - బైనహుమ్ - బిల్ - ఖిస్తి - హుమ్ - లా - యుజ్ల మూన్.

అ॥ ప్రతి జాతికి ఒక ప్రవక్తయున్నాడు. వారి యొద్దకు వారి ప్రవక్తరాగా వారిమధ్య న్యాయముగ తీర్పు ఆయెను. మరి వారికి అన్యాయము చేయబడదు.

కాండ 13 - సూ॥ర అద్ - 38

వల్ ఖద్ - అర్ సల్నా - రుసు - లమ్ - మిన్ - ఖబ్లిక - వ - జ అల్నా - లహుమ్ అజ్ - వాజన్ - వ - జు్రీ - యతన్ - వ మా - కౌన - లి - రసూలిన్ - అన్ యాతియ - బి - ఆయతిన్ - ఇల్లాబి - ఇజ్ - నిల్లాహి - లికుల్లి - అజలిన్ కితాబ్ -

అ॥ మరియు నీకు పూర్వము మేము అనేకమంది ప్రవక్తలను పంపితిమి - మేము వారికి భార్య బిడ్డలను ఒసగితిమి - మరి ఏ ప్రవక్తయును దేవుని సెలవులేనిదే ఏసూచనను తీసుకొనివచ్చి యుండలేదు. ప్రతికాలము వ్రాయబడియున్నది.

బైబిలు:—పాపులను రక్షించుటకు క్రీస్తుయేసు లోకమునకు వచ్చెనను వాక్యము నమ్మ తగినదియు, పూర్ణాంగీకారమునకు యోగ్యమైనదియు నైయున్నది. 1. తిమొథె 1 : 15.

క్రీస్తుయేసు ...... మనుష్యులపోలికగా పుట్టెను.
ఫిలిప్పి 2 : 5, 7.

ఆయన లోకములో ఉండెను. లోక మాయన మూలముగ కలిగెను. కాని లోకమాయనను తెలిసికొనలేదు. యోహా. 1 : 10.

దేవుడు లోకమును ఎంతో ప్రేమించెను. కాగా ఆయన అద్వితీయ కుమారుడుగా పుట్టినవానియందు, విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్యజీవనము పొందునట్లు ఆయనను అనుగ్రహించెను.
యోహా. 3 : 16.

ఇటువంటి ప్రవక్తల (ముక్తిమార్గము చూపుటకు వచ్చు అవతారపురుషుల) సేవవలననే లోకము యుద్ధరింపబడెను. వేదములు - భగవద్గీత - ఖురాన్, బైబిలు మొదలగు వేదగ్రంథముల వలననే ప్రపంచమునకు జ్ఞానోదయము కలిగెను. నాటిసూత్రములే నేటి నవనాగరికతా ప్రపంచమునకు మార్గదర్శకమాయెను. సంఘములలోని దురాచారములు ఖండింపబడెను. ప్రపంచములలో విదేశముల రాజ్యాంగవిధానములు మానవులు సత్ప్రవర్తనాదిశీలముల ధర్మసూత్రములు మొదలగు విధానములకు సంఘోద్ధారకుల కృషియనియే చెప్పవచ్చును.

# సర్వమత సద్గుణములు

అన్ని మతసంఘములు యిహపర సాధనములగు ధర్మము - న్యాయము - సత్యము - శాంతి - దాంతి - ఓర్పు - సహనము - శీలము - సత్ప్రవర్తన-పరోపకారము మొదలగు సద్గుణములే బోధించి నవి. అందుచేత సర్వమానవులు ఒకటేఅనియు; దేవునిబిడ్డలమనియు, సమస్తమానవులు ఆచరించు మతధర్మములు - కట్టుబాట్లు - మార్గ ములు ఒకటే అనియు, అందరు ఒకే గమ్యస్థానము చేరగలమనియు గ్రహించినందునలననే ప్రపంచము యింతగాఅభివృద్ధిలోనికి వచ్చినది.

సంఘములోని హెచ్చుతగ్గులు నశించుచున్నవి. మతసంఘ ముల పేరున దురాచారములు చాలావరకు నశించిపోవుచున్నవి. సంఘదురాచారములకు తగుప్రాయశ్చిత్తములు జరుగుచున్నవి. సంఘములోని వైషమ్యములు తొలగిపోవుచున్నవి. నేడు ప్రపంచము లోని మతసంఘ సంస్కర్తలవలనను - భగవద్గీత - ఖురాన్ - బైబిలు మొదలగు పవిత్ర వేదగ్రంథములు ప్రచారముచేసిన మతసంఘ సంస్క ర్తలవలనను లోకము ఉద్ధరింపబడెననుటకు సందేహములేదు. కాని గమ్యస్థానము చేరుటకు, మత - జాతి దురహంకారములు సమసిపోవు టకు సమస్తమతములలోని ధర్మములు - నీతులు - సూత్రములు - ఆచారవ్యవహారములు - నడవడులు - సంప్రదాయములు అన్నియు ఒకటేయనియు మతసహనము జరుగుటకు తగు ప్రవర్తనాది శీలములు పూర్తిగా తెలుసుకొంటేనేగాని మానవుని హృదయ పరిపక్వము కలుగుట కాస్కారములేదు. అందుచేత మతోద్ధారకులను యీ సమయములో స్మరించుట ఎంతైనాముఖ్యము.

## ప్రపంచ ప్రవక్తలు

## శ్రీ బుద్ధుడు

ఆర్యులు ప్రకృతిశక్తులను ఆరాధించి వేదములను రచించి విజ్ఞాన తేజోభిక్ష యిడిరి. వేదములసూత్రముల కపార్థములు కల్పించి వర్ణ ఆధిక్యత కల్పించిన సంఘద్రోహకులనుండి అరికట్టి సర్వమానవ

శ్రేయస్సుకు, రాజ్యపరిత్యాగముచేసిన అవతారపురుషుడు, అజ్ఞానాంధకార ప్రజలకు ఆశాజ్యోతి అమరజీవియైన మొదటి సంఘసంస్కర్త బుద్ధదేవునివలననే ప్రజలుద్ధరింపబడిరి. భక్తి, భూతదయ, సత్యము, అహింస, నిర్మలవర్తనము మొదలగు సుగుణములు బోధించు బౌద్ధమతమును ఈయన సృష్టించెను.

## శ్రీ ఏసుక్రీస్తు

ప్రవక్తగాను, దైవదూతగాను, భగవదవతార పురుషుడుగాను దేవునికుమారుడగు ఏసుక్రీస్తు మానవరక్షణార్థము శిలువ అనే శిక్షకు గురియై నేటికిని సజీవుడై యున్నాడు. ఆఏసుక్రీస్తుప్రభువు దయవలననే ప్రజలుద్ధరింపబడిరి. ఈయననే ముస్లిమ్సు యీసాఅలె హిస్సలాం అందురు. సంఘములోని దురాచారములు అరికట్టి, సంఘసేవకుడై తన జీవితమును ధారపోసెను.

సూచన:—ఏసుక్రీస్తు - సోక్రటీసు - గాంధీ మొదలగు మహాపురుషుల మరణముతో గాని లోకము కన్నుతెరచుటలేదు. యూరప్‌లో బైబిలుసూత్రముల కపార్థములు కల్పించిన సంఘద్రోహులను ఎదుర్కొని, బైబిలులోని ముఖ్యమైన ధర్మసూత్రములు 95 టిని వెల్లడిచేసి మార్టిన్ లూథర్ ధన్యుడయ్యెను.

## శ్రీ మహమ్మద్

అరేబియా దేశములోని ప్రజలు దుర్మదాంధులై చిల్లర దేవుళ్ళను సేవించుచూ, అరిషడ్వర్గము లనే సైతానులచే పీడింపబడుచూ, పాపములు చేయుచూ, సత్యము, శౌచము, ధర్మములు లేక అమానుషులై ప్రవర్తించు ప్రజల నుద్ధరించి వారివారినందరిని సరిదిద్ది, నూతనాధ్యాయ కర్తయై, యిస్లామ్ అనగా శాంతిమతమును స్థాపించి ప్రపంచములోని ముస్లిమ్సుకు ఆఖరు పైగంబరై వెలుగొందెను.

# హిందూదేశము - మతసంస్కర్తలు

అనేక మతములకు, భాషలకు, మతకర్తలకు, ఆర్యసాంప్రదాయములకు పుట్టిల్లై భారతమాత వెలుగొంది ప్రపంచఖ్యాతి నార్జించి భారతీయ ముద్దుబిడ్డలైన రత్నములనుకని పేర్గాంచినది. భారతమాత పవిత్రమూర్తి - భారతదేశము పవిత్రభూమి. అందుచేతనే హిందూ, బౌద్ధ, జైన, సిక్కు, ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత బ్రహ్మసమాజము మొదలగు మతము లుద్భవిల్లినప్పటికి భారతీయులు ప్రపంచమున అన్నిజాతులకంటెను హెచ్చుగ మతసామరస్యము చూపి మత సమైక్యతను వెల్లడించిరి. అన్నిమతములను ఆదరించి, అన్నిమతములకు శాశ్వతస్థానము కల్పించి తమ దాతృత్వము కనపరచి భారతమాత నామమును సార్థకము చేసిరి.

## మతసంస్కర్తలు

1. వర్ణవిభేదములు లేక అందరు మోక్షమున కర్హులని బౌద్ధ మతము బోధించెను.

2. అహింస, పవిత్రవర్తనము ముఖ్యసూత్రములుగా జైన మతము చాటెను.

3. శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్యులు హైందవుల ఉత్కృష్టతనుచాటి ద్వైత - అద్వైత - విశిష్టాద్వైత మతములు సృష్టించి భక్తిని ప్రబోధించిరి.

4. అగ్బరు సర్వమత సామరస్యమునకు పాటుపడెను.

5. రామానందుడు, కబీరు దేవుడొక్కడే అనియు, భక్తియే ముక్తి అనియు ప్రబోధించిరి.

6. భక్తియే మోక్షసాధనమనియు, భగవంతుడు ప్రేమమూర్తి అనియు పంజాబులో గురునానక్ ప్రబోధించెను.

7. మీరాబాయి, వల్లభాచార్యులు గుజరాతునందు భక్తి తత్త్వము ప్రచారముచేసిరి.

8. భక్తిమూలముననే తరింపవచ్చునని చైతన్యుడు ప్రచారము చేసెను.

9. రాజా రామ మోహనరాయలు ఏకేశ్వరోపాసనమును ప్రచారముచేసి మతకర్మలులేని బ్రహ్మసమాజమును స్థాపించెను.

10. శ్రీ రామకృష్ణ పరమహంస భగవత్ప్రార్థన ఏకైక మార్గమని ఎలుగెత్తి చాటెను.

11. స్వామి వివేకానంద హైందవమత విశిష్టతను చాటి మత సహనము అవసరమని ప్రచారముచేసి ప్రపంచఖ్యాతి నార్జించెను.

12. శ్రీ హరనాథ్ బాబా; సాయిబాబా; మెహర్ బాబా మొదలగు భక్తులు భక్తియే ముక్తి అనిరి.

13. శ్రీ రమణమహర్షి, శ్రీ అరవింద, ప్రజ్ఞానంద, స్వామి రామతీర్థ, సహజానంద మొదలగు మహర్షులు సర్వమతసారమగు భక్తియే మోక్షమార్గమని చాటిరి.

14. ఇక అవతారపురుషుడు, భారతస్వాతంత్ర్యప్రదాత బాపూజీ సత్యము, అహింస, ధర్మము, సర్వమత సమత్వము, విశ్వమానవ సౌభ్రాతృత్వము మొదలగు దివ్యగుణములతోను, దివ్యసందేశములతోను ఎలుగెత్తి చాటుచూ, సర్వమతసహనమునకై జీవితమును ధారపోసిన శ్రీ మహాత్మా మోహనదాసు కరంచంద్ గాంధీ బోధనలతో గాంధేయతత్త్వము వెలసినది. అందుచేత గాంధీజీ భారతీయ విజ్ఞానమునకేగాక - ప్రపంచ ఆరాధ్య (అవతార) పురుషు డయ్యెననుటకు సందేహము లేదు.

## బౌద్ధమత ధర్మములు

మానవుల నిత్య, నైమిత్తిక కర్మలు ఇహపర సౌఖ్యములకు మార్గములని, ఏనాడో 2500 సం॥ క్రితమే సర్వసంగ పరిత్యాగము చేసి, రాజ్యము త్యజించిన శ్రీ బుద్ధదేవుని బౌద్ధమత ధర్మసూత్రము లన్నియూ ప్రపంచములోని అన్ని వేదగ్రంథములందు ఘోషింపబడు

చున్నవి. ఈ బౌద్ధమతధర్మములే ప్రతి వాక్యమునందును, ప్రతి ప్రార్థనాశ్లోకములందును నిబిడీకృతమై యుండుటచేతను, ప్రపంచమందంతటను ప్రచారములో నుండుటచేతను అంతగా విమర్శించ నవసరములేదు.

## వేదములు

1. హిందూమతమునందు 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము, తదుపరి భగవద్గీతకు ఎనలేని స్థాన మొసగియున్నారు.

2. మహమ్మదీయ మతమునందుకూడ 1. జబ్బూరెషరీఫ్ 2. తౌరీదెషరీఫ్ 3. యింజీలెషరీఫ్ 4. హదీస్ (వేదముఖురాన్) ఎనలేని స్థానము గలదు.

3. క్రైస్తవమతమునందుకూడ 1. యోహా 2. హెబ్రీ 3. రోమా 4. తిమెథి 5. బైబిలు మొదలగు వేదములు గలవు. 1 మత్తయి 2. మార్కు 3. లూకా 4. యోహాను యేసు చరిత్రలు. హిందూ మహమ్మదీయ క్రైస్తవమతములలో వరుసగా 1. భగవద్గీత 2. ఖురాన్ 3. బైబిలు ప్రస్తుత కలియుగములో పవిత్ర మొదటివేదములుగా పరిగణించబడుచున్నవి.

ఈ పవిత్రవేదములు ఉదాత్త, అనుదాత్త స్వరితములతోడను, మంచి పవిత్రతతోడను అన్ని మతములవారు పఠించుచున్నారు. అప్పుడు పరిశుద్ధమనస్కులై మనోవాక్కాయ కర్మలచేతను; నిశ్చలమైన భక్తితో భగవన్నామసంకీర్తనము, ఏకాహములు చేయుట – జాగరణ చేయుట – వారి వారి మతాచారముల ప్రకారము చేయుచున్నారు.

ఈ పవిత్రవేదములు ప్రారంభము లగాయతు అంత్యమువరకును ఆమూలాగ్రముగ వల్లించగల భక్తులు, ఏకసంతగ్రాహివలె చూడకయే పఠించు మహాభక్తు లెందరేనియు గలరు. వారు దైవాంశ సంభూతు లనుటలో సందేహములేదు. అటువంటి మహాభక్తులు వైరాగ్య సంపన్నులు. హిందువులు ఏకాహములు – నామసంకీర్తన – జాగరణ;

ముస్లింములు షబెఖదర్ - మిలాదిన్‌నబీ - మొదలగు పవిత్రదినము లందును; క్రైస్తవులు, క్రిస్ట్మస్ - పవిత్రపండుగ పర్వములందును వేదపఠనలు జరుపుకొనుచూ తమ తమ జీవితములకు యిహపర సౌఖ్యము లరయుటకు - మోక్ష సామ్రాజ్యము బడయుటకు ప్రతి మతస్థులు ప్రయత్నించుచున్నారు.

భగవద్గీత - బైబిలు - ఖురాన్ వేదగ్రంథములు పూర్తిచేసిన భగవద్భక్తులు గురుదక్షిణ - అన్నసంతర్పణాది దాన ధర్మములుచేసి వేదగ్రంథములయందు, భగవద్భక్తి శ్రద్ధలు ప్రదర్శించుచూ నాటి రోజున పండుగవలె ఆనందాబ్ధినోలలాడి ముక్తి నారయుటకు ప్రయత్నించుచున్నారు.

## దేవదూతలు

అ 9. శ్లో॥ 19

తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున.

తా. నేను తపింపజేయు చున్నాను. వర్షమును కురిపించు చున్నాను; నిరోధించుచున్నాను. అమృతమును, మృత్యువును నేనే చేయుచున్నాను. ఉన్నది లేనిది అనగా స్థూలము, సూక్ష్మము - అశాశ్వతము అంతయు నావలెనే జరుగుచున్నది.

అందుచేత భగవంతుడు దేవదూతలను ఏర్పాటు చేసి యున్నాడు.

1. యముడు:—ఈ దూతనే హజరత్ యిజ్రాయిల్ అలెహిస్సలామ్ ముస్లిములు అందురు. ఈ దూత సమస్త జీవుల ప్రాణుల హరించుచున్నాడు.

2. వరుణుడు:—వర్షము కలుగజేయుచు లోకమును రక్షించు చున్నాడు. ఈ దూతనే హజరత్ మీకాయిల్ అలెహిస్సలా మందురు. క్రైస్తవులు యెహోవా మహత్వము వలననే కలుగుచున్న దందురు.

3. మత్స్యావతారము:— భగవంతుని నుండి వేదములు తెచ్చినవారు. వీరినే హజరత్ జిబ్రాయిల్ అలెహిస్సలా మందురు. బైబిలులోని ధర్మసూత్రములు, ఆజ్ఞలు గాబ్రియేలు దేవదూత ద్వారా వెల్లడి యయ్యెను.

4. వాయుదేవుడు:— వీరినే ముస్లింమ్సు హజరత్ యిస్రాఫీల్ అలెహిస్సలామ్ అందురు. వాయువును కలుగజేయుచు ఒక విధమైన సాధనము (నూర్) ధరించి భగవదాజ్ఞపొంది ప్రపంచ ప్రళయము చేయుటకు సిద్ధముగా నున్నాడు. క్రైస్తవులలో గూడ దేవదేవుడైన యోహోవా మహత్వము వలననే జరుగుచు లోకము రక్షింపబడుచున్నది. మత్తయి 25 : 31—46

క్రైస్తవులు:— యోహోవా గాబ్రియేలు దూత తన ఆజ్ఞలు భక్తులగు ప్రవక్తలకు తెలియపర్చు రాయబారిగానున్న దేవదూత.

దేవుని పరిశుద్ధమైన దూతగా పరిగణింపబడుచున్న లుసీఫరు అహంకారయుక్తుడై మెలగుచుండుటవలన దేవునిచే శపించ బడి భూలోకమునకు త్రోసివేయబడెను. ఈదూత భగవంతుని సృష్టి-భక్తులు- సత్కార్యము చేయకుండా జీవరాసులను ఆటంకపరుచుచూ దేవుని ఆజ్ఞలకు, వ్యతిరేకపనులకు ప్రోత్సాహకుడై – దేవసృష్టి నాశనము చేయ సమకట్టినందు వలననే (ఇబ్లీసు) సైతాను చేయు పనులవలన తనకుకూడ ఆనామధేయము కలిగి దేవుని ఆజ్ఞలకు వ్యతిరేకుడయ్యెను.

ఈ విధముగా దేవుని ఆజ్ఞలకు వ్యతిరేకులు సైతానులు ఉండినగాని ప్రపంచ నడవడి కష్టసుఖములు తెలియవు.

## యుగాంతము

హిందూ, మహమ్మదీయ, క్రైస్తవమతములన్నియు ప్రపంచ ప్రళయము వచ్చుటనిజమనియు అప్పుడు పునఃసృష్టి జరుగుననియు వేదములు చెప్పుచున్నవి. ఈ కలియుగాంతములో జగత్తుఅంతయు పాపములతో నిండిపోవుననియు, దుర్మార్గములు ఎక్కువై, న్యాయా

న్యాయములు - ధర్మాధర్మములు నశించి, వ్యభిచారము, జూదము, అసత్యము అహింస ఎక్కువై జగత్తుఅంతయు పాపములచేత నిండిపోవును.

అప్పుడు భగవంతుడు ఒక అవతారపురుషుని సృష్టించును. అతడే శ్రీకల్కి భగవానుడని హిందూవేదములు - యిమామె మెహిది అని ముస్లింవేదములు - తిరిగి శ్రీ ఏసుక్రీస్తువచ్చి పాపుల పాపములను దీర్చుననియు, పునఃసృష్టి చేయగలడనియు నమ్ముచున్నారు. చూడుడు మత్తయి 25 : 31 - 46

హిందూ మహమ్మదీయ క్రైస్తవ వేదగ్రంథములు ఆఖరు అవతారపురుషుడు వచ్చుట నిజమనియు - ప్రపంచ ప్రళయము వచ్చుట సిద్ధమనియు - తదుపరి ధర్మసంస్థాపన జరుగగలదనియు ఘోషించుచున్నవి. అన్నిమతములవారు అట్టి మహాపురుషుని రాక నిజమని నమ్ముచున్నారు.

ఖురాన్. కాండ. 14 సూ॥నహాల్ 77 ఆయతా

వలిల్లాహి - గైబుస్ - సమా - వాతి - వల్ - అర్జి - వమా - అమ్రుస్ - సాఆతి - ఇల్లాకలమ్ - హిల్ - బసరి - ఔ - హువ - అఖ్రబు - ఇన్నల్లాహ - అలాకుల్లి - షైఇన్ - ఖదీర్.

అ॥ ఆకాశముయొక్క భూమియొక్క రహస్యము దేవునియొద్ద నున్నవి. మఱిపునరుత్థానదినము రెప్పపాటుకాలములేక దానికంటె -సమీపములోనున్నది. దేవుడు సర్వశక్తిగలవాడు.

బైబిలు:— నేనుండుస్థలములో మీరును ఉండులాగున, మరలవచ్చి, నాయొద్ద నుండుటకు మిమ్ము తీసికొని పోవుదును.

యోహా 14 : 3

యేదినమున మీ ప్రభువువచ్చునో మీకు తెలియదు. కనుక మెళుకువగానుండుడి... మీరనుకొననిగడియలలో మనుష్యకుమారుడు వచ్చును. కనుకనే మీరును సిద్ధముగాఉండుడి.

మత్తయి 34 : 42; 44.

ఇదిగో త్వరగా వచ్చుచున్నాను. వానివాని క్రియచొప్పున; ప్రతివానికిచ్చుటకు నేను (సిద్ధపరచిన) జీతము నాయొద్దనున్నది.
ప్రక. 22 : 12

రాబోవు ఉగ్రతను తప్పించుకొనుటకు మీకు బుద్ధిచెప్పిన వాడెవడు ? లూకా 3 : 7.

మీయొద్దనుండి పరలోకమునకు చేర్చుకొనబడిన యీయేసే ఏరీతిగా పరలోకమునకు వెళ్లుట మీరు చూచిరో ఆరీతిగానే ఆయన తిరిగి వచ్చును. అపొ కార్య 1 : 11

క్రైస్తవ, హిందూ, మహమ్మదీయ పురాణములు చూడుడు.

## దేవుని మహిమ

గీత అ 7 - శ్లో 6

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా.

అ॥ అన్నిభూతములకు చేతన ప్రకృతి, అచేతనప్రకృతి కారణములు. నేను సమస్తమును సృష్టిచేయుటకు, లయముచేయుటకు అధికారినై యున్నాను.

గీత అ 7 - శ్లో 7

శ్లో॥ మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణాఇవ.

అ॥ నేనుగాని దేదియులేదు. సూత్రమునందలి మణులవలె అన్నియు నాయందున్నవి. ఈ జగమంతయు నాయందే కూర్చబడియున్నది.

గీత అ 7 - శ్లో 8

శ్లో॥ రసోహమప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.

అ॥ నీటియందు రసము, సూర్యచంద్రులకాంతి, ఆకసమందలి శబ్దము, పురుషులయందలి పౌరుషము, ప్రణవమునందలి ఓంకారము నేనే అగుచున్నాను.

గీత అ 9 శ్లో 24

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవచ
నతు మా మభిజానంతి తత్త్వేనాతశ్చ్యవ న్తితే.

తా॥ నేనే సర్వమునకు ప్రభువును. భోక్తను, ఫలితము నిచ్చు వాడను నేనని తెలిసికొనకపోవుటచేత మోక్షమునకు దూరులగుచున్నారు.

గీత అ 10 - శ్లో 9

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే
ఇతిమత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః.

తా॥ సమస్తమునకు నేను పుట్టుకస్థానమును. సమస్తము నావలెనే జరుగుచున్నది. ఇట్లని సమస్తపండితులు నన్ను పూజించుచున్నారు.

బైబిలు:— దేవుడున్నాడనుసంగతి సృష్టిక్రమమును చూడగా నిర్ధారణ చేయబడును. "ఆకాశములు దేవుని మహిమను వివరించుచున్నవి. అంతరిక్షము ఆయన చేతిపనిని ప్రచురపరచుచున్నది"
(కీర్తన 19 : 1)

సృష్టికర్తలేనిది ప్రపంచముకూడ నుండనేరదు; మరియు నీసృష్టిలో ప్రతిచోట కనబడు క్రమమును, చక్కదనమును; జూడగాను; దివారాత్రములు; ఋతువులు క్రమముగా వచ్చుటను, అందరి యక్కరలను దీర్చుటకు, ఈ భూమి నిర్మింపబడియుండుటను; జూడగాను జ్ఞానవంతుడును; దయగలవాడును దీనిని నిర్మించెనని యొప్పుకొనకతప్పదు. కావున బుద్ధిహీనులుతప్ప మరియెవరును దేవుడులేడని అనుకొనరు.
(కీర్తన 14 : 1)

గీత అ 11 - శ్లో 38.

త్వ మాదిదేవః పురుషః పురాణ స్తమస్య విశ్వస్యపరం నిధానమ్
వేత్తాసి వేద్యంచ పరంచ ధామ త్వయాతతం విశ్వమనంతరూప.

తా॥ ప్రపంచములో అనంతరూపములు సృష్టించినవాడా నీవే మొదటి దేవుడవు - పవిత్రమైన పురుషుడవు - గొప్ప ఆధార భూతుడవు - తెలిసినవాడవు - తెలియదగిన వాడవు - ఆధారుడవు-అన్నిటికి నీవే ఆధారభూతువు.

అ 15 - శ్లో 6.

నతద్భాసయతే సూర్యో నశశాంకో నపావకః
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ.

తా॥ నేనే సూర్యచంద్రాదులకు వెలుగునిచ్చువాడను. దానిని తెలుసుకొని నాయొక్క ఉత్కృష్టమైనస్థానమును పొందుచున్నారు.

ఖురాన్ - కాండ 2 - సూ॥ బఖరా - 163 ఆయతా.

వ - ఇలా - హుకుమ్ - ఇలాహున్ - వాహిదున్ - లా - ఇలాహ - ఇల్లా - హు - వర్ - రహ్మానుర్ - రహీమ్.

అ॥ మరి మీకు పూజ్యుడగు దేవుడు ఒక్కడేను. అతడు తప్ప వేరు దేవుడు లేడు. అతడు అమిత దయగలవాడు - ప్రేమించువాడు.

ఖురాన్ - కాండ 8 - సూ॥ ఆరాఫ్ - 54 ఆయతా.

ఇన్న - రబ్బ - కుముల్లా - హుల్లజీ - ఖల - ఖస్ - సమావాత్తి - వల్ - అరజ్ - ఫీ సిత్తతి - అయ్యా - మిన్ - సుమ్మత్ - తవా ఆలల్ - అర్ - షి - యుగ్‌షిల్ - లైలన్ - నహేర - యత్ - లుబుహూ - హాసీ - సస్ - వమ్ - వమ్సవల్ - ఖమర - వన్ - నుజూము - ముసఖ్ ఖ - రాతిమ్ - బి - అమ్రిహీ - అలా - లహుల్ - ఖుల్‌హు - వల్ - అమ్రు - తబా - ర - కల్లాహు - రబ్బుల్ - ఆలమూన్.

అ॥ ఆఱు దినములలో ఆకాశము భూమిని సృష్టించిన దేవుడే మీకు ప్రభువు. పిదప అతడు అర్షుపై ఆసీనుడాయెను. అతడు రాత్రిని పగటిపై కప్పుచున్నాడు. అది దానిని త్వరితముగ వెంబడించుచుండును. సూర్యుని, చంద్రుని, నక్షత్రములను తన యాజ్ఞకు లోనై యుండునట్లుగ సృష్టించెను. వినుట-సృష్టించుట - ఆజ్ఞాపించుట అతని పనియే - సర్వలోకములకు పోషకుడగు దేవుడు గొప్పమహిమగలవాడు

కాండ - 14 - సూ॥ యిబ్రాహీమ్ 22 - 23 : ఆయతా.

వ - ఆర్ - సల్ - న ర్ - రి - యాహ - లవా - ఖిహ - ఫ - అన్ - జల్నా మినస్ - సమా ఇ - మాఅన్ - ఫ - అస్ - ఖై నా - కుమూహు - వ - మా అన్ తుమ్ - లహూ - బి - ఖాజనీస్ -

అ॥ మేము మేఘములను బరువుగా చేయునట్టి గాలులను పంపి ఆకాశమునుండి నీళ్లు కురిపించితిమి. దానిని మీకు త్రాగనిచ్చితిమి. (100 - పేర్ అన్ - అమ్) లో అటుపై పచ్చిక ఖర్జూరపు ద్రాక్ష తోటలు - ఆలివ్ - దానిమ్మ ప్రతి వృక్షములను సృష్టించెను.

కాం - 14. సూ॥ ఇబ్రాహీమ్ - 26 - 27 అయ్తు :

వల - ఖద్ - ఖలఖ్ నల్ - ఇన్ - సాన - మిన్ - సల్ - సాలిమ్ - మిన్ - హమ - ఇమ్ - మస్ - నూన్ - వల్ - జాన్న - ఖలఖ్ నాహు - మిన్ - ఖబ్లు - మిన్ - నారిస్ - సమూమ్

అ॥ మరియు ముటిగి, గనగన మని శబ్దించు బురదమట్టితో మేము మనుష్యులను సృష్టించితిమి.

27:- దీనికిముందు జ్వలించు అగ్నితో జన్నాతులను (రాక్షసులు) మేము పుట్టించితిమి - (వీని సంతానమే సైతానులు) —

కాం 14 - సూ॥ సహల్ - 4 :

ఖలఖల్ - ఇన్ - సాన - మిన్ - నుల్ - ఫతిన్ - ఫ ఇజా - హువా - ఖసీముమ్ ముబీన్.

అ॥ ఒక బిందువుతో మనుష్యుని పుట్టించెను. పిదప వాడు అప్పుడే వాదించువాడుగను మాటలాడువాడుగ నాయెను.

కాం - 12 - సూ॥ హూద్ - 6 :

వమా - మిన్ దాబ్బ - తిన్ - ఫిల్ - ఆరజి - ఇల్లా అలల్లాహిరిజ్ - ఖుహా - వ యఆ - లము - మున్ - తఖ్రహు - వమున్ - తౌదఅహా - కుల్లున్ - ఫీ - కితా - బిమ్ - ముబీన్.

అ॥ మరియు భూమిపై సంచరించు ప్రతిప్రాణికి ఆహారమిచ్చుట దేవునిపని - మరి అదియుండు స్థానమును; యుంచబడు స్థానమును దేవునికి తెలియును. సర్వము స్పష్టమైన గ్రంథములో యున్నది.

కాం 9 - సూ॥ ఆరాఫ్ - 180 ఆ :

వ - లిల్లా-హిల్ - అస్మా - ఉల్ - హుస్నా - ఫద్ - ఊహు - బిహా -
వ - జరుత్ - లజీన - యుల్ - హి - దూన - ఫీ - అస్ సుమాఇహీ - స -
యుజ్ - జీన - మా - కా నూ - యఅ మలూన్.

అ॥ దేవునికి మంచిపేర్లున్నవి. కావున మీరు ఆపేర్లతో పిలువుడు. మరి దేవునిపేర్ల విషయములో తప్పుత్రోవ పోవువారిని వదలిపెట్టుడు. తప్పక వారు తమకర్మలఫలితము పొందగలరు.

కాం - 24 - సూ॥ జుమర్ - 62 ఆయాతా :

అల్లాహు - ఖాలిఖు - కుల్లి - షై - ఇన్ - వహువ - అలా - కుల్లి -
షైఇన్ వకీల్.

అ॥ దేవుడే ప్రతివస్తువును సృష్టించువాడు. మరియు అతడే ప్రతివస్తువునకును రక్షకుడు.

సూరయేతాహా - 20 -ఆయతా 14 :—

ఇన్ననీ - అనల్లాహు - లా - ఇలాహ - అనా - ఫఅ - బుద్ నీ - వ - అఖి -
మిస్ - సలాత - వి - జికిరీ.

అ॥ నేను దేవుడను. నేనుతప్ప వేఱు పూజ్యుడు లేడు. కావున నన్ను ఆరాధింపుడు. నా జ్ఞాపకార్థము నమాజ్ స్థిరముగా సలుపుడు.

సూ॥ తౌహా - కాం 16 - ఆయతా - 98 :

ఇన్నమా - ఇలా - హు - కుముల్లా - హుల్ల - జీ - లా - ఇలాహ - ఇల్లా -
హువ వసిఅ - కుల్ల - షైఇన్ - ఇల్మా.

అ॥ దేవుడు (అల్లాః) మాత్రము - అతడుతప్ప వేరుపూజ్యుడు లేడు. అతడు సర్వము తెలిసినవాడు.

కాం 29 - సూ॥ ముల్క్ - 1 - 2 ఆ :

1. తబారకల్ - లజీ - బి - యదిహిల్ - ముల్ కు - వహువ - అలా -
కుల్లిషై - ఇన్ - ఖదీర్.

2. అల్లజీ - ఖలఖల్ - మౌత - వల్ - హయాత - లి - యబ్ - లు -
వకుమ్ - అయ్యు - కుమ్ - అహి - సను - అమలా - వహువల్ - అజీజుల్ -
గఫూర్.

అ॥ ఎవ్వనిచేతిలో సమస్త ప్రభుత్వముగలదో యా దేవుడు చాల మహిమగలవాడు. మరియు అతడు సర్వముచేయు శక్తిగల వాడు. 2. మీలో ఎవ్వరు మంచిపనులుచేయుదురో అని మిమ్ము పరీక్షించుటకుగాను అతడే చావును బ్రతుకును సృష్టించెను. మరియు అతడే సర్వశక్తుడును, క్షమించువాడును.

## సృష్టి (మబ్దా)

ఆదియందు దేవుడు భూమ్యాకాశములను సృష్టించెను.

బైబిలు కాండ 1 : 1

ఆయనమూలమున సమస్తమునుకలిగెను. కలిగియున్న దేదియు ఆయనలేకుండగ కలుగలేదు. యోహాను 1 : 2 : 3

దేవుడు మొదట భూమిని పరుపుగాను, ఆకాశమును పై కప్పుగానుచేసి ఆకాశమునుండి నీళ్ళను కురిపించి దానివలన ఆహారము కొరకు ఫలములను కల్పించెను. ఖురాన్ 1 కాండ 22 ఆయ

దేవుడు తన స్వరూపమునందు నరుని సృష్టించెను. దేవుని స్వరూపమందు వానిని సృజించెను. పురుషుని గాను స్త్రీ గాను సృష్టించెను. బైబిలు ఆదికాండ 1 : 27

ఖురాన్ కాండ 1 : 30 నుండి 39 పేరాల వివరము. బఖరా

దేవుడు దేవదూతలతో భూమిలో ఒక ప్రతినిధిని సృష్టించబోవుచున్నానని యు తను మొదట ఆదమును సృష్టించెను. అతనికి సమస్త వస్తువులపేర్లు చెప్పెను. ఆ పేర్లు అతనిమూలమున దేవతలకు (ఫిరిష్తె) చెప్పించెను. దేవతలు ఆదమునకు మ్రొక్కుమనగా అట్లే చేసిరి. కాని ఇబ్లీషు (సైతాన్) ధిక్కరించెను. ఆదమును అతని భార్యను స్వర్గమునందు నివసించి, అందున్నవి మీ యిష్టముచొప్పున అనుభవింపుడనియు, ఒక వృక్షమునుమాత్రము సమీపించక, దాని

ఫలములను అనుభవింపవద్దనియు దేవుని శలవాయెను. ఆదముభార్య హవ్వాను సైతాను మోసపుచ్చి స్వర్గమునందున్న నిషేధ ఫలములను తినిపించెను. తనభర్త ఆదమునుకూడ తినిపించెను. తక్షణము వారు స్వర్గమును వీడునట్లు దేవుని ఆజ్ఞ ఆయెను.

దేవునికి వారు గావించిన పొరపాటుకు పశ్చాత్తాపముపొందగా ఆతనిని క్షమించి, యిహలోకములో కొంతకాలముండి మీా సంతతి వారలు సన్మార్గము ఆచరించుచూ నన్ను సేవించువారు నాయొద్దకు చేరగలరని దేవుని సెలవాయెను.

బైబిలు:—దేవుడైన యెహోవా యీ ఆదాము హవ్వాలకు పైవిధముగా ఆజ్ఞాపించుట, సైతాను వారిని మోసపుచ్చుట - వారు ప్రాయశ్చిత్తము పొందుట - వారు భూమిపై విడచుట - ఆదికాండ 1 : 6—6-3 : 19—19 లో వివరములు గలవు.

ఖురాన్:—కాండ 7 పేరా 110. బీబీమర్యము కుమారుడు యీసా (ఏసు) తండ్రిలేకనే పుట్టెను. యూదులు మర్యముపై అపనిందలు మోపిరి. ఈ ఏసుక్రీస్తు ఉయ్యాలలో నుండగనే మాటలాడుట - మృతులను సజీవులనుచేయుట-గ్రుడ్డి, కుష్ఠు మొదలగు రోగులబాధలు మాన్పుట మొదలగు మహాత్కార్యములు సలుపుటచే ప్రవక్త అయ్యెను. వీరినే క్రైస్తవులు ఏసుక్రీస్తు అందురు.

ముస్లిమ్సు యీసాఅలైహిస్సాలామ్ అందురు. అమరజీవియై ప్రాణులను రక్షించుటకు వచ్చుదురని నమ్ముచున్నారు.

N. B:—ఇక్కడనుండియే క్రైస్తవులకు - ముస్లిములకు వేరుమార్పులు కలిగినవి.

భగవద్గీతలో సృష్టిస్థితిలయ కారకుడు తానేనని భగవంతుడు అ - 7 - శ్లో 6 - 7 చెప్పియున్నాడు.

(సృష్టి)

## 1 మానవులు (ఇన్సాన్)

ఖురాన్॥ సూ॥ త్వాహా - 20 - ఆయతా 55

మినహా - ఖలఖ్నా - కుమ్ - వ - ఫీహా - ను - ఈదుకుమ్ -
వ - మినహా - నుఖ్ - రిజు - కుమ్ - తారతన్ - ఉఖ్రా

అ॥ భూమినుండియే మిమ్ము సృష్టించితిమి. మరియు తిరిగి మిమ్ము దానిలోనికే చేర్చుదుము. మరియు దానినుండియే మిమ్ము తీయుదుము.

బైబిలు:—దేవుడైన యెహోవా నేలమంటితో నరుని నిర్మించి వాని నాసికారంధ్రములలో జీవవాయువును ఊదగా నరుడు జీవాత్మ ఆయెను. దేవుడైన యెహోవా తూర్పున ఏదెనులో నొక తోటవేసి తాను నిర్మించిన నరుని దానిలో ఉంచెను. ఆది కాం 2 : 7; 7.

పృథివీ తత్త్వమువలన సృష్టించబడినారు. వీరలను ముస్లిమ్ము ఇన్సాన్ అందురు.

సూ॥ రహ్మాను. కాం 27-14 ఆ :
ఖల - ఖుల్ - ఇన్సాన - మిన్ - సల్ -సాలిన్ - కల్ - ఫఖ్ఖీ - ఖార్.

## 2. రాక్షసులు (జిన్నాత్)

అగ్నివలన పుట్టింపబడినారు.

వ - ఖలఖల్ - జాన్న మిమ్ - మారిజిమ్ - మిన్ - నార్.

## 3. దేవతలు (ఫిరిష్తే)

నూర్ అనగా తేజస్సుచేత సృష్టించ బడినారని హిందూ మహామ్మదీయ క్రైస్తవ సృష్టి వివరములలో గలవు.

శ్రీ భగవంతుడు మొదటి ఆదం (హవ్వాలను) మొదటి ప్రవక్తగను, మహమ్మదు వారిని ఆఖరు పైగంబరుగను సృష్టించెనని యున్నది. అల్లే

హిందువులు మత్స్యావతారము మొదటను, దశావతారములలో బుద్ధునిగను, ఆఖరు అవతారము కల్క్యావతారముగను భగవంతుని భావించుచున్నారు.

అనగా ప్రతి మతస్థులు ప్రవక్తలద్వారా భగవంతుని ప్రార్థించుట, వారి వారి (సంఘ) మతాచారముల ప్రకారము ఆచరించుచూ, మోక్షమార్గములకు ప్రయత్నించుచుండుట ఎంతమాత్రము తప్పుకాదనియు; ఏనామములతో ప్రార్థించి నప్పటికి, నదీనాం సాగరో గతిః అన్నట్లు భగవంతుని సన్నిధికి అందరు చేరవలసినవారలే అనియు భగవద్గీత, ఖురాను - బైబిలు వేదములు ఘోషించు చున్నవి.

కనుక ఎవరియిష్టదైవములను వారు సేవించుచూ తన మతాచారములు ఆచరించుచూ; యితరమతములలోని సన్మార్గ బోధలు, ఆచరణలు తెలుసుకొనుచూ; మతసహనము పాటించుచూ, తమయిష్టదైవములను ప్రార్థించి ముక్తిగనుట మానవ తరుణోపాయము; శ్రేయోదాయకము - యిహపరసౌఖ్యముల గనుట సార్థకము. అందరిది ఒకేమతము. ఒకేదేవుడు.

కనుక మతవిషయములలో వాదోపవాదములకు దిగక అన్ని మతములవారి దైవములను, ప్రవక్తలను గౌరవభావముతో చూచుచు; వారి, సత్యదయాది గుణములను అలవరచుకొనుటవలన శాంతికి దోహదము కాగలదనుటకు సందియములేదు.

# సర్వమత సారసంగ్రహము

## రెండవ భాగము

### సర్వమత నిబంధనలు

1. కల్మాఫడ్‌నా = వేదపఠన
2. నమాజ్ = ప్రార్థన
3. రోజా = ఉపవాసములు
4. జకాత్ = ధర్మము
5. హాజ్—ఖుర్బానీ = యాత్ర - యజ్ఞములు. ఈ పంచనిబంధనలు ఆచరించవలసినదిగా వేదములు చెప్పుచున్నవి.

గీత 9-వ అధ్యాయము 14 శ్లో.

సతతం కీర్తయంతోమాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే.

తా॥ దయసత్యాదిలక్షణములతో కొందరు నామసంకీర్తనము-పట్టుదలతో వ్రతములుచేయుచు అర్చించుచూ, ఉపవాసాది నమస్కారములతో నన్ను సేవించుచున్నారు.

## 1. కల్మాఫడ్‌నా - (వేదపఠన)

భగవద్గీత - బైబిలు - ఖురాను మనోవాక్కాయ కర్మలచే శుచియై పఠించుచున్నారు.

గీ॥ ప్రారబ్ధం భుజ్యమానోపి గీతాభ్యాసరతస్సదా
సముక్తస్సుఖీలోకే కర్మణానోపలిప్యతే.

తా॥ ఎల్లప్పుడు భగవద్గీతను పారాయణచేయుచో ప్రారబ్ధకర్మ అనుభవించువాడైనను, కర్మములతో సంబంధము లేక లోకములో ముక్తుడు సుఖముకలవాడు అగును.

గీ॥ గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతామే చోత్తమం గృహమ్
గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్.

తా॥ నేను గీతలను ఆశ్రయించియుందును. గీతలే నాకు యిల్లు గీతలలో చెప్పబడిన జ్ఞానము అవలంబించి నేను లోకములను పాలించుచున్నాను.

అ 9 - శ్లో. 17 భగవద్గీత.

"గీ" అక్షరము త్యాగము బోధించుచున్నది. "త" అను అక్షరము తత్త్వబోధమును అనగా ఆత్మబోధము నుపదేశించుచున్నది.

ఖురాన్:—కాం - 3 - సూ॥ ఆలె ఇమ్రాన్ - 3 ఆయతా

నజ్ - జల - అలై - కల్ - కితాబ - బిల్ - హఖ్ఖి - ముసద్దిఖల్ లిమా - బైన - య - దైహి - వ - అన్ - జలత్ - తౌరాత - వల్ - ఇన్ - జీల - మిన్ - ఖబ్లు - హుదల్ - లిన్నాసి - వ - అన్ - జలత్ - ఫుర్ - ఖాన -

అ॥ దేవుడు నీకుసత్యమైన గ్రంథము ఒసగెను - అది పూర్వ గ్రంథములను సత్యపరచుచున్నది. దానికిముందు ప్రజలకు సన్మార్గము చూపుటకు తౌరాతును, ఇన్జీలును పంపెను. మరియు ఖురాన్ సత్యము అసత్యము వేరుపరచునట్టి గ్రంథము.

కాండ 15 - సూ॥ బనీయిస్రాయీల్ - 9 ఆయతా

ఇన్నహాజల్ - ఖుర్ - ఆన - యహీది - లిల్లతీ - హియ - అఖ్వము - వ - యు - బష్షిరిల్ - మూమినీ - నల్ - లజీన - యఅ - మలూ - నస్సాలి హాతి - అన్న - లహుమ్ - అజ్రన్ - కబీరా.

అ॥ ఖురాన్ అన్నిటికంటె స్థిరమైన చక్కని మార్గమును చూపుచున్నది. మరి సత్కార్యముచేయునట్టి విశ్వాసులకు గొప్ప పుణ్యఫలమున్నది అను సంతోషవార్త వారికి వినిపించుచున్నది.

# 2. ప్రార్థన - నమాజ్

సర్వ మతములవారు వారి వారి మతాచారము లనుసరించి ప్రార్థనచేయుచున్నారు. హిందూ - మహమ్మదీయ క్రైస్తవ ప్రార్థనాది వివరములు ముందు వివరించబడును.

ప్రార్థన చేయుటవలన అంతర్గతదురితజాలము లన్నియు నమసి పటాపంచలైపోయి పరిశుద్ధ మనస్కులగుదురు. ఇహాపర సౌఖ్యము లకు దోహదము. కనుకనే ఎవరిఇష్టదైవములను వారు పూజించుచూ, సేవించుచూ తమకు దేవునిపైగల భక్తిశ్రద్ధలు ప్రదర్శించుచున్నారు.

భగవద్గీత :— అ 4 - శ్లో 11.

యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః॥

తా. ఎవరు ఏ ప్రకారముగ నన్ను సేవించుచున్నారో దాని కనుగుణముగానే నేనును అనుగ్రహించుచున్నాను. ఎవరెన్ని విధము లచే నైనను నన్నే అనుసరించుచున్నారు.

ఖురాన్ కాం - 2 - సూ॥ బఖరే 238 - 239 ఆ

హా - ఫిజూ - అలస్ - సలవాతి వస్ - సలాతిల్ - వుస్తా - వఖూమూ లిల్లాహి - ఖాని తీన్ —
ఫ - ఇన్ - ఖిప్తి - తుమ్ - ఫరి - జాలన్ - ఔ - రుక్ - బానన్ - ఫ ఇజా అమిన్తుమ్ - ఫజ్ - కురుల్లాహ - కమా - అల్లమ - కుమ్ - మాలమ్ తకూనూ - తల - లమూన్

అ. జాగ్రత్తగా అన్నినమాజులకు - మధ్యనుండు నమాజును చదువుడు. దేవునియెడల భయభక్తులతో నిలువబడుడు. (239) మరల మీకు భయమున్నచో నడచుచూగాని, స్వారిచేయుచుగాని నమాజు సలుపుడు. ఆ పిదప మీకు శాంతము లభించినచో మీకు తెలియు దానిని దేవుడు నేర్పినట్లు దేవుని స్మరింపుడు.

కాండ 7 - సూ॥ అన్ అమ్ - 72 ఆ.

వ అన్ - అఖీమున్ - సలాత వత్ర - ఖూహోవహు - వల్లజీ - ఇలైహి -
తుష్ - షరూన్ —

అ॥ నమాజు స్థిరముగ సలుపవలెనని, దేవునికి భయపడవలెనని మాకు ఆజ్ఞయైయున్నది. ఆతనియొద్దకే రప్పింపబడుదురు. ఓ ప్రవక్తా ! పలుకుము.

అ 8. శ్లో 5.

అంతకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

తా. ఎవరు అంత్యకాలమందున నన్నే స్మరించుచూ దేహమును వదలుదురో వారు నన్నే పొందుననుటకు సందేహములేదు.

అ 9 - శ్లో 22

అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

తా. ఇతర చింతలులేక ఎవరు నన్ను ప్రార్థించుచున్నారో, నిత్యము నన్నేగతిగా తలంచుదురో, వారల యోగక్షేమములను స్వయముగా చూచుచున్నాను.

అ 18 - శ్లో 56

సర్వ కర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్॥

తా. ఎల్లప్పుడు నన్ను ఆశ్రయించినవాడై సమస్త కర్మలు చేయువాడు నాఅనుగ్రహమున శాశ్వత స్థానముగల నన్నేపొందును.

బైబిలు : ఎడతెగక ప్రార్థనచేయుడి. 1 థెస్స 5 : 17.

మీరు నా నామమునుబట్టి దేనినడుగుదురో తండ్రి కుమారుని యందు మహిమ పరచబడుటకై దానినిచేతును. నా నామమునుబట్టి మీరునన్నేమిఅడిగినను నేనుచేతును. అని ప్రభువైన క్రీస్తు చెప్పెను.
యోహా 14 : 13, 14.

నాయందు మీరును మీయందు నామాటలును నిలిచియుండిన యెడల మీకేది యిష్టమో అడుగుడి, అది మీకు అనుగ్రహింపబడును.
యోహా 15 : 7.

మీ సంతోషము పరిపూర్ణమగునట్లు అడుగుడి. మీకు, దొరుకును.
యోహా 16 : 24.

ప్రార్థనచేయునప్పుడు మీరు అడుగుచున్నవాటినెల్లను పొందియున్నామని నమ్ముడి; అప్పుడు అవిమీకు కలుగునని మీతో చెప్పుచున్నాను.
మార్కు 11 : 24.

ఆత్మవలన ప్రతిసమయమందును, ప్రతివిధమైన ప్రార్థనను, విజ్ఞాపనను చేయుచు; ఆవిషయమై సమస్త పరిశుద్ధుల నిమిత్తమును; పూర్ణమైన పట్టుదలతో విజ్ఞాపన చేయుచు మెళుకువగా ఉండుడి.
ఎఫె 6 : 18

## ఖుదారసూల్‌కా హుకుం (భగవంతుడైన దేవునిఆజ్ఞ)

అల్లాహ్ (దేవుడు) వేదగ్రంథమైన ఖురాన్ ఖరీఫునందు, స్త్రీ పురుషులు, ధనవంతులు - బీదవారు అనువారు వివక్షతలేక ప్రార్థనచేయుట ముఖ్యము. ప్రవక్తలు - భక్తులు ఈ భక్తిచేతనే తరించిరి. అందువలన దేవుడు యిష్టార్థములకు వారలకుయిచ్చి ప్రార్థనచేయుచున్నందున సంతోషుడగుచున్నాడు. దేవతలు - పైగంబరులు-భక్తులు అందరుకూడ ప్రార్థనచేసినవారిని దేవదూతలుగా విశ్వసించుచున్నారు. వెలుగు, తేజస్సు హృదయమునకు కలుగుచున్నది. ప్రార్థనచేయుటవలన ఇహపరసౌఖ్యము లరయుటకు తరుణోపాయమగును.

బైబిలు:—మనము సంపూర్ణభక్తియు, మాన్యతయు కలిగి, నెమ్మదిగాను, సుఖముగాను, బ్రతుకునిమిత్తము అన్నిటికంటె ముఖ్యముగా మనుష్యులందరికొఱకును, రాజులకొఱకును, అధికారులందరికొఱకును, విజ్ఞాపనములును, ప్రార్థనలును, యాచనలును, కృతజ్ఞతాస్తుతులును చేయవలెనని మిమ్ము హెచ్చరించుచున్నాను.
(1 తిమో 2 : 1, 2,)

మీరు ప్రార్థనచేయునప్పుడు అన్యజనులవలె వ్యర్థమైనమాటలు వచింపవద్దు; విస్తరించి మాటలాడుటవలన తమమనవి వినబడునని వారు తలంచుచున్నారు. (మత్త 6 : 7)

# 3. ప్రార్థన

ఖురాన్ కాం 21 - సూ॥ అన్ - కబూత్ - 45 ఆ

ఉత్లు - మా - ఊహియ - ఇలైక - మినల్ - కితాబి - వ - అఖి - మిస్ సలాత - ఇన్నస్ - సలాత - తన్హా - అనిల్ - ఫహ్‌షాఇ - వల్-మున్కరి వ - లజిక్ - రుల్లాహి - అక్బరు - అల్లాహు - యఅ - లము - మా - తస్ - నఊన్.

ఓ ప్రవక్త! నీకునొసంగబడిన గ్రంథమును పఠించుచుండుము. మరియు నమాజును స్థిరముగా సలుపుడు. నిశ్చయముగా నమాజు సిగ్గుమాలిన పనులనుండియు, అధర్మకార్యములనుండియు ఆటంక పరచును. దేవునినామస్మరణము చాలగొప్పది. మరి మీరు చేయున దంతయు దేవునికి తెలియును.

కాం 21 సూ॥రూమ్. అ 17 : 18.

ఫ - సుబ్ - హానల్లాహి - హీన - తుమ్ - సూన - వ - హీన - తుస్ - బి హూన్ - వ - లహుల్ - హమ్దు - ఫిస్ - సమావాతి - వల్ - అర్జి - వ అషీ - యన్ - వ - హీన - తుజ్ - హిరూన్.

అ॥ కావున మీరు ప్రొద్దుగ్రుంకినకాలమందును, ప్రాతఃకాల మందును దేవునిపవిత్రత కొనియాడుడు. మరియు ఆకాశములోను, భూమిలోను ఆతనికే స్తోత్రమున్నది. మరియు సాయంకాలమందును, ప్రొద్దువాలునపుడును దేవునిపవిత్రత కొనియాడుడు.

బైబిలు:—నా ప్రియసోదరులారా! మీ ప్రయాసము ప్రభువు నందు వ్యర్థముకాదని యెరిగి, స్థిరులును, కదలనివారును, ప్రభువు కార్యాభివృద్ధియందు ఎప్పటికిని ఆసక్తులునై యుండుడి.

1. కొరింథీ 15 ; 5 ; 8

ఖురాన్ - కాం. 23 - సూ॥ మునాఫిఖూన్ - ఆ 9.

యా - అయ్యు - హల్లజీన - ఆమనూ - ఇజా - నూదియ - లిస్ - సలాతి మిన్ - యౌమిల్ - జుముఅతి - ఫస్ - ఔ - ఇలా - జక్-రిల్లాహి - వ - జరుల్ - బైఅ - జాలికుమ్ - ఖైరుల్ - లకుమ్ - ఇన్ - కున్ - తుమ్-తఅ-లమూన్.

అ॥ ఓ విశ్వాసులారా! శుక్రవారమునాడు ప్రార్థనకుగాను పిలువబడినపుడు మీరు దేవునిధ్యానముకై పరుగెత్తి రండు. మరియు వ్యాపారమును వదలిపెట్టుడు. మీకు తెలిసియున్నచో యిది మీకు చాల మేలైనది.

కాం - 23. సూ॥సాద్ - 180 ఆ

సుబహాన - రబ్బిక - రబ్బిల్ - ఇజ్ జతి - అమ్మా - యసిఫూన్ - వ - సలామున్ - అలల్ - ముర్ - సలీన్ 182 వల్ - హమ్దు - లిల్లాహి - రబ్బిల్ - ఆలమీన్.

అ॥ చాల గౌరవనీయుడగు ప్రభువు. వారుపలుకు విషయ ములనుండి పరమపవిత్రుడుగా నున్నాడు. (182) మరియు ప్రవక్తలకు సలామ్ (శాంతి) అగుగాత. (183) మరియు సర్వలోకములకు ప్రభువగు దేవునికే సర్వస్తోత్రము లున్నవి.

N. B. ఈ స్తోత్రము ప్రతిప్రార్థన అంత్యమందును, ప్రతిసభ ముగియునప్పుడు చదువదగినది.

## 4. ఉపవాసములు (రోజా)

అ 6 - శ్లో 14 ముందు వివరించడమైనది.

అన్ని మతములవారు ఉపవాసములు చేయుచున్నారు. చేయ వలసినదిగా భగవంతునిఆజ్ఞయై యున్నది. అందువలన దేవునియందు నిశ్చలభక్తి - పవిత్రత - కష్టసుఖములు తెలిసి, సత్యము - దయ - శాంతగుణము అలవడి సన్మార్గమునకు దోహద మిచ్చుచున్నవి. ముస్లిమ్సు, రంజాన్ షరీఫ్ నెలలో ఉపవాసములు పవిత్రతతో ఆచరించుచున్నారు.

ఖురాన్ - కాం. 2 - సూ॥ బఖరా - 183 పేరా॥

యా - అయ్యు - హల్ల - జీన - ఆమనూ - కుతిబ - అలైకు - మున్ సియామ్
- కమా - కుతిబ - అలల్లజీన - మిన్ - ఖబ్లికుమ్ - ల - అల్లకుమ్ - తత్తఖూన్.

అ॥ మీ పూర్వీకుల కెట్లు ఉపవాసధర్మము విధింపబడెనో అటులే మీరు భక్తులగుటకై ఉపవాసములు విధింపబడినవి.

## 5. జకాత్ (ధర్మము)

ప్రతి మతస్థులు బీదసాదలకు, అనాథులకు, మానవసేవయే మాధవసేవగా తలచి శుభాశుభకార్యములయందు, పండుగ పబ్బము లందు ధర్మములు వారి వారి శక్తిసామర్థ్యము లనుసరించి చేయు చున్నారు. ఈ ధర్మమే మనకు నీడగనుక అన్నిమతములవారు ఇహపర సౌఖ్యము లరయుటకు తరణోపాయమని వేదములు ఘోషించుచుండుటచేత ప్రతివారు చేయుచున్నారు. సత్యంవద - ధర్మంచర - సూక్తులు ప్రపంచ ఆరాధ్యసూత్రములుగా వెలయు చున్నవి.

(దర్దదిల్కె వాస్తె పయిదాకియా ఇన్‌సాన్‌కు) మానవుల కష్ట సుఖము లరయుటకే భగవంతుడు మనుష్యులను సృష్టించెను. కనుక దశవిధ దానధర్మములు చేయుచున్నారు.

భగవద్గీత - అ 3 - శ్లో 35.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

తా॥ చక్కగా ఆచరింపబడి మరొకని ధర్మముకంటె గుణ లోపమున్నను తను చేయుధర్మమే శ్రేష్ఠమైనది. దోషము లేనిదైనను యితరులయొక్క ధర్మము భయమును కలిగించును.

ఖురాన్:—కాం - 3 - సూ॥ బఖరా - 271

ఇన్ - తుజ్ - దుస్ - సద - ఖతి - ఇమ్మా - హియ - వ - ఇన్ - తుఖ్ - ఫూహావతూ - తూాహల్ - ఫు - ఖరాఅ - ఫహువ - ఖైరుల్ - లకుమ్ - వ - యుకఫ్ఫీరు - అన్ - కుమ్ - మిన్ - సయ్యి - ఆతి - కుమ్ - వల్లాహు - బిమా - తఅమలూన - ఖబీర్.

అ॥ మీరు దానము బహిరంగముగా నొసంగిన మంచిదియే. మరి గుప్తముగా నిరుపేదలకు చేసిన అదిమేలే. మరి మీకున్న పాపములను పోగొట్టును. మీరు చేయుకర్మలు దేవునికి బాగుగా నెరుకయే.

కాండ - 4 - సూ॥ నిసా - 5.

వలా - తూతుస్ - సుఫహాలి - అమ్వాల - కుముల్ - లతీ - జఅ - లల్లాహు- లకుమ్ - ఖియామన్ - వర్ - జుఖూహుమ్ - ఫీహావక్సూహుమ్ - వఖూలూ లహుమ్ - ఖౌలమ్ - మఅ - రూఫా.

అ॥ మరియు దేవుడు మీకు జీవనాధారముగ జేసిన మీ ధనమును అవివేకులకు యిచ్చివేయుడు - మరియు వారికి దానినుండి ఆహారమును, వస్త్రము లిచ్చుచుండుడు - వారిని తగినమాటలలో తృప్తిపరచుడు.

కాం - 27 - సూ॥ నజమ్ - 38 - to 41 ఆ.

అల్లా - తజరు - వాజి - రతున్ - విజ్ర - ఉఖ్రా - 39 వ - అల్ - లైస - లిల్ - ఇన్ - సాని - ఇల్ల - మా - సఅ - 40 వ - అన్న - సఅ - యహూ- సౌఫ - యురా 41 - సుమ్మ - యజ్ - జా - హుల్ - జజా - అల్ - ఔఫా 42-వ - అన్న - ఇలా రబ్బికల్ - మున్ - తహా.

అ॥ ఎవడును మరొకని పాపభారమును మోయలేడు. (39) మరియు మానవునకు తానుచేసినదే లభించును. (40) మరియు మానవుని కృషి శీఘ్రములోనే చూడబడును. (41) మరియు వానికి సంపూర్ణముగా ప్రతిఫలము ఒసంగబడును. (42) నీ ప్రభువు వద్దకే బోవలసియున్నది.

కొం - 30 - సూ|| - హో - అ 7 - 11 :

7. వ - వజదక - జాల్లన్ - ఫహదా 8. వ - వజదక - అ - ఇలన్ - ఫ - అగ్నా - 9. ఫ - అమ్మల్ - యతీమ - ఫలా - తఖ్ - హర్ - 10. వ - అమ్మస్ - సాఇల - ఫలా - తన్ - హర్ - 11. వ - అమ్మా - బి - నిఅ - మతి - రబ్బిక - ఫహద్ దిస్.

మరియు దేవుడు నిన్ను మార్గము తెలియనివానిగ పొందెను. (కావున నీకు ధర్మమార్గము చూపెను. (8) మఽరియు నిన్ను దేవుఁడు నిరుపేదవానిగా పొందెను. కావున నిన్ను ధనవంతునిగాచేసెను. (9) కావున తండ్రిలేని బిడ్డను నీవు గద్దింపకుము (10) మరియు అడుగు నట్టివానిని అదలింపకుము. (11) మరియు నీ ప్రభువుయొక్క మేళ్ళను గూర్చి పలుకుచుండుము.

## 5. యాత్ర (హజ్) యజ్ఞములు - (ఖుర్బానీ)

ప్రతిమతస్థులు ముఖ్యముగా యాత్రలుచేయుచూ అచ్చటి పవిత్ర దేవుళ్ళయొక్కయు, దేవతలయొక్కయు ఆలయములను దర్శించియును, ప్రవక్తలయొక్క పవిత్రసమాధులను దర్శించియును, వారలబోధనలు తప్పకుండా ఆచరించుటకు ప్రయత్నించుచూ తమ శీలమును వృద్ధిచేసుకొనుచున్నారు.

హిందువులు ఆ యా దేవుళ్ళకు సంవత్సరములోజరుగు కల్యాణములు - తీర్థములు సేవించుచు, పవిత్రదినములందు దేవుళ్ళకు మ్రొక్కుచు, భక్తిశ్రద్ధలతో కానుకలు సమర్పించుచూ పూజించు చున్నారు. ఇట్టివి కాశీ - రామేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రము లెన్నోగలవు.

ముస్లిములు:—ప్రవక్తలయొక్కయు, మహాత్ములయొక్కయు సమాధులు దర్శించుచూ, వారలకు జరుగు ఉరుసుమహోత్సవములలో తమ మ్రొక్కుబడులు ఫలహారములు భక్తిశ్రద్ధలతో అర్పించుచున్నారు. మక్కా - మదీనా చాలా పవిత్ర పుణ్య క్షేత్రములు.

క్రైస్తవులు:—అదేవిధముగా ఆచరించుచూ తమ పుణ్యక్షేత్రములను దర్శించుచున్నారు. జెరూసలేము - పాలెస్తీన్ మొదలగు పట్టణములలో పుణ్యక్షేత్రములు గలవు.

ఖురాన్ - కాం - 2 సూ॥ బఖరా - 158 :

ఇన్నస్ - సఫా వల్ - మర్ వత - మిన్ - షఆ - ఇరిల్లాహి - ఫమన్ - హాజ్జల్ - బైత - అవిఅ - తమర - ఫలా - జునాహ - అలైహి - అన్ - యత్ - తవ్వఫ - బిహిమా - వమన్ - తతవ్వఅ - ఖైరన్ - ఫఇన్నల్లాహ - హాకిరున్ అలీమ్.

అ॥ నిశ్చయముగా సఫా - మర్వాయందు దేవుని గుర్తులున్నవి. కావున ఎవరు కాబామశీదు యాత్రచేయుదురో లేక ఉమ్రాచేయుదురో ఈ రెంటికిమధ్య ప్రదక్షించినచో వారికెట్టి దోషములేదు. మరియు తన సంతోషముతో సత్కార్యముచేయునో దేవుడు వానిఫలితము నొసంగువాడును సర్వజ్ఞుడు.

## యజ్ఞములు (ఖుర్బానీ)

యజ్ఞములు చేయవలసినదిగా వేదములు చెప్పుచున్నవి.

అ 3. శ్లో 10. సహయజ్ఞాః ప్రజాసృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేనప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్.

తా. బ్రహ్మ సృష్టికాలమందు యజ్ఞములతోకూడిన ప్రజలను సృష్టించి, ఓ ప్రజలారా! యజ్ఞములచేత దేవతల నారాధింపుడు. యజ్ఞములు చేయుటవలన కామధేనువువలె మీకోర్కెలు దీరగలవు.

అ 3. శ్లో 11. దేవాన్భావయతానేన తేదేవా భావయంతువః
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ.

తా. యజ్ఞములచేత దేవతలనారాధింపుడు. దేవతలు మీకు కావలసిన వర్షాదులు పరలోకమున స్వర్గము యీయగలరు. పరస్పరము స్నేహముగానుండుడు.

యజ్ఞములు అనేక రకములు:—

పంచయజ్ఞములు=(1) దేవయజ్ఞము=దేవతలకొరకు తృప్తి చేయు యజ్ఞము (2) పితృయజ్ఞము = పితృదేవతలకొరకు చేయు యజ్ఞము (3) మనుష్యయజ్ఞము=అతిథిఅభ్యాగతులకు చేయు యజ్ఞము (4) భూత యజ్ఞము = జంతువులకు సేవచేయు యజ్ఞము (5) బ్రహ్మయజ్ఞము = భగవంతుని నామము పారాయణచేయుట, వేదాధ్యయనము చేయుట.

N. B. 1 నుండి 5 యజ్ఞములు అన్ని మతములవారు చేయుచున్నారు. శుభాశుభము లందు, పండుగపబ్బములందు దేవతల ప్రీతికొరకు వారలను స్మరించుటయు పితృదేవతలకు పిండదానాదులు, కర్మకాండలు వారల పేరులపై జరిపి, అధితి అభ్యాగతులకు అన్నదాన సంతర్పణాది క్రియలు, దశవిధ దానధర్మములు చేయుచున్నారు.

ఖురాన్:—కాండ 2. సూ॥ బఖరా - 296.

దేవునికొరకు హజ్ (యాత్ర) ఉమ్రా (కాబాదర్శనము) చేయుడు. మీ కేదియైన ఆటంకము కలిగినచో మీకులభించు ఖుర్బానీ (బలి) మీరు చేయవలయును. ఉపవాసములు, ధర్మములు చేయవలసినదిగా వివరించియున్నారు.

కాండ 7. సూ॥ మాయదా 95.

యాత్రలో (ఇహ్రామ్) యుండునంతవరకు వేటజంతువులను చంపకూడదు. చంపినచో ఖుర్బానీగాని, ఉపవాసముగాని అన్న సంతర్పణగాని చేయవలయును.

కాండ 1- సూ॥ బఖరా – 65

వ - లఖద్ - అలిమ్ - తుముల్లజీ - నఅ - తదౌ - మిన్ - కుమ్ - ఫిస్ - సబ్తిఫఖుల్నా - లహుమ్ - కూనూ - ఖిర - దతన్ - ఖాసియీన్.

అ॥ శనివారమునాడు ఏలాటివేటలు చేయక ప్రార్థన సలుపు చుండవలెను. అని ఆజ్ఞ.

## 6. తల్లిదండ్రులు (మా - బాఫ్‌కా అదబ్)

దేవునితరువాత ప్రత్యక్ష దైవాంశసంభూతులు. అందుచేతనే మాతృదేవోభవ - పితృదేవోభవ - గురుదేవోభవ అని వేదవాక్యము. దేవునితో సమానులు గనుక తల్లిదండ్రుల సేవలుచేయుచూ, వారిని పూజించుచూ, వందనము లాచరించుచూ వారల అమోఘాశీర్వాదములను పొందవలయును.

ఖురాన్ - కాం - 15 - సూ॥బనీ యిస్రాయీల్. 23

వ - ఖజా - రబ్బుక - అల్లా - తఅ - బుదూఇల్లా - ఇయ్యాహు - వబిల్ - వాలి - దైని - ఇహ్ - స్తానన్ - ఇమ్మా - యబ్ - లుగన్న - ఇన్దకల్ - కిబర - అహదుహుమా - ఔ - కిలాహుమా - ఫలా - తఖుల్ - లహుమా - ఉఫ్ - పిన్ - వలాతన్ - హర్ - హుమా - వఖుల్ - లహుమా - ఖౌలన్ - కరీమా

అ॥ మరియు నీప్రభువు నేతప్ప నితరులను మీరా రాధింపకూడదు. తల్లిదండ్రులకు మేలు చేయవలెను. వారలు ముదుసలులైనచో వారికి సేవచేయుడు. వారలను గద్దింపక భయభక్తులతో మర్యాదగా ప్రవర్తింపుడు.

అల్ - జన్నతు - తహతుల్ - అఖ్ - దామె - ఉమ్మహాతుకుమ్,

అ॥ తల్లిపాదముక్రింద స్వర్గమున్నదని ఎవరు మాతృపూజ చేయుదురో వారు స్వర్గఫలమును పొందుదురు.

బైబిలు:—యెహోవా పది ఆజ్ఞలలో ఒకటి.

గీత - అ 9 - శ్లో 17.

పితాఽహ మస్య జగతా మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవచ॥

అ॥ నేనే యీ ప్రపంచమునకు తండ్రిని, నేనే తల్లిని, నేనే తాతను, వేదములు నేనే, వేదములలో తెలియదగినది నేనే, ప్రణవ స్వరూపమగు ఓంకారమును నేనే.

# 7. గురువు

గురువనగా గొప్పది అని అర్థము. అట్టిశబ్దము బ్రహ్మజ్ఞానము తెలిసినవాడై ఆధ్యాత్మికానుభవము కలవాడై ఇహలోకసౌఖ్యములను రోసి తన్ను తాను తెలుసుకొను జిజ్ఞాస కలవాడే గొప్పవాడని అందురు. గురువనగా అజ్ఞానాంధకారములోనుండి సుజ్ఞానమనెడి జ్ఞానము (వెలుగు) దానముచేయు మహాపురుషుడు గనుకనే గురువును దేవునిగా భావించి పూజించుచున్నారు.

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥

అ॥ బ్రహ్మవిష్ణు స్వరూపుడు గురువేగనుక ప్రత్యక్షపరబ్రహ్మ స్వరూపుడైన గురువునకు నమస్కారము చేయుచున్నాను. అందుచేతను భగవంతుని అవతారముగా భావించి గురువును పూజించి బ్రహ్మవిద్యను ఆర్జించి ఇహపర సౌఖ్యము లరయుటకు ప్రయత్నించుచున్నారు. అందుచేత గురుదేవోభవ అందురు. గురువే దైవము.

# 8. సప్తవ్యసనములు

1. సురాపానముచేయుట, 2. పరసతీగమనము, 3. జూదమాడుట, 4. వేటాడుట, 5. కఠినోక్తులాడుట, 6. పరులసొమ్ము అపహరించుట, 7. నరహత్యచేయుట.

బైబిలు:—ఈ గ్రంథములోని (1-3) యెహోవాపది ఆజ్ఞలు చూడుడు.

ఖురాన్ కొండ 7 - సూ॥ మా ఇదా - 91

ఇన్నమా - యురీదుష్ - షైతాని - అన్-యూఖిఅ - బైనకుముల్ - అదావత - వల్ - బగ్ జా అఫీల్ - ఖమ్రి - వల్ - మైసిరి - వయసుద్దకుమ్ - అన్ జి - కిల్లాహీ వ అనిన్ - సలాతి - ఫహల్ - అన్తుమ్ - ముంతహూన్.

అ॥ సారాయి, జూదములమూలముగ మీమధ్య విరోధములు కలిగించుటకును, దేవునిధ్యానమునుండి తొలగించుటకును సైతాను కోరుచున్నాడు. (దానివలన ధన మాన నష్టములు సంభవించును.) అందుచేత మీరు యిప్పుడైన మానుకొనుడు.

## వేట

ఖు॥ సూ॥ బఖరా - ఆయతు 65

వ - ఖలద్ - అలిమ్ - తుముల్లజీ - నకి - తదౌ - మిన్ - కుమ్ - ఫిస్ - సబి - ఫఖుల్నా - లహుమ్ - కూనూ - ఖిర - దతన్ - ఖాసియీన్.

అ॥ మరియు శనివారమునాడు మీలో అతిక్రమించిన వారిని మీరు బాగుగా ఎఱిగియున్నారు. మేము వారితో మీరు నీచులైన కోతులుకండు అని చెప్పితిమి. (శనివారమునాడు ఏలాటి పనిచేయక ప్రార్థనలు సలుపుమని వేటాడకూడదనియు దేవుని శలవుకాగా యిస్రాయీలు తంత్రముతో శనివారమునాడు వేటాడి శపించబడినవారలై కోతులుగామారి తుదకు మృతినొందిరి.)

## జూదము

గీత అ 10 - శ్లో 36 ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్;
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్.

తా॥ జగత్తు వంచనకార్యములలో జూదము అగుచున్నాను. తేజోవంతులలో తేజస్సు అగుచున్నాను. కార్యసాధనమునకు చేయు ప్రయత్నములలో జయస్వరూపుడను, సాత్వీక బలముగలవారిలో బలమును నేను.

బైబిలు:—భూమిమీదనున్న మీ అవయవములను, అనగా జారత్వమును, అపవిత్రతను, కామాతురతను, దురాశను, విగ్రహారాధనయైన ధనాపేక్షను చంపివేయుడి. వాటివలన దేవుని ఉగ్రత అవిధేయుల మీదికివచ్చును. కొలొస్సై 3 : 5, 6.

బైబిలు:—దీనిలోని యెహోవా పది ఆజ్ఞలు చూడుడు.

# వ్య భి చా ర ము

వ్యభిచారముచేయు స్త్రీ పురుషుల కిరువురకు సంఘములోగాని, ఆఖరుకు ప్రపంచములోగాని గౌరవ ప్రపత్తులులేవు. అతడు ఎంత జ్ఞానియైనా, ప్రజ్ఞావంతులైనా ప్రపంచములో వారు అనుభవించు కష్టసుఖములు చూచుచునే యున్నాము. పాపహేతువులని అన్ని వేదములు చాటుచున్నవి.

ఖురాన్ - క్రాం - 15 - సూ॥ బనీయిస్రాయిల్ - 32 పేరా.

వలా - తఖ్ రబుజ్ - జినా - ఇన్నాహూ - కాన - ఫాహిషతన్ - వసాఅ - సబీలా

అ॥ వ్యభిచారము సమీపింపకుడు - అది సంఘములో సిగ్గులేని పని - చాల చెడ్డత్రోవ - పాపహేతువు - నరకహేతువు.

గీత॥ అ 16 - 16 శ్లో

అనేక చిత్తవిభ్రాంతా మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకే ఽ శుచౌ.

తా॥ అనేకవిధములగు మనోవైకల్యములకు పాల్పడుచూ; మోహమను వలతో చుట్టబడి కామసుఖములయందు ఆసక్తి కలవారు అసహ్యమైన నరకమునందు కూలుచున్నారు.

బాలదర్శనోపనిషత్తు:—

శ్లో॥ కాయేన మనసా వాచా స్త్రీణాంతు పరివర్జనం
ఋతే భార్యాం తదాసక్తః బ్రహ్మచర్యం త దుచ్యతే.

తా॥ వాక్కుచేత మనస్సు, దేహము, పరస్త్రీలను వర్జించుట, ఋతుకాలమందు మాత్రము ధర్మపత్నితో యుండుట గృహస్థ బ్రహ్మచర్య మనంబడును.

బైబిలు:—దీనిలో యెహోవా పదిఆజ్ఞలు చూడుడు.

అ 10 - శ్లో - 4, 5

4. బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాఽభయమేవచ॥

5. అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽ యశః।
భవంతి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః॥

తా. బుద్ధి, జ్ఞానము, తెలివియు, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, సుఖము, దుఃఖము, ఉత్పత్తి, నాశనము, భయము, నిర్భయము ఈ మొదలగునవియు,

5. అహింస, సమత్వ దృష్టి, తపస్సనే ధ్యానము, యశస్సు, అయశస్సు, ప్రాణులకు నానావిధములైనభావములు నావలననే కలుగుచున్నవి.

## అన్యాయార్జనము (సప్తవ్యసనములు)

అ 16 - శ్లో - 11, 12

11. చింతామపరిమేయాంచ ప్రళయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః.

తా. 11. మరణముతోగానిపూర్తికాని చింతను శాశ్వతముగా తలచి, కామాది భోగములు అశాశ్వతమని తలచక, అంతులేని కోరికలతో కూడుకొన్న వారలై మనము చేయవలసినది ఇంతే అని తలచి,

12. ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థ సంచయాన్॥

తా. 12. ఆశయనెడి త్రాళ్ళచే కట్టబడినవారలై, కామక్రోధనులై కామార్థి అన్యాయముగా భోగభాగ్యములకు ధనమును అధర్మముచేత ఆర్జించుటకు కోరుచున్నారు.

ఖురాన్ కాండ 1 - సూ. బఖరా - 188

వలా - తాకులూ - అమ్ - వాలకుమ్ - బైనకుమ్ - బిల్ - బాతిలి -
వ - తుద్ - లూ - బిహా - ఇలల్ - హుక్కామి - లి - తాకులూ -
ఫరీఖమ్ - మిన్ - అమ్ - వా - లిన్నాసి - బిల్ - ఇస్మి - వ -
అన్తుమ్ - తహ - లమూన్

అ॥ మరి మీరు ఒకరిసొమ్ము నొకరు అన్యాయముగా గైకొన కుడు. మరి ప్రజలసొత్తులోని కొంతభాగము అధర్మముగా గొనుటకు గాను దానిని అధికారులయొద్దకు గొనిపోకుడు. ఇది మీకు తెలిసియే యున్నది.

ఖురాన్ కాండ 15 - సూ. బనీ యిస్రాయీల్ - 35

వ - ఔఫుల్ - కైల - ఇజా - కిల్తుమ్ - వ - జినూ - బిల్ - ఖిస్-
తాసిల్ - ముస్ తఖీమి - జాలిక - ఖైరున్ - అహ్ - సను- తావీల-

అ॥ మరియు మీరు కొలుచునప్పుడు నిండుగాకొలిచి యియ్యుడు. సరిఅగు త్రాసుతోతూయుడు. ఇది శ్రేష్ఠము. మరి దీనిఫలితము చాల గొప్పది.

బైబిలు:—యోహోవా పది ఆజ్ఞలు చూడుడు.

దొంగత్రాసు యోహోవాకు హేయము. సరియైన గుండు ఆయనకు ఇష్టము.
సామి 11 : 1

ఖురాన్ - కాండ 27. సూ॥ రహ్మాన్ - 8 : 9 ఆ:

అల్లా - తల్ గౌ - ఫిల్ - మీజాన్ - (9) వ - అఖీ - ముల్ - వజ్ న - బిల్
ఖిస్ - తి - వలా - తుఖ్ - సిరుల్ - మీజాన్.

అ॥ మీరు తూకములో హెచ్చుతగ్గులులేక త్రాసునుంచెను. (9) మరియు న్యాయముగ తూకమును సరిగనుంచుడు. తూకములో తక్కువ చేయకుడు.

కాం 39. సూ॥ తత్ ఫీఫ్. 1 ఆ:

వైలుల్ - లిల్ - ముతఫ్ఫి - ఫీన్.

అ॥ తగ్గించియిచ్చువారికి గొప్ప వినాశముగలదు.

బైబిలు:—యోహోవా పదిఆజ్ఞలు చూడుడు. ధనాపేక్షలేని మనస్సుగలవారై మీకు కలిగినవాటితో తృప్తినొంది యుండుడి.

హెబ్రీ 13 : 5.

# సత్యము

గీత. అ. 10 శ్లో - 4 - 5 - చూడుడు.

కొం 17 - సూ - అంబియా - ఆ 18.

బల్ - నఖ్ - జపు - బిల్ - హఖ్ఖి - అలల్ - బాతిలి - ఫయద్ - మఃగుహూ - ఫఇజా - హువ - జాహి - ఖున్ - వల - కుముల్ - లైలు - లిమ్మాత - సిఫూన్.

అ. మేము సత్యమును అసత్యముపై విసరికొట్టుచున్నాము. అది దానితల పగులగొట్టుచున్నది. తక్షణము అసత్యము నశించిపోవుచున్నది. మీరు కల్పించుదానినిబట్టి మీకు వినాశ మున్నది.

బైబిలు:—మోసముచేయువాడు నాయింట నివసింపరాదు. అబద్ధముచెప్పువాడు నా కన్నులయెదుట నిలువడు. (కీర్తన 101 : 7)

సత్యము దేవుని మూలమైనది. (కీర్తన 19 : 15 - 1)

లేనివార్త పుట్టింపకూడదు. అన్యాయపుసాక్ష్యము పలుకుటకై నీవు దుష్టునితో నీవు కలియకూడదు. (నిర్గ 23 : 1)

## యెహోవా పది ఆజ్ఞలు

1. నేనే నీ దేవుడైన యెహోవాను. నేనుతప్ప వేరు ఒక దేవుడు నీ కుండకూడదు.
2. దేవుడైన యెహోవా నామము వ్యర్థముగా యుచ్చరింప కూడదు.
3. విశ్రాంతిదినమును పరిశుద్ధముగా నాచరింపవలెను.
4. నీ తల్లిని తండ్రిని సన్మానించుము.
5. నరహత్య చేయకూడదు.
6. వ్యభిచరించకూడదు.
7. దొంగిల కూడదు.
8. అబద్ధసాక్ష్యము చెప్పకూడదు.
9. నీ పొరుగువాని యిల్లు ఆశింపకూడదు.
10. నీ పొరుగువాని దగు దేనిని ఆశింపకూడదు.

# 9. సత్క్రియలు

గీత॥ అ 13 – శ్లో 8

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥

అ. అహంభావత్వము – డాంబికము – అహింస – ఓర్పు – బుద్ధి–గురుసేవ – బాహ్యాంతరశుచిత్వము – చలనములేకుండుట, మనోనిగ్రహముగా యుండుట సత్క్రియలలో చేరినవి.

గీ॥ అ 16 – శ్లో 2

శ్లో॥ అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతి రపైశునమ్
దయాభూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥

అ. అహింస, సత్యము, కోపములేకుండుట, త్యాగము(దానము), శాంతి, ఒకరిలోపము ఒకరితో చెప్పుట – ప్రాణులయందు దయ, యింద్రియనిగ్రహము, కరుణ (మెత్తదనము), నిరాడంబరము, చేసిన మేలు మరువకుండుట (కృతజ్ఞత) సత్క్రియలనబడును.

గీ॥ అ 16 – శ్లో 21

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్రయం త్యజేత్॥

తా. కామ క్రోధ లోభములు యీమూడును నరకమున బడద్రోయుటకు శీలలుగల ద్వారములు గనుక యీ మూటిని విడిచి పెట్టవలయును.

# 10. వైరాగ్య శ్లోకములు

శ్లో॥ ఆశయాబద్ధ్యతే లోకః కర్మణా బహు చింతయా
ఆయుఃక్షీణం నజానాతి తస్మాజ్జాగృత జాగృత॥

తా. ఆశాపాశముచేత లోకము కట్టబడినది. ఆశనిడుపగుకొలది కార్యచింత హెచ్చుగుచున్నది. ఆయువూరక క్షీణించిపోవుచున్నది. అది ఎరుగక అందరు నిద్రించుచున్నారు.

శ్లో॥ క్షణచిత్తం క్షణంవిత్తం క్షణంజీవిత మావయోః
యమస్యకరుణానాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

తా. మనస్సు, ధనము, జీవితము, వయస్సు శాశ్వతములు కావు. క్షణభంగురములు. యముడా నిర్దయుడు గనుక జాగ్రత్తపడుము.

శ్లో॥ మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధుస్సహోదరః
అర్థోనాస్తి గృహంనాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

తా. తల్లిలేదు తండ్రీలేదు, బంధువు సహోదరులులేరు, ధనము లేదు, యిల్లులేదు గనుక జాగ్రత్తపడుము.

శ్లో॥ కామః క్రోధశ్చలోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగ్రత జాగ్రత॥

తా. కామ క్రోధ లోభమనువారలు నీదేహములో ప్రవేశించి జ్ఞానమనెడు రత్నమును హరించుటకు ప్రయత్నించుచున్నారు. మేలొ్కనుడు.

## 11. సత్కార్యముల ఫలితము

కాం 8 సూ॥ అన్ ఆమ్ - 161

మన్ - జాఅ - బిల్ - హసనతి - ఫలహూ - అష్రు - సాలిహా వమన్ - జాఅ - బిస్ - సయ్యి - అతి - ఫలా - యుజ్ జా - ఇల్లా మిన్ - లహా - వహుమ్ - లా - యుజ్ - అమూన్.

అ॥ ఎవరు ఒక్క సత్కార్యముచేయుదురో వారికి దాని పది యంతలు పుణ్యముకలదు. ఎవరు పాపకార్యముచేయుదురో వారికి దాని అంతటి శిక్షయే లభించును. మరి వారికేలాటి అన్యాయము జరుగనేరదు.

కాం - 12 - సూ॥ హూద్ - 23

ఇన్నల్ - లజీన - ఆమనూ - వ - అమి - లున్ - సాలిహాతి - వ - అఖ్ - బతూ - ఇలా - రబ్బిహిమ్ - ఉలా ఇక - అస్ - హాబుల్ - జిన్నతి - హుమ్ - ఫీహా - ఖాలిదూన్.

అ॥ నిశ్చయముగా ఎవరు విశ్వసించి సత్కార్యములుచేసి తమ ప్రభువునెదుట వినయముచేసిరో వారు స్వర్గనివాసులు. అందు వారు శాశ్వతముగానుందురు.

బైబిలు:— అన్నిటియందు ఎల్లప్పుడును, మీలో మీరు, సర్వసమృద్ధిగలవారై ఉత్తమమైన ప్రతికార్యముచేయుటకు దేవుడు మీయెడల సమస్తవిధములైన కృపను విస్తరింప జేయగలడు.

2. కొరింథ 9 : 8

# అస్థిరము

కాం - 15 సూ॥ కహఫ్ - 46 ఆ॥

అల్ - మాలు - వల్ - బనూను - జీనతుల్ - హయా - తిద్ - దున్యా - వల్ - బాఖియాతుస్ - సాలిహాతు - ఖైరున్ - ఇన్ద - రబ్బిక - సవా - బన్ - వ - ఖైరున్ - అమలా.

అ॥ ధనము, కుమారులు ఇహలోకమునకు అలంకారములు. మరి స్థిరముగానుండు ఫలితమును బట్టియు, ఆశనుబట్టియు నీ ప్రభువు నొద్ద చాలా శ్రేష్ఠములైనవి.

కాం - 30 సూ॥ లైల్ - అ 13

5 ఫ - అమ్మా - మన్ - అ అ తా - వత్ - తఖా 6 వ. సద్దఖ - బల్ - హు - స్నా - 7 ఫసను - యస్-సిరుహూ - లిల్ - యుస్రా 8 వ. అమ్మా - మం - బఖిలవస్ - తగ్ నా (9) వ-కజ్ - జబ్ - బిల్ - హుస్నా 10. ఫ - సను - యస్ - సిరహూ లిల్ - ఉస్రా - (11) వమా - యుగ్ నీ - అన్ హు- మాలుహూ - ఇజా - తరద్దా 12 ఇన్నా - అలైనా - లల్ - హుదా 13. వ - ఇన్న - లనా - లల్ - ఆఖిరత - వల్ - ఊలా.

అ॥ కావున ఎవరు (ధనము) ఒసంగెనో మరియు దేవునికి భయపడెనో మరియు మంచిమాటను విశ్వసించెనో మరియు మేము వానికి సౌఖ్యమునకుగాను సౌకర్యముల నొసంగుదుము. (8) మరెవరు లోభముచేయుచుండెనో లక్ష్యముచేయక పోయెనో (9) మరియు మంచి మాటను తిరస్కరించెనో (10) మేము వానికి కష్టములకుగాను సౌకర్యముల నొసంగుదుము. (11) మరియు వారు వినాశము పొందునపుడు వానిధనము వానికిపనికిరాదు. (12) వాస్తవముగా మార్గముచూపుట మాపని. (13) మరియు మాచేతిలోనే పరలోకము ఇహలోకమును గలదు.

# 12. ముక్తి

అ. 8. శ్లో 5. అంతకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్రసంశయః॥

తా. ఎవరు అంత్యకాలమందు నన్నే స్మరించుచూ, దేహమును వదలుచున్నారో వారు నన్నే పొందుననుటకు సంశయములేదు.

అ. 8. శ్లో. 7. తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్య చ
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్య స్యసంశయః॥

తా. రాత్రింబవళ్లు నన్ను ధ్యానముచేయుము, యుద్ధము చేయుము, నీమనస్సుబుద్ధినాకిమ్ము - నన్నేపొందుదువు - సందియము లేదు.

అ. 8. శ్లో. 10.

ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యాయుక్తో యోగబలేనచైవ
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్యసమ్యక్ సతంపరం పురుషముపైతిదివ్యమ్.

తా. ఎవరు అంత్యకాలమందున చలించని మనస్సుతోను, యోగబలముతోను, కనుబొమలమధ్య ప్రాణవాయువులను పూర్తిగా ప్రవేశింపజేసి స్మరించునో అతడు ప్రయాణకాలమున ముక్తిపొంది నన్ను చేరును.

అ. 8ః శ్లో. 14. అనన్యచేతా స్సతతం యోమాంస్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః.

తా. ఎవరు సర్వకాల సర్వావస్థలయందు నన్నే స్మరించుచుందురో అట్టివారికి నే నతిసులభుడను. ఇతరులకు దుర్లభుడను.

అ. 9. శ్లో. 22. అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

తా. ఇతరచింతలులేక ఏ జనులు నన్ను సేవించుదురో, వారలకు ఎల్లప్పుడు యోగక్షేమములను నేను స్వయముగా చూచుచున్నాను.

అ. 12. శ్లో. 9. అథచిత్తం సమాధాతుం నశక్నోషి మయిస్థిరమ్
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ.

తా. సర్వకాల సర్వావస్థలయందు మనస్సు నిర్మలముగా నాయందుంచజాలవేని క్రమముగాఅభ్యాసముచేసిన నన్నెపొందగలవు.

అ. 18. శ్లో. 56. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్.

తా. ఎల్లప్పుడు నన్నే ఆశ్రయించి సమస్తకర్మలు చేయువాడు నా అనుగ్రహామువలన నన్నె పొందును.

అ. 9. శ్లో. 29. సమోఽహం సర్వభూతేషు నమేద్వేష్యోఽస్తి నప్రియః
యేభజన్తితు మాం భక్త్యా మయి తే తేషుచాప్యహమ్.

తా. సర్వప్రాణులయందు నేనుసముడను, నాకుద్వేషింపబడినది లేదు, యిష్టమయినదిలేదు. అందరియందు సముడను. ఎవరైతే నన్ను సేవించుదురో వారికి నేను వశ్యుడను, నాకు వారు వశ్యులు.

బైబిలు వ్రాయబడినదేమనగా:—నీతిమంతుడుఒకడును లేడు; శాంతిమార్గమువా రెరుగరు. వారిదృష్టియెదుట దేవునిభయములేదు. అందరును పాపముచేసి దేవుడు అనుగ్రహించు మహిమను పొందలేక పోవుచున్నారు. రోమా 3: 10, 7, 18, 23.

కొం - 11 - సూ॥ యూనుస్ - 62 :

అలా - ఇన్న - ఔలియా - అల్లాహి - లా - ఖౌఫున్ - అలైహిమ్ వలా హుమ్ - యహ్ - జనూన్

63. అల్ - లజీన - ఆమనూ - వకానూ - యత్ - తఖూన్ - 64. లహు ముల్ - బుష్రా - ఫిల్ - హయా - తిద్ - దున్యా - వఫిల్ - అఖిరతి - లా - తబ్ - దీలలి - కలి - మా - తిల్లాహి జాలిక - హువల్ - ఫౌ - జుల్ - అజీమ్.

అ॥ వినుడు దేవునికి ప్రియులైనవారికి భయముగాని దుఃఖము గాని యుండనేరదు. (63) ఎవరు విశ్వసించి భయభక్తులు కలిగి యుందురో (64) వారికి ఇహలోకము నందును పరలోకమునందును సంతోషవార్త యున్నది. దేవుని వాక్యములు మారవు. ఇదియే గొప్ప విజయము.

కొం - 15. సూ॥ కహఫ్ - 30 ఆ :

ఇన్నల్ - లజీన - ఆమనూ - వ - అమి - యిస్ - సాలిహాతి - ఇన్నా - లానుజీఉఅజ్ర - మన్ - అహ్‌సా - సన - అమలా - 31. ఉలా - ఇక - లహుమ్ - జిన్నాతుఅద్ - నిన్ - తజ్‌రీ - మిన్ - తహ్‌తి - హాల్ - అన్ - హారు - యు - హాల్ - లౌనఫీహా - మిన్ - అసావిర - మిన్ - జహా - బిన్ - వ - యల్ - బసూన - సియా - బన్ - ఖుజ్ - రమ్ - మిన్ - సున్ - దుసిన్ - వ - ఇస్ - తబ్ - రఖిమ్ - ముత్ - తకిఈన - ఫీహా - అలల్ - అరా - ఇకి - నిఅ - మస్ - సవాబు - వ - హాసు - నత్ ముర్ - తఫఖా -

అ॥ నిశ్చయముగ విశ్వసించిన సత్కార్యములు చేసినవారి పుణ్యకార్యముల ఫలితమును మేము పోగొట్టము. (31) ఇట్టివారికి శాశ్వతమైన స్వర్గవనములున్నవి. అందు కాలువలు ప్రవహించును. అందు వారు బంగారుకడియములు ధరించి సన్ననివియును, దట్టమైనవియునగు పట్టువస్త్రములు ధరించి సింహాసనములపై ఆనుకొని కూర్చుండి యుందురు. ఇది చాల మంచిఫలితము. మరిస్వర్గము చాల మంచి నివాసము.

కొం - 16. సూ॥ తా హ - 74 to. 76

74 ఇన్నహూ - మన్‌యాతి - రబ్బహూ - ముజ్ - రిమన్ - ఫఇన్న - లాహూజహన్నతు - లా - యమూత్తు - ఫీహా - వలా యహ్‌యా - 75. వ మన్ - యాతిహీ - మూమినన్ - ఖద్ - అమి - లస - సాలిహాతి - ఫ - ఉలాయిక - లహు - ముద్ - దర - జాతుల్ - ఉలా -76. జన్నాతు - అద్ నిన్ - తజ్రీమిన్ - తహ్ తిహల్ - అన్‌హారు - ఖాలిదీన - ఫీహా - వ - జాలిక - జజఉ - మన్ - తజక్కా -

అ॥ ఎవరు పాపియై తన ప్రభువునొద్దకు వచ్చునో వానికి నరకమున్నది. అందు వాడు చావడు బ్రతుకడు (75) మరెవరు సత్కార్యములు చేసి వత్తురో వారికి గొప్ప దర్జాలున్నవి. (76) వారికి చిరకాలముండు స్వర్గవనము లున్నవి. అందు కాలువలు ప్రవహించును. అందు వారు చిరకాలముందురు. మరియు ఎవడు పవిత్రుడో వానికి ఈ ఫలితమున్నది.

అ. 12. శ్లో. 9. అథచిత్తం సమాధాతుం నశక్నోషి మయిస్థిరమ్
అభ్యాసయోగేన తతో **మా**మిచ్ఛాప్తుం ధనంజయ.

తా. సర్వకాల సర్వావస్థలయందు మనస్సు నిర్మలముగా నాయందుంచజాలవేని క్రమముగాఅభ్యాసముచేసిన నన్నెపొందగలవు.

అ. 18. శ్లో. 56. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్.

తా. ఎల్లప్పుడు నన్నే ఆశ్రయించి సమస్తకర్మలు చేయువాడు నా అనుగ్రహామువలన నన్నే పొందును.

అ. 9. శ్లో. 29. సమోఽహం సర్వభూతేషు నమేద్వేష్యోఽస్తి నప్రియః
యేభజన్తితు మాం భక్త్యా మయి తే తేషుచాప్యహమ్.

తా. సర్వప్రాణులయందు నేనుసముడను, నాకుద్వేషింపబడినది లేదు, యిష్టమయినదిలేదు. అందరియందు సముడను. ఎవరైతే నన్ను సేవించుదురో వారికి నేను వశ్యుడను, నాకు వారు వశ్యులు.

బైబిలు వ్రాయబడినదేమనగా:—నీతిమంతుడుఒక్కడును లేదు; శాంతిమార్గమువా రెరుగరు. వారిదృష్టియెదుట దేవునిభయములేదు. అందరును పాపముచేసి దేవుడు అనుగ్రహించు మహిమను పొందలేక పోవుచున్నారు. రోమా 3: 10, 7, 18, 23.

కొం - 11 - సూ॥ యూనుస్ - 62 :

అలా - ఇన్న - ఔలియా - అల్లాహి - లా - ఖౌఫున్ - అలైహిమ్ వలా హుమ్ - యహ్ - జనూన్

63. అల్ - లజీన - ఆమనూ - వకానూ - యత్ - తఖూన్ - 64. లహుముల్ - బుష్రా - ఫిల్ - హయా - తిద్ - దున్యా - వఫిల్ - అఖిరతి - లా - తబ్ - దీలలి - కలి - మా - తిల్లాహి జాలిక - హువల్ - ఫౌ - జుల్ - అజీమ్.

అ॥ వినుడు దేవునికి ప్రియులైనవారికి భయముగాని దుఃఖముగాని యుండనేరదు. (63) ఎవరు విశ్వసించి భయభక్తులు కలిగి యుందురో (64) వారికి ఇహలోకము నందును పరలోకమునందును సంతోషవార్త యున్నది. దేవుని వాక్యములు మారవు. ఇదియే గొప్ప విజయము.

కాం - 15. సూ॥ కహఫ్ - 30 ఆ :

ఇన్నల్ - లజీన - ఆమనూ - వ - అమి - యిస్ - సాలిహాతి - ఇన్నా - లానుజీఉఅజ్ర - మన్ - అహ్ - సన - అమలా - 31. ఉలా - ఇక - లహుమ్ - జిన్నాతుఅద్ - నిన్ - తజ్రీ - మిన్ - తహ్తి - హుల్ - అన్ - హారు - యు - హల్ - లౌనఫీహా - మిన్ - అసావిర - మిన్ - జహ - బిన్ - వ - యల్ - బసూన - సియా - బన్ - ఖుజ్ - రమ్ - మిన్ - సున్ - దుసిన్ - వ - ఇస్ - తబ్ - రఖిమ్ - ముత్ - తకిఈన - ఫీహా - అలల్ - అరా - ఇకి - నిఅ - మస్ - సవాబు - వ - హాసు - నత్ ముర్ - తఫఖా -

అ॥ నిశ్చయముగ విశ్వసించిన సత్కార్యములు చేసినవారి పుణ్యకార్యముల ఫలితమును మేము పోగొట్టము. (31) ఇట్టివారికి శాశ్వతమైన స్వర్గవనములున్నవి. అందు కాలువలు ప్రవహించును. అందు వారు బంగారుకడియములు ధరించి సన్ననివియును, దట్టమైనవియునగు పట్టువస్త్రములు ధరించి సింహాసనములపై ఆనుకొని కూర్చుండి యుందురు. ఇది చాల మంచిఫలితము. మరిస్వర్గము చాల మంచి నివాసము.

కాం - 16. సూ॥ తా హ - 74 to. 76

74 ఇన్నహూ - మన్యాతి - రబ్బహూ - ముజ్ - రిమన్ - ఫఇన్న - లాహూజహన్నతు - లా - యమూత్తు - ఫీహా - వలా యహ్యా - 75. వ మన్ - యాతిహీ - మూమినన్ - ఖద్ - అమి - లస - సాలిహాతి - ఫ - ఉలాయిక - లహు - ముద్ - దర - జాతుల్ - ఉలా -76. జన్నాతు - అద్ నిన్ - తజ్రీమిన్ - తహ్ తిహల్ - అన్హారు - ఖాలిదీన - ఫీహా - వ - జాలిక - జజఉ - మన్ - తజక్కా -

అ॥ ఎవరు పాపియై తన ప్రభువునొద్దకు వచ్చునో వానికి నరకమున్నది. అందు వాడు చావడు బ్రతుకడు (75) మరెవరు సత్కార్యములు చేసి వత్తురో వారికి గొప్ప దర్జాలున్నవి. (76) వారికి చిరకాలముండు స్వర్గవనము లున్నవి. అందు కాలువలు ప్రవహించును. అందు వారు చిరకాలముందురు. మరియు ఎవడు పవిత్రుడో వానికి ఈ ఫలితమున్నది.

కాం - 3 - సూ॥ ఆలె ఇమ్రాన్ - 15 ఆ.

ఖుల్ - అవు - నబ్బి - ఉకుమ్ - బి - ఖైరిమ్ - మిన్ - జాలి - కుమ్ -
లిల్లజీ - నత్ - ఖౌ - ఇన్ద - రబ్బిహిమ్ - జిన్నా - తున్ - త్రజీ - మిన్
తహతి - హల్ - అన్ - హారు - ఖాలిదీన - ఫీహా - వఅజ్ - వాజుమ్ -
ముతహ్హ - హరతున్ - వరిజ్ - వానుమ్ - మినల్లాహి - వల్లాహు - బసీరుమ్ -
బిల్ - ఇబాద్.

అ. దానికంటె మేలైనది మీకు తెలుపుదునా ? ఓ ప్రవక్తా, పలుకుము. భక్తిపరులకు తమ ప్రభువుదగ్గర స్వర్గవనము లున్నవి. అందు కాలువలు ప్రవహించును. అందు వారు సదాయుందురు; మరియు పవిత్రస్త్రీలు గలరు. మరి దేవునికి ప్రీతి కలుగును.

కాం 4 - సూ॥ ఆలె ఇమ్రాన్ - 136. ఆ.

ఉలాయిక - జిజాఉహుమ్ - మగ్ ఫిరతుమ్ - మిర్ రబ్బిహిమ్ - వజిన్నాతున్ -
తజ్రీమిన్ - తహ్ - తిహల్ - అన్ హారు - ఖాలిదీన - ఫీహా - వ - నిఅ -
మ - అజ్రుల్ - ఆమిలీన్.

అ. వారికి ప్రభువు క్షమాపణ గలదు. కాలువలు ప్రవహించు స్వర్గవనములు గలవు. అందు వారు సదాయుందురు. మరియు సత్కార్యములు చేయువారికి అందు కలుగు ఫలితము చాలామంచిది.

కాం 10 - సూ॥ తౌ బా - 72 ఆ.

వఅ - దల్లా - హుల్ - మూమినీన - వల్ - మూమినాతి - జన్నాతిన్ -
తజ్రీ - మిన్ - తహ్తి - హల్ - అన్ హారు - ఖాలిదీన - ఫీహా - వ - మసా
కిన - తయ్యి - బతన్ - ఫీ - జన్నాతి - అద్ నిన్ - వ - రిజ్వా - నుమ్ -
మినల్లాహి - అక్బరు - జాలిక - హువల్ - ఫౌజుల్ - అజీమ్ -

అ. విశ్వసించిన పురుషులకు స్త్రీలకు కాలువలు ప్రవహించు స్వర్గవనములును అందు సదానివాసమును శాశ్వతముగ నుండి వనములలో పరిశుభ్రమములైన గృహములును గలవని దేవుడు వాగ్దానము చేసియున్నాడు. మరియు దేవుని ప్రీతి అన్నిటికంటెను చాలా గొప్పది. ఇదియే గొప్ప జయము.

బైబిలు:—పశ్చాత్తాపపడి మీ పాపములు తుడిచివేయబడు నిమిత్తమును మారుమనస్సునొంది తిరుగుడి. అపొ. కార్య - 3:28

మీరు మారుమనస్సుపొంది, పాపక్షమాపణ నిమిత్తము ప్రతివాడు, యేసుక్రీస్తునామమున బాప్తిస్మము పొందుడి; అప్పుడు మీరు పరిశుద్ధాత్మ అను వరమును పొందుదురు.

అ. కార్య - 2 : 38

మన పాపములను మనము ఒప్పుకొనినయెడల, ఆయన నమ్మదగినవాడును, నీతిమంతుడును గనుక ఆయన మన పాపములను క్షమించి సమస్త దుర్నీతినుండి మనలను పవిత్రులుగా జేయును.

యోహా - 1 : 9

మీరు విశ్వసించినవారై కృపచేత రక్షింపబడియున్నారు. ఇది మీవలన కలిగినదికాదు. దేవుని వరమే. ఎఫె. - 2 : 8

నా యొద్దకు వచ్చువాని నేనెంతమాత్రము బయటికి త్రోసి వేయను. యో హా. - 6 : 37

మీరు పరిశుద్ధులగుటయే దేవుని చిత్తము. 1 థెస్స - 4 : 3

అయినను ఇప్పుడు పాపమునుండి విమోచింపబడి దేవునికి దాసులైనందున పరిశుద్ధత కలుగుటయే మీకు ఫలము. దానిఅంతము నిత్యజీవనము. రోమా. - 6 : 22

అ - 18. శ్లో॥ 66 :—

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

తా. అన్ని ధర్మములు విడిచిపెట్టి నన్నే శరణు పొందుము. నేను నిన్ను సర్వపాపములనుండి మోక్షము యివ్వగలను. భయ పడకుము.

బైబిలు:—అన్నిటియందు ఎల్లప్పుడును, మీలో మీరు సర్వసమృద్ధి కలవారై ఉత్తమమైన ప్రతి కార్యము చేయుటకు దేవుడు మీ యెడల సమస్త విధములైన కృపను విస్తరింపజేయగలడు.

2 కొరింథ - 9 : 8

నా ప్రియసహోదరులారా! మీ ప్రయాసము ప్రభువునందు వ్యర్థముకాదని యెరిగి, స్థిరులును; కదలనివారును; ప్రభువు కార్యాభి వృద్ధియందు ఎప్పటికిని ఆసక్తులునై యుండుడి. కొరింథి - 15 : 58

ప్రశ్న: హిందువులలో అనేక మతములున్నవి. ఏమతమవలంబించ వలయును.

పార్వతీఉవాచ:—ఓ దేవా! నిత్యమై, నిరుపమానమై సర్వోత్కృష్ట మైన ఆనందమునకు మూలమేమి?

ఈశ్వరోవాచ:—విశ్వాసమే మూలము. మతముల యొక్కయు శాఖలయొక్కయు విశేషలక్షణములు ముఖ్యమైనవి కావు. ప్రతిమనుష్యుడు తనమతమునందు విధింపబడిన ధర్మములను భక్తి శ్రద్ధలతో జేసిన జాలును.

## ఈమాన్ కొబయాన్ (విశ్వాసముయొక్క కళలు)

సమస్తమైన వారలకు భగవంతునియందు అతని ఆజ్ఞలు పాటించుట విశ్వాసమనే వేళ్ళపై ఆధారపడియున్నవి. అందుచేత విశ్వాసము అంతఃశుద్ధిగానమ్మట చాలా ముఖ్యము. అవిశ్వాసులకు భగవంతుని స్థానమందుండుటకు ఆస్కారములేదు.

### ఈమాన్‌లానే కేలియే 2 షర్‌త్‌హై

1. పహిలీషర్‌త్ ఆ ఖిల్ హోనా = జ్ఞానవంతుడగుట
2. బాలిగ్ హో = మంచిపౌరుడగుట

### ఈమాన్ కే 2 ఫరజ్‌హై

1. పహిలే కలిమయే తయ్యబ్ = వేదవాక్యముల పఠన
2. ఫరజ్ వుస్‌కే మానేకూ దిల్ సే సచ్ జానా = భగవంతునిఆజ్ఞలను ఆత్మశుద్ధిగా నమ్మట.

### ఈమాన్‌కే 7 సిఫ్‌తా

1. అల్లాఃఫర్ ఈమాన్‌లానా = భగవంతునిదయయందు విశ్వాసముండుట
2. ఫిరిష్‌తోపర్ ఈమాన్‌లానా = దేవదూతలయందు ,,
3. పైగంబరోంపర్ ,, = ప్రవక్తలయందు ,,
4. ఖియామత్‌పర్ ,, = ప్రళయకాల తీర్పుదినమంద ,,
5. కితాబోపర్ ,, = వేదగ్రంథములయందు ,,
6. నేకీబదీపర్ ,, = భగవంతుడు మంచిచెడ్డల కనిపెట్టువాడని ,,
7. ఖియామత్ మే ముర్దే వుఠ్ నేపర్ ,, = ప్రళయకాలమందు మృతులు తిరిగి జీవించుటయందు ,,

## ఈమాన్ కే 7 షరత్ హై

1. అప్నే ఇఖ్తియార్ సే ఈమాన్ లానా = తన యిష్టముతో కూడిన ఆత్మశుద్ధిగా విశ్వాసముంచుట
2. జన్నత్ దోజఖ్ వగైరా గైబ్ కీ బాతోంపర్ ఈమాన్ లానా = స్వర్గ నరకలోకము లున్నవన్న మాట యందు విశ్వాసముంచుట
3. గైబ్ కీ ఖబర్ ఖుదాహీకు హై కర్కే ఈమాన్ లానా = దేవుడు సృష్టిస్థితి లయకారకుడని విశ్వాసముంచుట.
4. హలాల్ కూ హలాల్ జాన్నా = చేయదగినవియు, తినదగిన వాట్లను ఎరిగియుండుట
5. హరాంకు హరాం జాన్నా - చేయకూడనివియు, తినకూడనివియు ఎరిగియుండుట
6. ఖుదాకే అజాబ్ సే డర్తే రహెనా = దేవునియందు సర్వకాల సర్వావస్థలయందు భయభక్తులతో మెలగుట
7. ఖుదాకే రహమత్కే వుమ్మీద్ వార్ రహనా = భగవంతుని క్షేమ - ఆదరాభిమానము లందు విశ్వాసముంచుట

## ఈమాన్ కీ సలామత్ కే 4 షరత్ హై

1. ఈమాన్ ఆనే సే ఖుష్ రహనా = (దేవునియందు) విశ్వాసముకల్గి సంతోషముగా నుండుట.
2. ఈమాన్ జానేసే డర్తే రహనా = విశ్వాసముపోయిన భయముతో నుండుట.
3. ఈమాన్ జానేకే బాతోంసే దూర్ రహనా = అవిశ్వాసులయొక్క మాటల యందు దూరముగా నుండుట.
4. ముసల్మానోం పర్ మెహర్బాన్ రహనా = భక్తులయందు దయ గలిగి యుండుట.

## ఈమాన్ కే 7 అహకాంహై

1. ఈమాన్ దార్కా నాహఖ్ నామార్ డాల్నా = (దేవునియందు) విశ్వాసము గలిగిన భక్తులను శిక్షించుటకు హక్కు లేదు.
2. ఈమాన్ దార్కా నాహఖ్ ఖైద్ కర్నా = ఖైదుచేయుటకుకూడ హక్కు లేదు.
3. ఈమాన్ దార్కా మాల్ నాహఖ్, నాలేనా = వస్తువులనుకూడ తీసికొనకూడదు.
4. ఖిలా షెషరా ఇజానా దేనా = అపవాదులకు కష్టము కలిగించకుండుట.
5. గుమానె, బద్‌నా కర్నా = వాది అపవాదులయందు ఓర్పుగలిగి యుండుట.
6. అజాబె దోజఖ్ సే ఛూట్‌నా = నరకలోకమునకు దూరుడ నగుట తన విశ్వాసమని తలచుట.
7. జన్నత్మే జానేకే వుమ్మీద్ రఖ్‌నా = తనకు స్వర్గలోకము లభించునని విశ్వాసముతో యుండుట.

## ఈ మాన్ కే 12 వాజిబ్ హీ

1. పహిలా బిద్ అత్ సే పర్ హేజ్ కర్నా = ప్రవక్తలు (అవతార పురుషులు) వాక్యములకు అపార్థములు కల్పించకుండుట.
2. నేకోంకీ సొహబత్మే రహనా = సత్పురుషులతో సహవాసము చేయుట.
3. బదోంసే దూర్ రహనా = దుర్మార్గులకు దూరముగ నుండుట.
4. అప్నే లోగోంకూ దీన్ కా యిలం సిఖానా = తన వారలందరికి మంచి పౌరులగుటకు జ్ఞానబోధ చేయుట.
5. దోస్తోం సే మిలాప్ రఖ్ నా = బంధువులతో మిత్రత్వముగా నుండుట.
6. ముసల్మాన్ లడ్తే హోంతో మిలాదేనా = భక్తులు జగడమాడుచున్న మిత్రత్వము చేయుట.
7. గరీబ్ కీ మదద్ కర్నా = బీదలకు సహాయము చేయుట.
8. ప్యాసేకూ పానీ, పిలానా = దాహకుని దాహము తీర్చుట.
9. రాస్తేసే గలీజ్ కాటాదూర్ కర్నా = బాటయందలి చెడుపు, ముండ్లను తొలగించుట.
10. యతీం పర్ రహం కర్నా = యతీం (అనాథులయందు) క్షేమకలిగియుండుట.
11. బీమార్కా పూచ్నా = రోగుల యోగక్షేమము లారయుట.
12. ముర్దేకు నహలానా = మృతులను స్నానము చేయించుట.

## ఇస్ లాం కా బయాన్

1. కల్మయే షహాదత్ పఢ్నా = వేదవాక్యముల చదువుట
2. నమాజ్ పఢ్ నా = ప్రార్థన చేయుట
3. రంజాన్ కే రోజా రఖ్ నా = రంజాన్ నెలలో ఉపవాసములుండుట
4. మాల్ దార్ జకాత్ దేనా = ధనవంతులు ధర్మమును చేయుట
5. మాల్ దార్ హజ్ కర్నా = ,, యాత్రలు చేయుట

## ఇస్ లాంకే 7 వాజిబ్ హీ

1. వితర్కా నమాజ్ పఢ్నా = వితర్కా ప్రార్థన చేయుట
2. ఫిత్రా దేనా = రంజాన్ నెలలో స్వయంపాకమునకు యివ్వనిర్ణయమైన ఫిత్రా పూర్తిగా ఒక్కరికే యిచ్చుట
3. ఖుర్ బానీ దేనా = యజ్ఞము చేయుట
4. మక్కేకు జాకర్ వుంరా బజాలానా = మక్కాకు యాత్రవెళ్ళి ఉమ్రా చేయుట
5. మాబాప్ కీ, తాబేదారీ కర్నా = తల్లిదండ్రుల సేవ చేయుట
6. ఔరత్ మరద్ కీ తాబేదారీ కర్నా = భార్య భర్తను సేవించుట
7. ఘర్కా ఖరచ్ దేనా = గృహస్థాశ్రమము నిర్వర్తించుటకైన ఖర్చులుచేయుట

---

# సర్వమత సార సంగ్రహము

## మూడవ భాగము

## కర్మకాండలు

మానవులు ప్రతిదినము నాచరించవలసిన కృత్యములను నిత్య కర్మలనియు, అపుడపుడు నిర్వర్తింపవలసిన కర్మలను నైమిత్తిక కర్మలనియు అనెదరు.

1. ఈ కర్మవిధులు కొన్ని మన ఆరోగ్యమునకు సంబంధించి నవిగా యున్నవి. ఆరోగ్యము భౌతికవిషయము కాన మతములోనిది కాదని తలపరాదు. ఏలన ధర్మమును సాధించుటకు శరీరమే మొదటి సాధనము. శరీరము సుస్థితిలో నుంచుటకు వైద్యశాస్త్రము చాలదా యనిన, ధర్మశాస్త్రములో చెప్పబడిన ఆరోగ్య విధులన్నియు శరీరమును మంచిస్థితిలో నుంచుటకుతోడు మనలో సాత్వికగుణమును వృద్ధినొందించును.

2. మనమహర్షులు చేసిన స్నాన, పాన, భోజనాది నియమములు మన స్థూలదృష్టికి సరిగా నర్థముకాకపోయినను మతగ్రంథములలో విధింపబడిన యాచారములు విడువదగినవికావు.

3. నిత్య నైమిత్తిక కర్మలలో వాడబడు మంత్రములు చాలా శక్తిగల వగుటచే వానివలన విశేషమైన ఫలము గల్గును. (సర్పాది విషములకు, కొన్ని శరీరబాధలకు వేయబడు మంత్రములు అద్భుతముగా పనిచేయుట మనము అందరము చూచుచున్నాము.)

4. కర్మకాండలలోని క్రియాకలాపముకూడా ముఖ్యమైనదే. తంత్రగ్రంథములలో చెప్పబడిన ముద్రలు, యంత్రములు మున్నగు వానికెట్టి శక్తిగలదో, ఇంచుమించుగా నట్టిశక్తియే యీ కర్మకలాపమునకు గలదు.

నిత్య నైమిత్తిక కర్మల నాచరించుటచే, నిదివరలో సంపాదింప బడిన పాపము క్రమ క్రమముగా నశించి, చిత్తశుద్ధిని గల్గించును. చిత్తశుద్ధి జ్ఞానమున కత్యవసరము. కావున జ్ఞానమార్గములోనికి పోదలచినవాడు ముందుగా కర్మ చేయవలయును.

సూచన:—నిత్యనైమిత్తికకర్మలయందును, కూర్చున్నప్పుడు, భుజించునప్పుడు, పరుండునప్పుడు, లేచునప్పుడు, వెళ్లునప్పుడు, జయము కల్గుటకు - సుశ్శకునములకు, దేవాలయము దర్శించునప్పుడు - రాజదర్శనమునందు - దైవదర్శనమందు - కష్ట సుఖములయందు - శుభాశుభ కార్యములందు మొదలగువా ట్లన్నిటియందు ప్రార్థనాదికములు, మంత్రతంత్రములు పఠించుట - దైవమును స్తుతించుట మొదలగు విషయము లన్నిటియందు ఒక్కొక్క విషయమునకు ఒక్కొక్క మంత్రము లేక ప్రార్థన ఏర్పాటై హిందూ మహమ్మదీయ క్రైస్తవమతస్థు లాచరించుచున్నారు. అట్టివన్నియు పవిత్రవేదములందున్నవనియు ఘంటా పథముగ చెప్పవచ్చును గనుక పెట్టి విషయము ఆ యా మతగురువులద్వారా గ్రహింపుడు. అంతా సర్వమయముగా గోచరించును.

## హిందువు లాచరించు కర్మకాండలు

1. గర్భాదానము:—దంపతులు సంతానము కనగోరి, గర్భశుద్ధికొరకై, వంశాభివర్ధకుడైన సత్పుత్రుడు గర్భమందు ప్రవేశించుట కొరకై దేవతలను ప్రార్థించురూపమున చేసికొను సంస్కారమునకు గర్భాదానమని పేరు. కాబట్టి యిది పుట్టబోవువాని నిమిత్తమై చేయబడు సంస్కారము.

2. పుంసవనము:—గర్భోత్పత్తియైన పిమ్మట గర్భస్థశిశువు పురుషుడగుటకై చేయబడు సంస్కారమునకు పుంసవన మనిపేరు.

3. సీమంతోన్నయనము:— గర్భముయొక్క నాల్గవమాసమందు మాతకు పాపిటదిద్ది కేశమున పుష్పములిడి చేయబడు సంస్కారమునకు సీమంతోన్నయన మనిపేరు. దీనివలన శిశువునకు దృఢత్వమేర్పడును. ఇది మొదలు తల్లి సుఖమైన కుమారుడు జనించుటకై నిత్యసుఖజీవనము గడుపుచుండును. ఈ సంస్కారము ప్రథమగర్భమునకు మాత్రమే.

4. జాతకర్మ:— ఇది పుత్రుడు పుట్టగానే తండ్రిచేత చేయబడు సంస్కారము. దీనివలన పుత్రుడు దీర్ఘాయుష్మంతుడగును.

5. నామకరణము:—ఇది పుత్రుడు జనించిన పదునొకండవ దినమున జరుపబడును. ఈ సమయమున పేరుపెట్టుదురు. పురుషులకు సరిసంఖ్య గల యక్షరములతో కూడిన పేర్లును, స్త్రీలకు బేసిసంఖ్య గల యక్షరములతో కూడిన పేర్లను బెట్టవలయును. నాలుగువర్ణములవారికిని, నాయాగుణకర్మలకు జగినపేర్లుండ వలయును. ఆ పేర్లకు చివర వర్ణద్యోతకములైన పదములుండవలెను. అనగా పేరునకు పిమ్మట బ్రాహ్మణునకు శర్మయనియు, క్షత్రియునకు వర్మయనియు, వైశ్యునకు గుప్తయనియు, శూద్రునకు దాస యనియు నుండవలెను.

6. అన్నప్రాశనము:—సంవత్సరములోపున పురుషునకు సరి మాసములయందును, స్త్రీలకు బేసిమాసములయందును అన్నమును ముట్టించెదరు.

7. చౌలము లేక కేశఖండన:— కులాచారమునుబట్టి యిది మొదటి సంవత్సరమున గాని, మూడవసంవత్సరమున గాని, ఐదవ సంవత్సరమున గాని చేయుదురు.

8. అక్షరాభ్యాసము:—బాలురకు 5 వ సంవత్సరమున ఓంకారముతో అక్షరాభ్యాసము చేయవలెను. బ్రాహ్మణునకు ఉపనయనము జరిగినగాని బ్రహ్మవిద్యనేర్పుటకు సావకాశము లేదు.

9. ఉపనయనము:—ఇది స్త్రీలకు, శూద్రులకు లేదు. బ్రాహ్మణులకు గర్భసంవత్సరము మొదలైననూ, జననసంవత్సరము మొదలైన ఎనిమిద సంవత్సరమందును, క్షత్రియులకు పదునొకండవ సంవత్సరమందును, వైశ్యులకు పన్నెండవ సంవత్సరమందును ఉపనయనము చేయవలయును.

(10) సమావర్తములేక స్నాతకవ్రతము:—గురుకులవాసమున విద్యాభ్యాసము ముగించుకొని బ్రహ్మచారి యింటికి తిరిగి వచ్చుట సమావర్తమనిపేరు. ఇంటికివచ్చి అభ్యంగనస్నాన పూర్వకముగ

బ్రహ్మచర్యాశ్రమమును ముగించుటకు గావింపబడు సంస్కారమునకు స్నాతకమని పేరు. ఇప్పటికి బ్రహ్మచారికిగల నిషేధములుతొలగును.

బ్రహ్మచారికిగల నియమములు:— విద్యాభ్యాసము గురువు నొద్ద జేయుచు భిక్షచేసి యాహారమును తెచ్చుకొని గురువునకుచూపి యాతని యనుజ్ఞచొప్పున భక్షింపవలయును. ఉప్పు, పులుపు, కారము మొదలగు రజోగుణ ప్రకోప పదార్థములను బ్రహ్మచారి భుజింప రాదు. మత్తుపదార్థములను, మాంసమును భుజింపరాదు. సుగంధ వస్తువులను ధరింపరాదు. పగలు నిద్రపోరాదు. శృంగార విషయ ములు పనికిరావు. తైలాభ్యంగనము చేయరాదు. శకటాది వాహన ముల నధిష్ఠింపరాదు. చెప్పులు తొడుగరాదు. కామమును దరి జేరనీయరాదు. క్రోధమునకు దూరుడుగా నుండవలెను. లోభమును పొందరాదు. వివేకమును వీడరాదు. వదరుబోతుగా నుండరాదు. ఉష్ణోదకస్నానము చేయరాదు. దేనినిజూచియు సంతోషముచే పొంగరాదు. నృత్యగానములందు సక్తుడుగారాదు. పరుల దోషముల నెంచరాదు. కటికనేలను శయనింపవలెను. స్త్రీల ముఖమును చూడ రాదు. వారితో సంభాషించరాదు. తుదకు అద్దములో తన ముఖమును చూచుట కూడ నిషేధింపబడినది. ఈ నియమములన్నియు స్నాతక వ్రతముతో తొలగును.

(11) వివాహము:— బ్రహ్మచర్య వ్రతమును ముగించిన యువకుడు తనవర్ణమునకు చెందినట్టియు, తనగోత్ర ప్రవరలకు చెంద నట్టియు, ఏడు తరముల పితృబంధువులలో గాని, యైదుతరముల మాతృబంధువులలోగాని చేరనట్టియు, మంచిలక్షణములు గల్గినట్టియు, నదివరలో వివాహితగాని, వాగ్దత్తకాని కానట్టియు, రజస్వల కానట్టియు కన్యను వివాహమాడవలెను.

## గృహస్థాశ్రమ ప్రయోజనములు రెండు

(1) సామాన్యమానవులకుసహజముగానుండు సంసారవాంఛకు చక్కని మార్గమునేర్పరచి, దానిని విశృంఖలము గాపోనీయకుండ,

నియమబద్ధముగానడపి, యావాంఛకే పవిత్రాపరిమళమును గల్గించి మానవుని క్రమక్రమముగా పరిపక్వస్థితిలోనికి దింపుటకు గృహస్థాశ్రమ ముద్దేశింపబడినది. యావజ్జీవ బ్రహ్మచర్యము సర్వోత్తమమైన దనుటకు సందియములేదు. శంకరాచార్య, భీష్ముడు మొదలైనవారు గృహస్థాశ్రమమును ప్రవేశింపకయే తరించిరి. మానవుడు యావజ్జీవము అస్ఖలిత బ్రహ్మచారియై బ్రహ్మచర్యాశ్రమములోగాని సన్న్యాసాశ్రమములోగాని యుండగలడా లేడాయను విషయమును బాగుగా ఆలోచించవలెను. ఉండలేనిచో వివాహమాడకున్నయెడల వాడు సర్వవిధముల పతితుడగును. కావున సామాన్యమానవుడు క్రమముగా పరిపక్వస్థితినొంది తరించుటకు వివాహమొక పవిత్రమైన సాధనము.

(2) వివాహముయొక్క రెండవ ప్రయోజనము:—మానవుడు పుట్టుకతోడనే మూడు ఋణములతో పుట్టుచున్నాడు. (ప్రమాణము వేదము) అందొకటి ఋషిఋణము, రెండవది దేవఋణము, మూడవది పితౄణము. వేదములు చదువుటవలన ఋషిఋణము తీరును. ఋషులు మనకు వేదము నందజేసినారు. వారిచ్చినది మనముపయోగించుకొనుటయే మనము వారిఋణమును దీర్చుట. యజ్ఞములను చేయుటవలన దేవతల ఋణముదీరును. ఏలనన, దేవతలు మనకు జీవించుటకు తగిన వస్తు సమూహము నిచ్చుచున్నారు. అందులకు వారికి కృతజ్ఞత తెలియజేయుటకై వారు మనకు యిచ్చిన ద్రవ్యములలో నొకింతభాగమును అగ్నిద్వారమున మనము వారి కర్పించుట మనవిధి. అందులకు వారు సంతృప్తులై మనజీవితమునకు సాయపడుచునుందురు. పితౄణము పుత్రసంతానము గలుగుట వలన దీరును. ఈ శరీరమును మనకు పితరులిచ్చిరి. వారెట్లు మనకు జన్మనొసగిరో అట్లేమనమును పుత్రసంతానమును కని వారి వంశమును నిలబెట్టవలయునని వారు కోరుచుందురు. కావున పుత్రసంతానము కనుటవలన పితరులఋణము తీరును. ఈ మూడు ఋణములలో మొదటి ఋణము బ్రహ్మచర్యాశ్రమములోనే చాలాభాగము తీరిననూ గృహస్థాశ్రమములో నిత్యవేదాధ్యయనము వలననేగాని అది పూర్తిగా తీరదు. రెండవదియగు దేవఋణముతీరుటకు వివాహమత్యవసరము. భార్యలేని

వారికి యజ్ఞముచేయు నధికారములేదు. (ప్రమాణము వేదము) కావున దేవఋణము తీర్చుటకు మానవుడు వివాహమాడవలెను. మూడవది యగు పితౄణము పుత్రసంతానమున తీరును. స్వభార్యయందు గలిగిన సంతానమే మానవుని పవిత్రుని సేయగలదు. అన్యస్త్రీ యందు గలిగిన సంతానము ప్రయోజనకారి కాదు. అందుచే మానవుడు యీ ఋణములు తీర్చుటకు వివాహమాడవలెను.

12. వానప్రస్థము:—మానవుడు సుమారు 25 సంవత్సరములు గృహస్థాశ్రమములో గడపి పిదప వానప్రస్థాశ్రమములో ప్రవేశింపవలయును. అప్పుడు సంసారబంధమును వదలించుకొని పరమార్థ సాధన ప్రయత్నములో తీవ్రముగా దిగవలయును. ఇంద్రియ నిగ్రహము గలిగియుండవలెను. భార్య తనతో నున్న యెడల బ్రహ్మచర్యము నవలంబింపవలెను. లేదా భార్యను కుమారునిచెంత విడువవచ్చును. అతడు కేవలము పరమార్థ చింతగలవాడై తీవ్రతపస్సులలోను చాంద్రాయణాది వ్రతములలోను శరీరమును శుష్కింపజేసి చివరకు మోక్షప్రాప్తి నొందవలెను.

13. మరణము:—జీవుడు యీ శరీరమును విడిచి తనయొక్క పూర్వసుకృత దుష్కృత కర్మల ననుసరించి యుత్తమలోక ప్రాప్తినిగాని, అధోలోక ప్రాప్తినిగాని బొందును. ఆ మృతకళేబరమునకు పుత్రుడు సమంత్రకముగ ప్రాయశ్చిత్తాది కర్మకాండల జరిపించి దహనము జేయును. పిమ్మట చనిపోయినవారి నుద్దేశించి ఒక సంవత్సరము వరకు ప్రతినెల ఆ పోయినతిథి యందు బ్రాహ్మణోత్తములను సమంత్రకముగ నర్చించి వారికి తృప్తికరముగ భోజనంబులు పెట్టి వారి ఆశీర్వాదమును బొందుదురు. అటుపైనుంచి సంవత్సరమునకు ఒకసారి ఆ చనిపోయిన మాసములో ఆతిథిరోజున పితృదేవతలకు ఆబ్దీకములు పెట్టుచుందురు. ఈ ప్రకారముగా జీవుడు అనేక శరీరములతో పుట్టుచు గిట్టుచుండును. దీనికి అది అంతములేదు. కావున ప్రతిజీవియు యుత్తమమైన మానవజన్మయందు వేదవిహితమైన కర్మలజేయుచు పరమేశ్వరుని ధ్యానించుచు మానవసేవజేయుచు జన్మరాహిత్యమైన

మోక్షప్రాప్తి నొందుటకు అనుక్షణము ప్రయత్నించి సఫలత నొంద వలెను.

## 2. ముస్లిం లాచరించు కర్మకాండలు

పలహాః దీనోదునియా = ప్రపంచములోని ముస్లిం సత్ప్రవర్తనలు పేజి 7:—

1. ఫయిదాయిన్ (పుట్టుక)
2. హాఖీఖా (కేశఖండన)
3. ఖత్నా (వడుగులు)
4. హుఖూఖ్ (విద్య - మొదలగు సత్ప్రవర్తనలు)
6. నిఖా (వివాహము)
7. ఔరత్ - మరద్ (భార్యా భర్తల నడవడులు)

### 1. ఫయిదాయిన్ (పుట్టుక)

శిశువు జన్మించిన వెంటనే స్నానముచేయించి పరిశుద్ధమైన తెల్లనివస్త్రములో పరుండబెట్టి కుడిచెవిలో (అజా), యెడమచెవిలో అఖామత్ చెప్పుదురు. అనగా భగవంతునిప్రార్థన నామధేయము ముందుగానే శిశువుచెవినివేయుదురు; అజా అనగా=భగవంతుని పవిత్ర ప్రార్థన పిలుపు. అఖామత్ అనగా ప్రార్థనకుముందు నిలువబడి చెప్పు ప్రార్థనపిలుపు. అందువలన బాలగ్రహాది దోషములు (వెన్నెమ్మ) శిశువులను అంటవు.

### 2. హాఖీఖా (కేశఖండన)

7-వ రోజునగాని-నెలలోగాని, సం॥లో గాని, 2, 3 సం॥లలో శిశువుయొక్క పుట్టివెండ్రుకలను తీయించుదురు. సప్తసంఖ్యయైన 7-వ రోజు దాటకుండా ఆయా నెల, సం॥లలో తీయుదురు.

### 3. పిల్లల నామకరణము

శిశువులయొక్క నామధేయములు దేవుని పవిత్రనామములు పెట్టుట విధియైయున్నది.

## 4. అన్నప్రాశన (నమక్ షషీ)

7, 8, 9 నెలలలో శిశువులకు మధురమైన పదార్థములతో కూడిన అన్నప్రాశనచేయుట ముఖ్యము.

## 5. బిస్మిల్లాఖాని (అక్షరాభ్యాసన)

దేవుని పవిత్రనామములతో అక్షరాభ్యాసము చేయుట - పఠింపజేయుట.

[ఓం నమః శివాయః సిద్ధంనమః అని హిందువులు చేయునట్లు]

లా - యిలాహ - యిల్లల్లాహ - మహమ్మదుర్ - రసూలల్లాః

## 6. ఖత్నా (వడుగులు)

మగశిశువులకు 10 సం॥ల లోపుననే వడుగుచేయుట సున్నత్ అయియున్నది.

## 7. నమాజ్‌ఫడానా (ప్రార్థన నేర్పుట)

తదుపరి ప్రార్థనాది (సంధ్యావందనము) మొదలగు వేదపఠన - నమాజ్ చేయించుట - తాను ఆచరించవలసిన వేదధర్మసూత్రములు ఇహ - పరలోక పరోపకారాది సద్గుణములు - నిర్బంధముతో నేర్పి శిశువులను, భావిపౌరులుగా తయారుచేయుట ముఖ్యము.

## 8. పెండ్లి (నిఖా)

వివాహములు పెద్దలఎదుట ఖాజీసాహేబ్‌గారిచేత జరిపించబడును. దంపతులిరువురు భగవంతుని ఆజ్ఞలు గృహస్థాశ్రమ ధర్మములు ఆచరించుచూ; శ్రీ మహమ్మద్‌వారి ఏర్పాటు ప్రకారముగా వేదప్రమాణముతో అంగీకరించుచూ వివాహములు దంపతులు యిష్టములపైననే జరుపబడుచున్నవి.

## 9. అంత్యదశ

మానవుని అంత్యకాలమందున చదివే వేదమంత్రములు శవము దగ్గర పఠించుదురు. శవమునకు స్నానాది క్రియలు పవిత్రులచేత జరుపబడును. తదుపరి సుగంధద్రవ్యములచే ఏర్పాటు కాబడిన తెల్లని వస్త్రములు ధరింపజేయుదురు. తదుపరి జనాజేకా నమాజ్ చదువబడును. అతని గుణగణ దోషములు భగవంతుడు నివారించవలసినదనియు అతని ఆత్మకు శాంతికలిగించవలసినదిగా ప్రార్థన చేయుదురు.

తదుపరి 1 దోసెడుమట్టితీసి 1 వ మినహా - ఖలఖ - నాకున్ అని మొదటిసారియు 2 వ పీహా - నోయ్యి - దొకుమ్ - అని రెండవ సారియు 3 వ మినహా - నుఖ్ - రిజో - కుమ్‌తారతన్ - ఉఖ్ - రా అని 3 సారియు జపించి మట్టి యిచ్చుదురు. అనగా శ్రీ దేవుడు నిన్ను మట్టితో సృష్టించెను. మట్టితోనేపుట్టి మట్టిలోనే కలిసిపోవుచున్నావు తిరిగి పునరుద్ధాన దినమందు మట్టినుండియే లేవవలసియున్నదనియు పఠించుచూ సమాధి చేయుచున్నారు.

## 10. సమాధి (ఖబర్)

ప్రతిజీవియు పుట్టుట గిట్టుటకొరకే. జీవుల (రూహ్) ను దేవ దూతలు (యముడులాగ శరీరావయవములుగల) తీసుకొనిపోబడు సందర్భమున ఆకాశములోని దేవదూతలచేత పరీక్షింపబడుదురు. సన్మార్గుడైన అతనిని భగవంతుని సన్నిధానము చేరుటకు ఆస్కారముండును. లేనియెడల అక్కడనుండియే క్రిందకు త్రోయబడి తిరిగి సమాధిలోనికి త్రోయబడుదురు.

అట్లు చేర్చబడిన సన్మార్గులును, దుర్మార్గులును తిరిగి కట్టిని (అనగా సమాధియందు) జీవింపజేసి లేపి ఆ దేవదూతలు అతనిని పరీక్షించుదురు. సన్మార్గులకు స్వర్గసుఖములును (జన్నత్) దుర్మార్గులకు నరకబాధలు (దోజఖ్) అక్కడనుండియే కష్టసుఖములు చిహ్నములు కనిపింపజేయబడును. ఆ దేవదూతలు పరీక్షల అనంత

రము సన్మార్గులను ఇల్లీన్‌లోను; దుర్మార్గులను సిజ్జీన్‌లోను చేర్చబడిన వారలగుదురు.

## 11. అంత్యక్రియలు

చచ్చినవారి ఆత్మశాంతులకై పుత్రులు మొదలగువారలు 3 వ రోజున (జారతు) చిన్నదినము, 10 రోజున, 21 రోజున, నెల లోపున, 40 రోజున, 3 మాసమునకు, 6 మాసములకు, 1 సంవత్సరము లోపున, వార, పక్ష, నెల, అయనము, సంవత్సరమువారీగా వారలకు ఆబ్దీకములు (దినములు) చేయుదురు.

## 12. ముగింపు

(1) పుట్టుక (2) కేశఖండన (3) నామకరణ (4) అన్నప్రాశన (5) అక్షరాభ్యాసన (6) వడుగులు (7) ప్రార్థన (8) పెండ్లి (9) అంత్యదశ (10) అంత్యక్రియలు మొదలగు సందర్భములలోను వారి వారి శక్తి సామర్థ్యముల ననుసరించి వేడుకలు జరుపుకొనుట - అన్నదానము - అన్నశాంతి - వస్త్రదానము - ధర్మములు చేయుట మొదలగు దశవిధ దానములు జరుపుకొనుచు బీద సాదలను ఆదరించుచూ, గృహస్థాశ్రమధర్మములు నిర్వర్తించుకొనుచున్నారు.

N. B:—దీని వివరములు అన్నియు పెద్ద పురాణగ్రంథములలో చూడుడు.

స్వర్గస్థులైనవారి ఆత్మశాంతికై ఖురాన్ గ్రంథములోని స్తోత్రసూరాలు - ఖురాన్ గ్రంథము చదువుట - (40 రోజులు) వారి పేర్లపై ఆబ్దీకములు చేయుదురు. ఆ కాలములో మనుష్యయజము చేయుదురు. అనగా అన్నశాంతి చేయుదురు. వారిపేర్లపై దర్జయి ఫాతిహా యిచ్చుదురు.

# 3. క్రైస్తవు లాచరించు కర్మకాండ

మానవులు సంతానము కలిగియుండుట దేవునియొక్క దానమనియు, బహుమానమనియు నమ్ముదురు. ప్రభువుయొక్క

బిడ్డలను (సంతానమును) పోషించుట తల్లిదండ్రుల విధియని గ్రహించి దైవభీతితోను, ప్రేమతోను పెంచి జ్ఞానాభివృద్ధి కలుగజేసి మంచి పౌరులుగా తయారుచేయుటకు ప్రయత్నింతురు.

## మొదటి కర్మకాండ (నామకరణము)

బిడ్డ పుట్టినవెంటనే దేవుని తల్లిదండ్రులు స్తోత్రముచేసి ప్రార్థింతురు. పురిటిస్నానమైనతరువాత దేవాలయమునకు తీసుకొని వెళ్లి ప్రవక్తలయొక్కయు, భక్తులయొక్కయు పేర్లతో నామకరణము చేయింతురు.

## రెండవ కర్మకాండ (బాప్తిస్మము)

నామకరణము తదుపరి తల్లిదండ్రులు తమ బిడ్డకు ఆ దేవాలయములోనే గురువుచేత క్రీస్తునామములోనికి బాప్తిస్మము యిప్పింతురు.

## మూడవ కర్మకాండ (నిర్ధారణ)

తల్లిదండ్రులచేత శిశువుగానున్నప్పుడు బాప్తిస్మముపొంది యుక్తవయస్సువచ్చినపుడు (సుమారు 15 సం॥లలోపు) తాను తల్లిదండ్రులద్వారా పొందిన బాప్తిస్మమును తాను స్వాయముగ ఆచరించుతాననియు త్రికరణశుద్ధిగా నమ్మి బాప్తిస్మమును స్థిరపర్చుకొనును.

## నాల్గవ కర్మకాండ (వివాహము)

యుక్తవయస్సు వచ్చినతరువాత వివాహము చేయుదురు. దీనిని దేవుని పవిత్రకార్యమని తలంతురు. ఎందుకనగా దేవుడు పరిశుద్ధుడు. ఆయనకార్యములు పవిత్రమైనవి. సృష్టినిర్మాణములో ఆదాము, హవ్వాలను సృష్టించి వారల నాశీర్వదించెను. ఎట్లనగా మీరు ఫలించి అభివృద్ధిపొంది విస్తరించి భూమిని నిండించి దానిని లోబర్చుకొనుడి. సముద్రపు చేపలను, ఆకాశపక్షులను, భూమిపై ప్రాకు ప్రతి జీవిని ఏలుడని చెప్పెను. ఇదిగో భూమిమీదనున్న

విత్తనిములిచ్చు ప్రతి చెట్టు, విత్తనములిచ్చు ప్రతి వృక్షములను మీ కాహారముగా యిచ్చుచున్నాను. అవి మీ కాహారమగునని శలవిచ్చెను. భూమిమీదనుండు జంతువులన్నిటికిని, ఆకాశపు పక్షు లన్నిటికిని, భూమిమీదప్రాకు సమస్త జీవులకు పచ్చని చెట్లన్నియు ఆహారమగునని చెప్పెను. అందుచేత దేవుని కార్యముగా నమ్ముచున్నారు. పురుషునికి 18 సం॥, స్త్రీకి 16 సం॥ లుండి భార్యా భర్తల యిష్టమైతేనే యీ వివాహకాండ మతగురువులు దేవుని నామమున వారల నైక్యపరచి వివాహపు కర్మకాండ స్త్రీ, పురుషుల పెద్ద చిన్నల ఎదుట ప్రమాణములు స్వీకరింపజేయించి వివాహములు జరుపుదురు. భార్యాభర్తలు దేవుని ప్రార్థించి దేవుని ఆజ్ఞలు పాలింతు మనియు, గృహస్థాశ్రమధర్మములునిర్వర్తించుదుమనియు ప్రమాణము చేయుదురు. ఆ దంపతులకొరకు అందరు వివాహపు ప్రార్థనక్రియ లాచరించి అందుకు నియమింపబడిన రిజిష్టరులో సాక్షుల గురువుల, భార్యాభర్తల పెద్దల సంతకములు నమోదుచేయించుకొందురు.

## ఐదవ కర్మకాండ

మరణమునుకూడ పరిశుద్ధకార్యముగా ఎంచుకొందురు. నిరీక్షణలేని యితరులవలె దుఃఖింపరు. మృతునికి స్నానాదులు జరిపి సుగంధద్రవ్యములచే బట్ట కప్పి, పెట్టె తయారుచేయించి దానిలో నుంచి కులస్థులందరు సమాధికి తీసుకొనివెళ్లి అంత్య ప్రార్థనలు జరిపి సమాధిచేయుదురు. తమ శక్త్యానుసారముగ అతనికి ఆత్మశాంతిక్రియలు జరుపుదురు. ఆ మృతుడు తిరిగి పునరుద్ధారణ దినమునందు సజీవుడై ప్రభువు ఎదుట తీర్పులకు నిలువబడి స్వర్గ - నరకలోకములను పొందును. అంత్యము దేవునిచేరుటయే. అందుచేత మరణము చాలా పరిశుద్ధకార్యము గనుకనే మంగళము (శుభక్రియ) గనే జరుపుదురు.

# హిందువు లాచరించు పండుగలు

## 1. సంవత్సరాది - చైత్రశుద్ధ పాడ్యమి

ఈ దినమందు బ్రహ్మదేవుడు ప్రథమ సృష్టిని ప్రారంభించి యుండెను. కనుక యీ శుభదినమునకు సంవత్సరాదియని పేరు. ఈ దినమున ప్రారంభించిన సృష్టికార్యము నేటివరకును అవిచ్ఛిన్నముగ ఉత్తరోత్తరాభివృద్ధిగా సాగుచున్నది. ఆ కారణమువల్లనే ఈ దినమందు క్రొత్తగా లెక్కలు పెట్టుటయు, క్రొత్తవ్యాపారములు ప్రారంభించుటయు పరంపరాచారముగానున్నది. ఈ దినమున ప్రాతఃకాలమున అభ్యంగనస్నానముజేసి, నూతనవస్త్రములను ధరించి గణేశపూజ, నవగ్రహపూజ, బ్రహ్మాదిదేవతాపూజలను జేసి మధురామ్లద్రవ్యములతో జేర్చిన వేపపూవులను పుచ్చుకొనవలయును. మరియు క్రొత్త పంచాంగమును శ్రవణము జేయవలెను. ఇట్లు ఆచరించినవారు సర్వాభీష్టసిద్ధి నొంది రోగబాధలు లేక ఆరోగ్యవంతులై యుందురు. వసంతనవరాత్రులు యీ దినమునుండి ప్రారంభించి చేయుదురు.

## 2. శ్రీరామనవమి : చైత్రశుద్ధ నవమి

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన శ్రీ మహావిష్ణువు త్రేతాయుగమందు దుష్టశిక్షణార్థము, శిష్టరక్షణార్థము శ్రీరామచంద్రమూర్తియై మానవస్వరూపమున దశరథమహారాజునకు జన్మించిన శుభదివసము. ఈ దినమందు శ్రీరామచంద్రమూర్తియొక్క ప్రతిమను స్థాపించి పురుషసూక్తముచేత షోడశోపచార పూజలను జేసి లోకకల్యాణార్థమై సీతారాములకు కల్యాణము జేయుదురు. మేళములు, తాళములు, నృత్యములు, గానములు హరికథలు, నాటకములు మొదలైన భక్తిరసప్రధానమైన శ్రీరామచంద్రునిగాథలతో భక్తులందరు తనివిదీర తారకనామమంత్ర మాధుర్యమును గ్రోలి తరించెదరు.

### 3. అక్షతదియ : వైశాఖ శుద్ధ తదియ

1. ఈ దినమందు తీర్థస్నానముచేసి నువ్వులతో పితృతర్పణమును, దానధర్మములను, విష్ణుపూజయును చేసినయెడల అనంతపుణ్యము కలుగును.

2. ఈ దినమందు సింహాచల నృసింహస్వామికి చందనయాత్ర జరుగును. క్రోధముచే భయంకరముగనుండు శ్రీ నృసింహస్వామికి సంవత్సరముపొడుగున చందనముపూయుదురు. ఆ చందనమును యీ శుభదివసమందు ఒలిచి ఆవుపాలతో స్నానమును జేయించి తిరిగి చందనమును పూయుదురు. భక్తులు అనేకులు యీ యుత్సవమును దిలకించి తరించెదరు.

### 4. శంకర జయంతి - వైశాఖ శుద్ధ పంచమి

భూలోకమందలి మానవులు పరమార్థతత్వమును తెలియలేక పామరులై యుండుట గాంచి వారికి పరమార్థతత్వమును బోధింప దక్షిణామూర్తియే శంకరాచార్యులుగ నవతరించి అష్టాదశపీఠములను స్థాపించి మానవులకు జ్ఞానోదయము గలిగించెను. ఈ శుభదినమున జగద్గురు శంకరాచార్యులను భక్తులు యథావిధిగా పూజించెదరు.

### 5. వరలక్ష్మీవ్రతము - శ్రావణ శుక్రవారము

ఈ మాసమున శుక్రవారమురోజున షోడశోపచారవిధిగా లక్ష్మీదేవిని పూజించెదరు. ముఖ్యముగ నూతనముగా వివాహమైన స్త్రీలు తప్పక పూజచేయుదురు. అట్టివారికి లక్ష్మీదేవియొక్క దయ గలిగి సుఖముగా నుందురు.

### 6. సిద్ధివినాయక వ్రతము - భాద్రపద శుద్ధ చవితి

ఈ దినమందు మానవులు గణపతిని పూజించి గణనాథునకు నానావిధ భక్ష్యములు, ఉండ్రాళ్ళు, పాయసము, పండ్లు, చెఱుకుగడలు మొదలైనవి నివేదించెదరు. ఈ గణపతిపూజచేసినవా రందరకు తమ తమ మనోరథములు నెరవేరి సౌఖ్యముగ నుందురు.

### 7. మహాలయపక్ష ప్రారంభము - భాద్రపద బహుళ పాడ్యమి

ఈ దినము అనగా పాడ్యమి మొదలు అమావాస్యవరకును పితృదేవతలు క్షుధార్తులై ప్రేతపురమును విడిచి మనుష్యలోకమునందు పుత్రాదులను ఆశ్రయించియుందురు. కాబట్టి పితృభక్తిగలవారందరు ఈ పక్షమందైనను లేక పితృమృతతిథియందైనను మహాలయ శ్రాద్ధమును జేయవలయును. అట్లుజేయనిచో పితృశాపము కలుగునని శాస్త్రము. ఈ పక్షమునందు జేయుటకు వీలులేనివారు పితృశ్రాద్ధము అమావాస్యయందైనను తప్పక చేయవలయును.

### 8. సరస్వతీపూజా : ఆశ్వయుజశుద్ధ సప్తమి

ఈ దినమున పుస్తకరూపిణియగు సరస్వతీదేవిని ఆవాహనజేసి షోడశోపచారములచే పూజించి ఆ సరస్వతీకటాక్షమునకు పాత్రులయ్యెదరు.

### 9. విజయదశమి : ఆశ్వయుజ శుద్ధ దశమి

ఈ దినమున శ్రీరామచంద్రమూర్తి రావణుని జయించుటకై శమీపూజనుజేసి జయమును పొందెను. కావున యీ దినమున శమీపూజ చేసినవారికి సర్వకార్యములు జయప్రదముగ నెరవేరును. మహిషాసురుడను రాక్షసుని యీ దినమందే జగజ్జననియైన పార్వతీదేవి చంపి విజయము పొందుటచే విజయదశమి అను సార్థకనామము వచ్చెను. దేవీపూజ చేయువారందరు శుద్ధపాడ్యమి లగాయితు నవరాత్రులు దేవిని ఆరాధించి ఆమెయొక్క దయకు పాత్రులయ్యెదరు.

### 10. వినాయకచవితితర్వాత ఋషిపంచమి భాద్రపదశుద్ధ పంచమి

స్త్రీలు తమకుండు స్వాభావసిద్ధమైన మైలదోషములు తెలిసికాని, తెలియకకాని గృహములో కలియుటవలన గల్గుదోషములకు పరిహారముగ స్త్రీలు ఋతువు ఆగిన పిదప తప్పక నీ వ్రతము నాచరించి పాపములనుండి ముక్తులగుదురు.

## 11. నరకచతుర్దశి : ఆశ్వయుజ బహుళచతుర్దశి

ఈ దినమున రాత్రి చంద్రోదయకాలమునందు తైలాభ్యంగ స్నానముజేసి తర్వాత, యమతర్పణమును జేసినవారికి యమలోక దర్శనము లేదనియు, చేయనివారికి సంవత్సరకృతధర్మము నశించుననియు శాస్త్రప్రమాణము.

## 12. దీపావళి అమావాస్య : ఆశ్వయుజబహుళ అమావాస్య

ఈ దినమునందు దీపములు పంక్తులుగా దీర్చిపెట్టెదరు. దీనికి దీపావళి యనిపేరు. నరకాసురుడను రాక్షసుడు చంపబడుటచే కలిగిన యానందమున టపాకాయలను కాల్చెదరు. పూర్వము బలిచక్రవర్తి దేవతలనందరిని జయించి కారాగృహములోనుంచి, లక్ష్మీదేవి యొకచో నిలకడగానుండక చంచలయై కొంతకాలమొకరిని మరికొంత కాల మింకొకరిని ఆశ్రయించుచున్నదని లక్ష్మీదేవిని బంధించి చెరసాలనుంచెను. అప్పుడు శ్రీమహావిష్ణువు ఈదినమందు లక్ష్మీదేవిని చెరనుండి విడిపించెను. అందువలన ఈదినమందు ప్రతివారు లక్ష్మీపూజ చేయుదురు. కాబట్టి వారివారి యింటినుండి అలక్ష్మీనివారణమునకై బూజునుతుడిచి శ్రీసూక్తపారాయణము యథాశక్తిగా జేసిన అలక్ష్మీ పరిహారమగును.

## 13. ఆకాశదీపప్రారంభః : కార్తీకశుద్ధపాడ్యమి

ఈ కార్తీకమాసమున ఉసిరికచెట్టుక్రింద శ్రీ మహావిష్ణువును పూజించి చిత్రాన్నాదులను నివేదించి భుజించినవారికి అశ్వమేధఫల ప్రాప్తికలుగును. మరియును ప్రతిదినము సాయంకాలమునందు యింటివాకిట పురుషప్రమాణ స్తంభముమీద తిలతైలదీపమును పెట్టినవారికి రూపసౌభాగ్యవృద్ధి కలుగును. ఈమాసమున ప్రతిదినము ప్రదోషకాలమందు శివార్చనముజేసి నక్తవ్రతము నాచరించినవారికి యిహపర సౌఖ్యములు కలుగును.

## 14. క్షీరాబ్ధిద్వాదశి : కార్తీకశుద్ధద్వాదశి

ఈ దినమున స్నానదానములనుజేసి శ్రీలక్ష్మీనారాయణులను పూజించిన మహాపుణ్యము కలుగును.

## 15. సుబ్రహ్మణ్యషష్ఠి : మార్గశిరశుద్ధషష్ఠి

ఈ దినమున సుబ్రహ్మణ్యపూజలను, సుబ్రహ్మణ్యారాధనమును ముఖ్యముగా జేయదగినవి. ఈదినమందు కుమారస్వామి తారకాసురుని సంహరించినందున దీనికి స్కంధషష్ఠి యని పేరువచ్చెను. కనుక యీరోజున కుమారస్వామిని పూజించినవారలకు సప్తజన్మ పాపములు నివర్తించును.

## 16. వైకుంఠఏకాదశి : మార్గశిరశుద్ధఏకాదశి

ఈ దినమందు దేవాలయ ఉత్తరద్వారమునందు శ్రీమహావిష్ణువును దర్శించినవారికి పునర్జన్మములేదని శాస్త్రము. ఈదినమే శ్రీరంగక్షేత్రమున శ్రీరంగదేవాలయ ఉత్తర ద్వారస్థ భగవదాలోకనమహోత్సవము.

## 17. మకరసంక్రాంతి : రవిమకరసంక్రమణ ప్రవేశం

ఈ దినమున స్నానముచేయనివాడు ఏడుజన్మలవరకును రోగిగను నిర్ధనుడుగను పుట్టును. అనగా దక్షిణాయన గతపాపసమూహము ఉత్తరాయణ పర్వకాలమున ఘోరాకృతితో వెలువడును. కాబట్టి అట్టి సంక్రాంతిమూర్తి నారాధించి తిలకూష్మాండ భాండకంబళ ధాన్యలోహవస్త్రాది దానములనొసంగి తైలదీపాదుల నొసంగుటచే పర్వకాలపుణ్యము తప్పక కలుగును.

## 18. రథసప్తమి : మాఘశుద్ధసప్తమి

ఈ దినమున స్నానముజేసి జిల్లేడాకులు, రేగుపండ్లు, గరికె, అక్షతలు, గంధము వీనితో సూర్యునికర్ఘ్యమిచ్చి దానములుచేసిన యెడల సమస్తదుఃఖములు నశించును.

### 19. మహాశివరాత్రి; మాఘ బహుళ త్రయోదశి

ఈ దినమునందు పరమేశ్వరుడు చరస్థిరలింగములయందంతటను వ్యాపించియుండుటవలన సర్వజనులు ఉపవాసమును, శివార్చనమును, జాగరణమును చేయదగినది. అట్లు చేసిన సమస్తపాపములు నశించి ఇహలోకసుఖమును, శాశ్వతకైవల్యానందపదవియును లభించును. మరియును శివునకు లక్షబిల్వార్చనమును తుమ్మిపుష్పములచే పూజయును జేసినవారు శివసాయుజ్యమును పొందుదురు. శివరాత్రి వ్రతమునం దుపవాసముండి రాత్రియంతయును జాగరణమొనర్చి లింగపూజ చేసినవారు ఇహలోకసుఖములను శివసాయుజ్యమును పొందుచున్నారు. సమస్త చరాచర ప్రపంచము శివస్వరూపము; శివుని యంగమునుండియే విష్ణ్వింద్రాది సమస్త దేవతలు జనించిరి. కాన ప్రతివారును శివుని పూజించవలయును. ఎవడు ఉపవసింపక శివరాత్రి వ్రతమును యాచరింపడో అతడు కోటి జన్మములయందు అంధతామిస్ర కీటకముగా జన్మించుచున్నాడు.

ముఖ్యసమనిక:—హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ పండుగ పబ్బములు ముఖ్యముగా అవతారపురుషులయొక్క జయంతి వర్ధంత్యోత్సవములు ఎక్కువగా వారిపేర్ల మీద జరుపుకొనుచు, ఆ ప్రవక్తలయందు భక్తిశ్రద్ధలు గలిగి ఆరాధించుచున్నారు. కష్టములనుండి విముక్తిఅయినప్పుడు రాక్షసుల బాధనుండి విముక్తి పొందినప్పుడు ప్రజలు ఆ యొక్క పురాణగాథలు వినుచూ తమ సంతోషములకు పండుగవేడుక మహోత్సవములు జరుపుకొనుచున్నారు. అందువలన ఇహపరసౌఖ్యముల మార్గమని వేదప్రమాణము.

## క్రైస్తవ ముఖ్యపండుగలు

### 1. క్రిస్టమస్

శ్రీ ఏసుక్రీస్తు ప్రభువు పుట్టిన దినమగుటచేత క్రిస్టమస్ పండుగ (జయంత్యోత్సవము) జరుపుదురు. పాపులను రక్షించు నిమిత్తము దేవుడు ఏసుక్రీస్తునామముతో మరియా అను కన్యకు పరిశుద్ధాత్మవలన బెత్లెహేము అను గ్రామమున అవతారపురుషుడై జన్మించెను. అట్టి పవిత్ర కాలములో తేజస్సు (వెలుగు) కలిగెను లూకా : 1–20. అందు

చేత క్రీస్తుప్రభు జయంత్యోత్సవములు కన్నులపండువుగా జరుపుచూ దాన ధర్మాది క్రియలు జరిపి యిహపర సౌఖ్యములు బడయుటకు తమ ప్రభువును స్తోత్రముచేసి ప్రభువునందు తమ భక్తి శ్రద్ధలు చూపి ప్రార్థించుదురు. ప్రపంచములో ఈ పండుగ క్రైస్తవులకు మొట్టమొదటి పండుగగా ఆచరించుచున్నారు ఇట్టి పవిత్రమైన జయంత్యోత్సవము క్రైస్తవ లోకమంతా చేయుచున్నారు. వివరములకు పెద్ద గ్రంథములు చూడుడు.

## 2. ఇంగ్లీషు నూతన సంవత్సరాది

ఇది జనవరి 1 వ తారీఖున వచ్చును. దీనికి ఛేదనసంస్కారము లేక ఏసునామకరణము, ఇంగ్లీషు సంవత్సరాది అనికూడ పేర్లు. ఈరోజున ఏసుక్రీస్తు లోకమునకు దర్శనమిచ్చిన పవిత్ర దినమగుటచేత నూతన వస్త్రధారులై తమ ప్రభువును ప్రార్థించి తమ భక్తి శ్రద్ధలతో పండుగ జరుపుకొని ఆనందాబ్ధి నోలలాడుదురు.

## 3. ఎ ఫి ఫె ని యా

(అన్యులకు ప్రభువు ప్రత్యక్షమైన దినము)

ప్రభువగు క్రీస్తు పుట్టుకగురించి ముగ్గురు జ్ఞానులు తూర్పు దేశపువారు వెడలి, యూదులప్రభువు పుట్టినవారు ఎక్కడని వాకబు చేయుచూ రాగా, హేరోదు రాజు శాస్త్రజ్ఞులద్వారా అటువంటి అతను పుట్టియున్నాడని తెలుసుకొని ఆ జ్ఞానులను చూచివచ్చి తనకు చెప్పుమనగా వారు చూచి దేవదూత ఆజ్ఞచే చెప్పక వెడలిపోయిరి. ఇట్లు క్రీస్తుప్రభువును చంపుటకు ప్రయత్నించి విఫలుడైనందుకు ఎఫిఫెనియా పండుగ జరుపుకొందురు. మత్తయి 2 : 1-12. తరువాత హేరోదురాజు 2 సంIIలలోపు వారినందరిని చంపునట్లు ఆజ్ఞచేయుట, చంపించుట తన రాజ్యాధికారము నిలువబెట్టుటకు ప్రయత్నించెను.

## 4. రూపాంతరము

క్రీస్తుప్రభువు తన నిజస్వరూపమును ప్రియశిష్యులైన పేతురు, యోహాను, యాకూబులకు విశ్వరూప సందర్శన మివ్వ మూర్చిల్లిరి. అప్పుడు మోషేయు, ఏలియా ప్రవక్తలు పరలోకమునుండి వచ్చి మాటలాడిరి. మేఘాంతర్భాగమునుండి క్రీస్తు నా ప్రియకుమారుడు; నా ప్రియకుమారుడైన ఏసుమాట వినుడని అశరీరవాణి వినవచ్చెను. అందుచేతను క్రీస్తుప్రభువు తనవిశ్వరూపసందర్శనమురోజుఆదివారము అగుటచేత ప్రార్థనాదికములు జరుపుకొనుచు, దేవునియందు అతని కుమారునియందు భక్తిశ్రద్ధలు ప్రదర్శించి పండుగ చేసుకొందురు.

## 5. సెప్తుయా - గేసిమ - ఆదివారము

ఈష్టరుపండుగునకు 70 రోజులు ఉన్నదనగా ముందువచ్చును. ఆదివారమునాడు ఏసుప్రభువుగురించి దేవాలయములో ప్రార్థన జరిపి భక్తిచే ధ్యానింతురు.

## 6. సెక్సుగేసిమ - ఆదివారము

ఈష్టరుపండుగునకు 60 రోజులున్నదనగా వచ్చును. పై ప్రకారముగా ఆదివారపు ప్రార్థనలు చేయుదురు.

## 7. కింక్వ - గేసిమ - ఆదివారము

ఈష్టరు పండుగునకు 50 దినములు ముందు వచ్చును. ఆదివారమునాడు ప్రార్థనలు జరిపి దేవునియందు తమ భక్తితో ధ్యానింతురు.

## 8. భస్మ బుధవారము

ఈష్టరుకు 40 రోజులు ఉన్నదనగా ముందువచ్చును. దీనిని మండలకాలమందురు. లెంటుకాలము శ్రమలకాలమందురు. అనగా క్రీస్తు శ్రమలను తలచుచు ధ్యానించుకాలము. ఈ నలుబది దినములు శుభకార్యములు, పండుగలు, వేడుకలు జరుపక నిషేధించుదురు.

సూచన:—మండలకాలము 40 రోజులకు చాలా పవిత్రతగలదు. ప్రవక్తలు అందరు 40 రోజులు దేవుని ధ్యానించుటచేత కూడ 40 రోజులకు పవిత్రత కలిగెను.

ఆరోగ్యము విషయములో ఆయుర్వేద శారీరకశాస్త్రములో 40 రోజులకు ఎనలేనిస్థానము గలదు. హిందువులు మండలమునకు ప్రాముఖ్యతయిచ్చినారు. ముస్లిములు 40 రోజులకార్యములు సూతకాది క్రియలలో 40 గరిష్ఠదినముల సంఖ్యగా లెక్కించుచున్నారు.

క్రీస్తు శ్రమలకాల మగుటచేత దీనిని ఉపవాస ప్రార్థనకాలముగా జరుపుకొనుచున్నారు. ఈకాలములో అరిషడ్వర్గములను జయించి సప్తవ్యసనములకు లోనుగాక తమ ప్రభువుశ్రమలను స్మరించుచూ ప్రతినిత్యము రాత్రులందు ప్రార్థనచేయుచు తమ విచారమును భక్తి శ్రద్ధలతో ప్రదర్శించుదురు. క్రీస్తుప్రభువు మానవులకొఱకు పడ్డ శ్రమలను గురించి స్మరించుచూ ప్రార్థనలు జరుపుకొందురు.

## 9. మట్టల ఆదివారము

ఈ పండుగ ఈష్టరుకు 8 రోజులముందు వచ్చును. ఏసుక్రీస్తు ప్రభువు తన నిరాడంబరము, సాధుస్వభావమును చాటుటకు వీలగు సాధువైన ఓర్మిగల జంతువు గాడిదపై నెక్కి యెరూషలేముకు శనివారము ఉదయము దేవాలయమునకు వచ్చి అచ్చటగల దుకాణములను తొలగించి పవిత్రము చేసిరి.

ఇట్లు వచ్చునపుడు స్త్రీ బాల వృద్ధ పురుషులు తెల్లనిబట్టలు పరచియు, మట్టలను పచ్చనితోరణములుగల ఆకులు పరచియు, చక్రవర్తి రాజలాంఛనము లుట్టిపడు గౌరవభావములతో "దావీదు కుమారునికి జయము, ప్రభువుపేరిట వచ్చువాడు స్తుతింపబడుగాక, స్వర్గోన్నతమైన స్థలములలో జయము" అనుచు స్వాగతముయిచ్చిరి. అఖండ సన్మానములుచేసి తదుపరి ఈలోక ప్రభువుపదవి రాజకిరీటాది సత్కారములతో సత్కరింపబోవగా వాటిని తృణప్రాయముగా తృణీకరించిరి. ఇహలోకసౌఖ్యములను త్యజించి మానవలక్షణములకు మార్గదర్శకులై యెరూషలేమునుండి బేతినియకు వెళ్ళి అక్కడ బసచేసిరి. అందుచేత శారీరక, మానసిక శక్తులను మించి ఆధ్యాత్మిక శక్తి గొప్పదనిచాటియున్నందున క్రీస్తుప్రభు జయోత్సవసూచకముగ తమ ప్రభువును ప్రార్థింతురు.

మత్తయి 21:1-17

## 10. పరిశుద్ధవారము

మట్టల ఆదివారమునుండి ఈస్టరుపండుగవరకు పరిశుద్ధవారమని పేరు. ఈ వారమంతయు ప్రార్థనలు చేయుదురు. సోమ, మంగళ, బుధవారములు తన శిష్యులకు క్రీస్తుప్రభువు ఉపదేశించుచు ప్రార్థనలు చేసిన పవిత్రకాలము. లక్ష్మివారమురాత్రి చాలపవిత్రమైన దినము. ప్రభు రాత్రిభోజనము (అంత్యమందు) క్రీస్తుప్రభువు ఈరాత్రియందు శిష్యులతో భుజించినరాత్రి గనుక చాలా పవిత్రమైనది. తన శిష్యులకు తన విషయము, భూతభవిష్య ద్వర్తమానములు - దేవుని చిత్తము, తానుపొందు శిలువమరణము పునరుద్ధరణగురించి తెలియజేసెను. అందుచేత ప్రభువువలె ప్రభురాత్రిభోజనము ఆచరించి తమ ప్రభువును గురించి ప్రార్థనలు చేయుదురు. మత్తయి 26 : 14 — 75
27 : 1 — 66

## 11. మంచి శుక్రవారము (Good Friday)

పరిశుద్ధవారములో ప్రభు రాత్రిభోజనమందు తన 12 గురు శిష్యులలో ఒక్కరు తనను శత్రువులకు అప్పగించుట, ద్రవ్యాపేక్ష వలన తనకు అంత్యకాలము సమీపించెనని తెలుపుట, 12 వ శిష్యుడు ప్రార్థనచేయుచుండగా ముద్దుపెట్టుకొనునట్లు నటించి మోసము చేయుటవలన క్రీస్తుప్రభువుకు ద్రోహముచేసి యూదులకు పట్టువడునట్లు చేసెను. వారలు అతనిపై దైవద్రోహము, రాజద్రోహము, దేశద్రోహము మొదలగు నేరములు మోపబడి రాజుకు యిష్టము లేకున్నప్పటికి అందరు శిలువ శిలువ - శిలువ శిక్ష అని యెలుగెత్తి ఆ రాత్రి శిక్ష విధింపజేయించిరి. ఇవి అన్నిటికి ముందుగానే తాను ఎందుకు అవతరించినాడో, ఎందుకు తన అవతారము చాలించుచున్నాడో - తను వచ్చినపని నెరవేరినందున సంతోషాయత్త చిత్తుడై తన దేహమును త్యజించెను. చెడ్డశుక్రవారము అనుట అమంగళముగనుక మంగళముగానే యెంచి శుభాశుభములందన్నింటన్ను మంగళశబ్దమే జయమని చాటెను. అందుచేత గుడ్

ఫ్రైడే జరిపి ప్రభువునందు స్తోత్రప్రార్థనలు ఆచరింతురు. దీనిని వర్థంతిగా జరుపుదురు. క్రిస్టమస్ పండుగ జయంతిగా జరుపుదురు.

మత్తయి 28 అధ్యాయం

## 12. ఈ ష్ట రు

ఈ పండుగ చాలా పవిత్రమైనది. ప్రపంచములో చాలా ఘనత కెక్కినది. దీనిని పునరుద్ధారణపండుగ అందురు. ఏసుక్రీస్తు శుక్ర వారం (Good Friday) మృతుడై 3 వ రోజుఅయిన ఆదివారమునాడు సజీవుడై తన విశ్వరూపసందర్శనమును యిచ్చిన పవిత్రమైనదియు, ఘనత కెక్కినదైన పండుగ అనుటలో సందేహములేదు. ప్రవక్తలు, అవతారపురుషులు మృతులై తిరిగి లేచుట చరిత్రలో కనరానిది. అందుచేత ఏసుప్రభువు తన అనాత్మను విడిచి పరిశుద్ధాత్మ (భగవత్స్వరూపము) యై తనవిశ్వరూపమును దేదీప్యమాన తేజోవిలాసములచేత ప్రకాశించుచూ సజీవుడై లేచిన పవిత్రరోజు అగుటచేత దీని విషయము ఎంత పవిత్రమైన పండుగయో వేరే వివరించ నక్కర లేదు. చాలాపుణ్యదినముఅగుటచే ప్రపంచక్రీస్తులోకము హల్లెలూయ హల్లెలూయ హల్లెలూయ అను మంగళ తూర్య నినాదములతో ఘోషించుచూ వేడుకోత్సవములు జరుపుకొనుచున్నారు.

మత్తయి 28 అధ్యాయము

## 13. ఆ రో హ ణ ము

ఈష్టరుపండుగయిన తదుపరి 40 వ రోజున సజీవుడై లేచి అంతరిక్షముగా ఆరోహకుడగు క్రీస్తుప్రభువు తన దేదీప్యకాంతులతో తేజరిల్లుచూ, తన వార్తలు ఎలుగెత్తిచాటుచూ క్రీస్తులోకమంతా ప్రజ్వలింపజేయుచూ దశదిశలు మారుమ్రోగగ అంతరిక్షముద్వారా భగవంతునివైపునకు ఆరోహకుడై అంతర్థానమొందిన పవిత్రమైన దినము. ఆరోహణపండుగయందు ప్రభు దివ్యసందేశములు స్మరించుచూ, ప్రభువును కీర్తించుచూ ప్రార్థనలు జరుపుదురు.

మత్తయి 28 : 16—20

## 10. పరిశుద్ధవారము

మట్టల ఆదివారమునుండి ఈష్టరుపండుగవరకు పరిశుద్ధవారమని పేరు. ఈ వారమంతయు ప్రార్థనలు చేయుదురు. సోమ, మంగళ, బుధవారములు తన శిష్యులకు క్రీస్తుప్రభువు ఉపదేశించుచు ప్రార్థనలు చేసిన పవిత్రకాలము. లక్ష్మివారమురాత్రి చాలపవిత్రమైన దినము. ప్రభు రాత్రిభోజనము (అంత్యమందు) క్రీస్తుప్రభువు ఈరాత్రియందు శిష్యులతో భుజించినరాత్రిగనుక చాలా పవిత్రమైనది. తన శిష్యులకు తన విషయము, భూతభవిష్య ద్వర్తమానములు - దేవుని చిత్తము, తానుపొందు శిలువమరణము పునరుద్ధరణగురించి తెలియజేసెను. అందుచేత ప్రభువువలె ప్రభురాత్రిభోజనము ఆచరించి తమ ప్రభువును గురించి ప్రార్థనలు చేయుదురు. మత్తయి 26 : 14 — 75
27 : 1 — 66

## 11. మంచి శుక్రవారము (Good Friday)

పరిశుద్ధవారములో ప్రభు రాత్రిభోజనమందు తన 12 గురు శిష్యులలో ఒక్కరు తనను శత్రువులకు అప్పగించుట, ద్రవ్యాపేక్ష వలన తనకు అంత్యకాలము సమీపించెనని తెలుపుట, 12 వ శిష్యుడు ప్రార్థనచేయుచుండగా ముద్దుపెట్టుకొనునట్లు నటించి మోసము చేయుటవలన క్రీస్తుప్రభువుకు ద్రోహముచేసి యూదులకు పట్టువడునట్లు చేసెను. వారలు అతనిపై దైవద్రోహము, రాజద్రోహము, దేశద్రోహము మొదలగు నేరములు మోపబడి రాజుకు యిష్టము లేకున్నప్పటికి అందరు శిలువ శిలువ - శిలువ శిక్ష అని యెలుగెత్తి ఆ రాత్రి శిక్ష విధింపజేయించిరి. ఇవి అన్నిటికి ముందుగానే తాను ఎందుకు అవతరించినాడో, ఎందుకు తన అవతారము చాలించుచున్నాడో - తను వచ్చినపని నెరవేరినందున సంతోషాయత్తచిత్తుడై తన దేహమును త్యజించెను. చెడ్డశుక్రవారము అనుట అమంగళముగనుక మంగళముగానే యెంచి శుభాశుభములందన్నింటన్ను మంగళశబ్దమే జయమని చాటెను. అందుచేత గుడ్

ఫ్రైడే జరిపి ప్రభువునందు స్తోత్రప్రార్థనలు ఆచరింతురు. దీనిని వర్థంతిగా జరుపుదురు. క్రిస్టమస్ పండుగ జయంతిగా జరుపుదురు.

మత్తయి 28 అధ్యాయం

## 12. ఈ ష్ట రు

ఈ పండుగ చాలా పవిత్రమైనది. ప్రపంచములో చాలా ఘనతకెక్కినది. దీనిని పునరుద్ధారణపండుగ అందురు. ఏసుక్రీస్తు శుక్రవారం (Good Friday) మృతుడై 3 వ రోజుఅయిన ఆదివారమునాడు సజీవుడై తన విశ్వరూపసందర్శనమును యిచ్చిన పవిత్రమైనదియు, ఘనతకెక్కినదైన పండుగ అనుటలో సందేహములేదు. ప్రవక్తలు, అవతారపురుషులు మృతులై తిరిగి లేచుట చరిత్రలో కనరానిది. అందుచేత ఏసుప్రభువు తన అనాత్మను విడిచి పరిశుద్ధాత్మ (భగవత్స్వరూపము)యై తనవిశ్వరూపమును దేదీప్యమాన తేజోవిలాసములచేత ప్రకాశించుచూ సజీవుడై లేచిన పవిత్రరోజు అగుటచేత దీని విషయము ఎంత పవిత్రమైన పండుగయో వేరే వివరించ నక్కరలేదు. చాలాపుణ్యదినముఅగుటచే ప్రపంచక్రీస్తులోకము హల్లెలూయ హల్లెలూయ హల్లెలూయ అను మంగళ తూర్య నినాదములతో ఘోషించుచూ వేడుకోత్సవములు జరుపుకొనుచున్నారు.

మత్తయి 28 అధ్యాయము

## 13. ఆ రో హ ణ ము

ఈష్టరుపండుగయిన తదుపరి 40 వ రోజున సజీవుడై లేచి అంతరిక్షముగా ఆరోహకుడగు క్రీస్తుప్రభువు తన దేదీప్యకాంతులతో తేజరిల్లుచూ, తన వార్తలు ఎలుగెత్తిచాటుచూ క్రీస్తులోకమంతా ప్రజ్వలింపజేయుచూ దశదిశలు మారుమ్రోగగ అంతరిక్షముద్వారా భగవంతునివై పునకు ఆరోహకుడై అంతర్థానమొందిన పవిత్రమైన దినము. ఆరోహణపండుగయందు ప్రభు దివ్యసందేశములు స్మరించుచూ, ప్రభువును కీర్తించుచూ ప్రార్థనలు జరుపుదురు.

మత్తయి 28 : 16—20

## 14. పెంతుకోస్తు

పెంతుకోస్తు లేక ధనళాదివారము అనగా పరిశుద్ధాత్మ శిష్యులమీదికి ప్రసరించిన చాల పవిత్రమైన దినము. ఇది అపోస్తుల కార్యక్రమము (అనగా శిష్యులు). మత్తయి 2 అధ్యాయము

పెంతుకోస్తుపండుగ జరుపుకొనుచుండు సమయమున క్రీస్తు ప్రభువు తన పరిశుద్ధాత్మను శిష్యులమీదకు ప్రసరింపజేసి పవిత్రులను జేయుదునన్న వాగ్దానప్రకారముగా ప్రసరింపజేసిన పవిత్రదినము. ఆకాశమునుండి అశరీరవాణి మేఘ గంభీరనినాదములతో రాగా అక్కడివారు భయపడిరి. శిష్యుడు పేతురు పరిశుద్ధాత్మ ప్రసరించ బడినవాడై, గంభీరోపన్యాసములు యిచ్చి, ప్రభువునామమునుబట్టి ప్రార్థనచేయువా రందరు రక్షింపబడుదురనియు ప్రభుసందేశమును వినిపించెను. అందువలన ఆ పండుగనాడు ప్రభు పరిశుద్ధాత్మ తమ యందుకూడ ప్రసరింపజేయుగాక అని ప్రార్థించుదురు.

సూచన:— ఈ పండుగ లన్నిటికి ఇతరమతస్థులవలె వేర్వేరు ప్రార్థనలు గలవో అదేవిధముగ ఒక్కొక్క పండుగకును ఆ కాలములో చేయవలసిన ప్రార్థనలు జరుపుకొనుచున్నారు. అందరుమతస్థులుకూడ ఏ యే పండుగలలో ఆచరించ వలసిన ప్రార్థన ఆ కాలములో చేయుదురు.

# ముస్లింలు ఆచరించు పండుగలు - మాసములు

## 1. మొహరం నెల

ముస్లిం చాంద్రమాన పంచాంగము ప్రకారము మొదటినెల. హ. జరత్ హస్సేను - హుస్సేను వీరులు అనువారల సంతతివారు ధర్మయుద్ధమునకై తమజీవితములను ధారపోసిరి. వారి సంస్మరణార్థము వారిచరిత్రలు పఠించుట - ప్రార్థనలుచేయుట - ఉపవాసములుండుట - అన్న వస్త్ర దానధర్మములుచేయుట ముఖ్యము. పదవరోజు చాలా గొప్పరోజు.

## 2. సఫర్

ఈ నెలలో ఆఖరు చాహైషుంబా (బుధవారము) చాలా పవిత్రమైనరోజు. శ్రీ మహమ్మద్ ప్రవక్తవారు సంపూర్ణ ఆరోగ్యము పొందినరోజు. ఆరోజున అభ్యంగనస్నానము లాచరించి, వేడుకలతో తోటలోనికి వెళ్లుట - వనసంతర్పణాద్రిక్రియలు ఆచరింతురు.

## 3. రబిఅవ్వల్

ఈ నెలలో శ్రీ ప్రవక్తగారైన మహమ్మద్ చంద్రునిచూచిన 12-వ రోజు సోమవారమునాడు మక్కాలో జన్మించిన పవిత్రదినము. పుట్టినదిలగాయతు 12 రోజులు (జయంతి) చేయుదురు. ఆ 12 రోజులు శ్రీవారి జీవితపారాయణ చేయుదురు. ఈ 12 రోజులు అన్న సంతర్పణ, దశవిధదాన ధర్మములు ఎంతచేసిన అంతమంచిది.

## 4. రబీఉల్-ఆఖర్

ఈ నెలలో అబ్దుల్ ఖాదర్, జిలానీ మహాత్ములు స్వర్గలోకము చేరిరి. ఈ 11 రోజులు వారి వర్ధంతి జరుపుచు వారిచరిత్రలు పఠించుట, పూర్తి జీవితచరిత్ర కాలక్షేపములు - ఏకాహ వేడుక మహోత్సవములు జరుపుకొనుచు వారి వారి శాంత సత్య దయాధర్మాది గుణములు శ్లాఘించుచూ వారియందును, శ్రీ భగవంతుని నామముతో తమ ధర్మకార్యములను నిర్వర్తించుకొనుచూ, తమ భక్తి శ్రద్ధలు ప్రదర్శించుకొనుచూ యున్నారు.

## 5. జమాదిల్-లవల్

ఈ నెలలో చంద్రుని చూచినరోజున 20 రకాతులు (నమాజ్) ప్రార్థనచేయుట చాలా ముఖ్యము.

## 6. జమాదిస్ సాని

ఈ నెలలోకూడా చంద్రుని చూచినరోజున 12 రకాతులు నమాజ్ చదువుట, 10 రోజులు ఉపవాసములుండుట చాలాపుణ్యము.

## 7. రజబ్

శ్రీ భగవంతుడు ఈ నెలఅంతయు చాలా పవిత్రమైనదని సెలవిచ్చెను. 27–వ రోజున మహమ్మదువారు బురాఖ్‌పై (కామ ధేనువు ఆకారముగలది) ఆకాశమార్గముద్వారా శ్రీ దేవదేవుని సన్నిధానమునకు వెళ్ళిరి. నాడు భగవంతుడు మహమ్మదువారికి దర్శనమిచ్చిన పుణ్యరోజు. ఆ రోజు పెద్దరాత్రి అందురు. నాడు జాగరణచేయుట – ప్రార్థనలుచేయుట – వేదపఠన చాలాముఖ్యమైనది. ఈ నెలలో ఉపవాసాది పుణ్యకార్యము లాచరించుట చాలా పుణ్యప్రదము.

## 8. షాబాన్

చంద్రునిచూచిన 13, 14, 15 రోజులు చాలా పవిత్రమైన పండుగరోజులు. దీనిని పితృదేవతల సంస్మరణార్థము, వారలకు ఆత్మ శాంతికొరకు ఉపవాసములుండుట–రాత్రి జాగరణచేయుట – ప్రార్థనలు జరుపుట చాలా ముఖ్యము. ఈ మూడురోజులలోను తమ వంశ వృక్షములోని నామధేయముల ప్రకారముగ అన్నసంతర్పణాది క్రియలు – ఫలములతో వారి వారి పేర్లపై పాతెహాలు ఇచ్చుదురు. ఈపండుగ పితృదేవతలసంస్మరణార్థము చాలాముఖ్యము.

## 9. రంజాన్

ఈ నెల సంవత్సరములోని 12 నెలలలోను చాల పుణ్యప్రదమై జనుల ఇహపరసౌఖ్యములకు ఆధారభూతమైనదిగా దేవుని ఆజ్ఞయై యున్నది. వేదగ్రంథమైన పవిత్రమైన ఖురాన్ శ్రీ దేవదేవుని సన్ని ధానమునుండి హజరత్ జిబ్రాయిల్ అలెహిస్సల్లామ్ దేవదూత వారి ద్వారా మహమ్మద్‌వారికి అందజేయబడినది. మహమ్మదువారు అవిద్యావంతులైనప్పటికి భగవంతుని వేదగ్రంథము ఆమూలాగ్ర ముగ కరతలామలకము అయ్యెను. ఈనెల అంతయు ఉపవాసము లుందురు. తిరిగి నెలపొడుపు చూచిన మర్నాడు పండుగచేయుదురు. ఉపవాసములనెల అందురు. సేమ్యాలపండుగ అనికూడా పిలుతురు.

ఈనెల అంతయు 5 పూటలు నమాజ్ చేయుట - ఉపవాసము లుండుట - పవిత్ర వేదములు చదువుట - అరిషడ్వర్గములకు లోను గాకను, సప్తవ్యసనములు విడచి భగవద్భక్తిపారాయణులైన భక్తులు దేవదూతలుగ పరిగణింపబడుదురు. ఈ నెలలోని నెలపొడుపు చూచిన 27 వ రోజున పెద్దరాత్రి వచ్చును. ఆ రాత్రి జాగరణ చేయుదురు (సూరయే ఖదర్). ఆ రాత్రి వేయినెలలకంటె శ్రేష్ఠమైన దని శ్రీ దేవదేవుని ఆజ్ఞ ఆయెను.

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్ :—

అమిత దయగలవాడును, ప్రేమించువాడును దేవునిపేర.

1. ఇన్నా - అన్ - జల్నాహు - ఫీ - లైలతిల్ - ఖద్రి 2. వమా - అద్రాక - మా - లైలతుల్ - ఖద్రీ. 3. లైలతుల్ - ఖద్రీ - ఖైరుమ్ - మిన్ - అల్ - ఫి - షహ్రిన్. 4. తనజ్ - జలుల్ - మాలా - ఇకతు - వర్ - రూహు - ఫీహాబి - ఇజ్ని - రబ్బిహిమ్ - మిన్ - కుల్లి - అమ్రిన్ 5. సలామున్ - హియహత్తా - మత్ - లఇల్ - ఫజ్రి.

అ॥ (1) నిశ్చయముగా మేము ఖురానును పెద్దరాత్రియందు దింపితిమి. (2) మరి పెద్దరాత్రియన నేమో నీకు తెలియునా ? (3) పెద్దరాత్రి వేయినెలల రాత్రికంటె శ్రేష్ఠమైనది. (4) ఆ రాత్రి యందు దేవదూతలును, పరిశుద్ధాత్మయును తమ ప్రభువు శలవుచే ప్రతి మంచికార్యమును తీసికొని దిగి వత్తురు. (5) అది శాంతియుత మైనది. అది తెల్లవారువరకు యుండునది.

ఈనెల అంతయు పగలు ఉపవాసములు, 5 పూటలలో చేయు నమాజు రకాతులకంటె 20 రకాతుల (ప్రార్థన) రాత్రి తరాబీనమాజు చేయుదురు. ఈనెల చాల పవిత్రమైనది. అన్నవస్త్రదానధర్మములు ఎక్కువగా ఆచరింతురు. ఉపవాసముండువారలకు పండ్లు, ఫలహార ములు పంపుట, దశవిధ దానధర్మములు యీనెలలో ఎంతఎక్కువ చేసిన అంతపుణ్యము లభించును. ఈ పండుగవగైరా ధర్మముల గురించి, యీ నెలగురించి పురాణగ్రంథములలో ఎక్కువ వివరములు గలవు.

## 10. షవ్వాల్

ఈ నెలలో 6 రోజులు ఉపవాసముుండిన రంజాన్ నెల 30 రోజుల ఉపవాసములు - వెరశి 36 రోజులు 360 రోజులు ఉపవాసములతో అనగా ప్రతిరోజూ ఉపవాసమున్నట్లే లెక్కకువచ్చి పుణ్యము కలుగునని హదీస్ షరీఫ్ (శ్రీమహమ్మదువారు పలికిన పురాణ గ్రంథము) లో గలదు.

## 11. జీ - ఖాదా

12 వ నెలఅగు జిల్ హాజ్ నుబట్టి యీనెలకుకూడా ఎక్కువ పవిత్రతకలిగెను. కాబాషరీఫ్ (మక్కాపుణ్యక్షేత్రమును) దర్శించి ఆ పవిత్రస్థలమందు భగవంతునియెడగల భక్తిశ్రద్ధలు ప్రదర్శించి ప్రార్థించుటవలన చాలాపుణ్యము కలుగును. శ్రీమహమ్మదు వారు ఈనెలలో ఉమ్రాచేసిరి.

## 12. జిల్ - హాజ్ (బక్రీద్ పండుగ)

ఈ నెల చాలా పవిత్రమైనది. నెలపొడుపు చూచినదిలగాయతు పదిరోజులు వేదపఠన - ప్రార్థన - ఉపవాసములు - యాత్రచేయుట - ధర్మములు - యజ్ఞములు - సత్కార్యములు మొదలగు పుణ్యకార్యము లాచరించవలయును. 10 వ రోజున బక్రీద్ పండుగ జేయుదురు.

సదరు పుణ్యకార్యములు ప్రవక్తలగు ఇబ్రహీంఅలెహిస్సల్లామ్ వారికుమార్డు యిస్మాయిల్ అలెహిస్సల్లామ్ వారలకాలమగు 4 వేల సం॥ల క్రితమునుండియు యిప్పటివరకుకూడా ఆచరించుచున్నారు. ఈ ప్రవక్తలు మక్కాషరీఫ్ (పుణ్యదేవాలయములు) వీరే నిర్మించిరి. వీరి సంతతివారలనుండియే శ్రీమహమ్మద్ ప్రవక్తగా రుద్భవించిరి.

ఇరాక్ లోనివారు ఇబ్రహీం ప్రవక్తవారిని, వారికుమారుని వారి మతధర్మసూత్రములు గిట్టక దుర్మార్గులు వ్యతిరేకులైరి. అప్పుడు మక్కా షరీఫ్‌నుండి ధర్మోపదేశములుచేసిరి.

ఇబ్రహీంప్రవక్తవారిని శ్రీభగవంతుడు యజ్ఞముచేయవలసినదిగా స్వప్నములో ఆదేశించిరి. అప్పుడు 100 ఒంటెలు యజ్ఞములు చేసిరి. ఇట్లు 2, 3 సార్లు యజ్ఞముచేసిరి. కాని భగవంతుడు నీకు ప్రియమైనదానిని యజ్ఞముచేయవలసినదిగా ఆజ్ఞయయ్యెను. అప్పుడు తరచి, తరచి తనకుమారుడే యన్నిటికంటె ప్రీతికరమైనదిగాతోచి దుస్తులుధరింపజేసి తీసుకొనివెళ్ళుచుండగా ఇబ్లీసు (సైతాన్) యీ సంగతి యిస్మాయిల్ కుమారునికిచెప్పి భయముకలిగించెను. ఆచిన్నవాడు భగవంతునికి తననుఅర్పించుటకంటె ఎక్కువ సంతోషములేదని దానినితిరస్కరించి తండ్రితో యీసంగతి చెప్పెను. తండ్రి లా-హేలా -వలా - ఖువ్వతఇలా - బల్లా - హిల్-అలీయుల్-లా-అజీమ్ అనిచెప్పి సైతానును తిరస్కరించమనగా, సైతాను తన ఆటలు సాగవని యింటివద్ద తల్లితో తనకుమారుని యజ్ఞముచేయుటకు తీసుకొని వెళ్ళుచున్నట్లు చెప్పెను. తల్లికూడా అంతకంటె సంతోషమైనది తనకులేదని నిర్విచారముగా చెప్పెను.

ఇబ్రహీంగారు కుమారుడైన యిస్మాయిల్‌ను మీనా కొండ వద్దకు తీసుకొనివెళ్లి తను భగవంతునికి అర్పించుచున్నట్లు అతనితో చెప్పగా అత్యంతానందముతో,సంతోషముతోఅర్పించుమని తండ్రిని హెచ్చరించి తాను సిద్ధపడెను. తండ్రి కండ్లకు గంతలుకట్టుకొని ఖుర్బానీచేయబోవ నిష్ఫలముకాగా భగవంతునిఆజ్ఞచేత జిబ్రాయిల్ దూత కుమారునితొలగించి యిరాక్ జడలబట్టెను కత్తికి ఎరచేసిరి. భగవంతునిపేరుతో ఇబ్రహీంప్రవక్త 3 వ సారి వేటుతో బట్టెతలను త్తరించిరి. తదుపరి చూడగా కుమారుడు రక్షింపబడుట - ఈ విధముగ జరుగుట - జిబ్రాయిల్ దూతద్వారా భగవంతునిపరీక్షలు వేనోళ్ళ నుతించిరి. స్తోత్రము చేసిరి. ఈ పండుగ పవిత్రమైనది.

N. B:— పండుగలు - నెలల ప్రాముఖ్యత, యింకను తదితరవిషయములు భగవత్పురాణములలో ఎక్కువ వివరములుగా గలవు. పురాణగ్రంథములు చూడుడు.

# ప్రార్థనా శ్లోకములు

సూచన:— శ్రీమద్భగవద్గీతాశ్లోకములు - శ్రీఖురాన్ షరీఫ్ గ్రంథములోని ఆయతాలు, సూరాలు, శ్రీ బైబిలు సువార్తలు, వాక్యములు అన్నియుకూడ ప్రార్థనాశ్లోకములని వేదప్రమాణము. కనుక ఈ గ్రంథములోని శ్లోకములు సూరాలు - ప్రార్థనలు శుచి శుభ్రములుగలవారలై గురుముఖముగా పఠించుటవలన విశదమగును. లేనియెడల ఉదాత్త అనుదాత్తస్వరితములలో భేదములు కలిగిన అర్థములు భేదించును. కనుక ఈ వేదగ్రంథములోని మంత్రతంత్ర ప్రార్థనాదికములు గురుముఖముగా బడయుచున్నందున ఇహపర సౌఖ్యములకు మార్గమగునని వేరే నుడువనక్కరలేదు. ఖురాన్ షరీఫ్ సూరాలు గురుముఖముగా పఠించవలయును. కాన ముఖ్యముగా గమనించగోరెదను.

## ముస్లిం ప్రార్థనాదికములు

### పాంచ్ - కల్మే

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్ :

అమితదయగలవాడు - ప్రేమించువాడగు దేవునిపేర.

1. అవ్వల్ - కల్మాతియ్యబ్ - లా - ఇలాహ - ఇల్లలాహు - మహమ్మదుర్ - రసూలుల్లాహి.

అ. మొదటి కల్మా పవిత్రముచేయునది. దేవుడు తప్ప యితరులు పూజార్హులుకారు. మహమ్మదువారు దేవునివలన పంపబడిన ప్రవక్త.

2. దుయ్యం - కల్మషహాదత్ - అష్హదు - అన్ - లాఇలాహ - ఇల్లల్లాహు - వహదహు - లాషరీకలహు - వఅష్హదు - అన్న మహమ్మదన్ - అబ్దుహు - వరసూలుహు.

అ. రెండవ కల్మాసాక్ష్యమిచ్చుట:— దేవుడు ఒక్కడనియు, భగవంతుడుతప్ప యితరులు పూజార్హులుగారనియు, భగవంతునితో సమానులు ఎవరూ లేరనియు, నిస్సందేహముగా మహమ్మదువారు వానియొక్క సృష్టి అనినీ, భగవన్మార్గము చూపువారని నేను సాక్ష్యము చెప్పుచున్నాను.

3. సుయ్యాంకల్మతంజీద్ - సుబహా - నల్లాహి - వలహంద్ - లిల్లాహి - వలా - ఇలాహ - ఇల్లల్లాహు - అల్లాహు - అక్బర్ వలాహౌల - వలా - ఖువ్వత - ఇల్లాబిల్లాహిల్ - అలీయ్యుల్ అజీం.

అ. 3 కల్మ ఘనతచూపునది. దేవుడు పరిశుద్ధుడు. సమస్త స్తోత్రములు దేవునికొరకే తగియున్నవి. దేవుడుతప్ప మరియొకరు పూజింపబడుటకు అర్హులుకారు. దేవుడు గొప్పవాడు. ఆ పరమాత్ముని కృపచేతనే శౌర్యబలములు కలుగుచున్నవని చెప్పుచున్నాను.

4. చహారుం కల్మతౌహీద్ - లా ఇలాహ ఇల్లల్లాహు - వహదహు - లాషరీ కలహు - లహుల్ ముల్కు - వలహుల్ హందు - యొహయీ - వయుమీతు - బియిదిహిల్ ఖైర్ - వహువ - అలాకుల్లి - షయ్యిన్ - ఖదీర్.

అ. 4 కల్మ భగవంతుడు ఒక్కడు అనునది. దేవుడుతప్ప మరియొకరు పూజించుటకు అర్హులుకారు. దేవుడు ఒక్కడు. అతనితో సమానులులేరు. సమస్తలోకములు దేవునివై యున్నవి. సమస్తస్తోత్రములు దేవునికే తగియున్నవి. దేవుడే సృష్టి స్థితిలయ కారకుడు. సమస్తము దేవుని ఆధీనములోయున్నవి.

5. పంజుం కల్మ రద్దికుఫర్- అల్లాహుమ్మ- ఇన్ని - మిన్ - అ ఊజుబిక- మిన్ అన్ ఉష్రిక - బికషైయ్యావం - వ ఆనా ఆలముబిహీ - వస్తగ్ ఫిరుక - లిమాలా - ఆలమూబిహీ - తుబ్ తుఅన్ హు - వత బర్రాతు - మినల్ కుఫ్రి. వషిర్కి - వల్ మాసి - కుల్లిహా - అస్లంతు - వ ఆ మన్ తు - వ అ ఖూలు - లాయిలాహ - ఇల్లల్లాహు - ముహమ్మదుర్ రసూలుల్లాహి.

అ॥ 5 వ కల్మా ఓ భగవంతుడా! నేను నీ సన్నిధిలో క్షమాపణ వేడుకొనుచున్నాను. ఏ సృష్టినైనను నీతోసాటిగాని, సమానముగాని చేయను. నేను యిదివరలో తెలివిమాలి చేసిన పాపములనుగూర్చి నిన్ను క్షమార్పణ కోరుచున్నాను. దానివలన నేను ప్రాయశ్చిత్తము పడుచున్నాను. నేను కుఫర్, షిర్క్‌లనుండి దూరముగా యున్నాను. యావత్తు పాపములనుండి క్షమించుటకుగాను భక్తులగు ముస్లిం అగుచున్నాను. భగవంతుడుతప్ప యితరులెవరు పూజింపబడుటకు, అర్హులుకారని శ్రీ మహమ్మద్ వారు భగవంతుని సృష్టియనియు, ప్రియులైన ప్రవక్తయనియు నమ్ముచున్నాను.

ఈ మాని ముజమిల్:—ఆమన్ తుబిల్లాహి - కమాహుక - ఓఅస్మాయిహీ - వసిఫాతిహీ - వఖబిల్ తు - జమీఅ - అఃకామిహీ.

అ॥ నేను భగవంతునికిగల సర్వవిధములైన నామముల ప్రకారమున్నూ, పొగడ్తల ప్రకారమున్ను, సర్వయజ్ఞముల ప్రకారము చేయగలవాడనని ప్రమాణము చేయుచున్నాను.

ఈ మాని ముఫస్సిల్:—ఆమన్ తుబిల్లాహి - వమలాయికతిహీ - వకుతుబిహీ - వరుసులిహీ - వల్ యౌమిల్ ఆఖిరి - వల్ ఖద్ రి - ఖైరిహీ-వషర్రిహీ-మినల్లాహితఆలా - వల్బాసి - బాదల్ మౌత్.

అ॥ ప్రమాణము — నేను దేవునియందు, ఆయన దూతలయందు, వేదములయందు, ప్రవక్తలయందు, ప్రళయకాలము తీర్పు దినమందు, మంచిచెడ్డలు కనిపెట్టు దేవుడని నమ్మటయందు, తిరిగి ప్రళయకాలమందు లేచుటయందును నేను ప్రమాణపూర్తిగానిజమని నమ్ముచున్నాను.

## నమాజ్ కేసూరే (ప్రార్థన శ్లోకములు)

### 1. సూరయె ఫాతెహా మక్కీ - 7 వాక్యములు

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్

అమితదయగలవాడు, ప్రేమించువాడగు దేవుని పేర.

1. అల్ హమ్దు - లిల్లాహి - రబ్బిల్ - ఆలమీన్ 2. అర్రహమా - నిర్రహీమ్. 3. మాలికి - యౌమిద్దీన్. 4. ఇయ్యాకన అబుదు - వ ఇయ్యాక-నస్తఈన్. 5. ఇహ్ దినస్ - సిరాతల్ - ముస్తఖీమ్ - 6. సిరాతల్ - లజీన - అన్ అమ్త - అలైహిమ్. 7. గైరిల్ - మగ్ - దూబి అలైహిమ్ - వలజ్ - జ్వాల్లీన్ (అమీన్)

అ. సమస్త స్తోత్రములు సర్వలోకములకు పోషకుడును, అమితదయగలవాడును, ప్రేమించువాడును, తీర్పుదినమునకు సర్వాధికారియునగు దేవునికై యున్నవి. ఓ దేవా! నిన్నే మేము పూజించుచున్నాము. మరి నీ సహాయము వేడుచున్నాము. మాకు సన్మార్గము చూపుము. నీవు అనుగ్రహించనివారును, నీ కోపమునకు పాత్రులు అయినవారును, దుర్మార్గులైనవారును పోవుమార్గము చూపకుము.

## 2. సూరయే - మా ఊన్. మక్కీ - 7 వాక్యములు

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్

అమితదయగలవాడును, ప్రేమించువాడునగు దేవుని పేర.

1. అర - అయ్ - తల్లజీ - యుకజ్ - జబు - బిద్దీన్ 2. ఫ - జాలి - కల్లజీ - యదుఅ - ఉల్ - యతీమ్. 3. వలా - యహుజ్ జు - అలా - తఆ - మిల్ - మిస్కీన్. 4. ఫవై - లుల్ - లిల్ - ముసల్లీన్, 5. అల్లజీన - హుమ్ - అన్ - సలాతిహిమ్ - సాహూన్. 6. అల్లజీన - హుమ్ - యురా ఊన్. 7. వ - యమ్ - నఊనల్ - మా ఊన్.

అ. తీర్పుదినము తిరస్కరించునట్టివానిని నీవు చూచితివా! వాడు తండ్రిలేని బిడ్డను నెట్టువాడు. మరియు వాడు నిరుపేదలకు అన్నము పెట్టవలయునని ప్రోత్సాహ పరుపనివాడు. నమాజు చేయు వారిలో నెవరు నమాజు మరచిపోవుచూ నమాజు ప్రజలకు చూపుటకు చేయుదురో మరియు వారు, వారు కొను వస్తువులు నొసంగక యుందురో వారికి గొప్ప వినాశనమున్నది.

## 3. సూరయే - కౌస్తర్ - మక్కీ 3 వాక్యములు

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్

1. ఇన్నా - అఅతైనా - కల్ - కౌసరు. 2. ఫసల్లి - లి-రబ్బిక - వన్ - హర్ 3. ఇన్నా - షాని - అక - హువల్ - అబ్‌తర్.

అ. నిశ్చయముగా మేము నీకు కౌసరు నొసంగితిమి. కావున నీవు నీ ప్రభువునిగూర్చి ప్రార్థనచేయుము. మరియు ఖుర్బానీ చేయుము. నిశ్చయముగా నీ శత్రువే తోక తెగినవాడు.

కౌసర్ = ఒక హౌజునకుపేరు. (అమృతము విధముగ)

## 4. సూరయే కాఫిరూన్ - మక్కీ - 6 వాక్యములు

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్.

1. ఖుల్ - యా - అయ్యు హల్ - కాఫిరూన్.
2. లా - అఅ - బుదు - మాతఅ - బుదూన్.
3. వల్తా - అన్ - తుమ్ - అబిదూన - మా - అఅ - బుద్.
4. వలా - అన - ఆబి - దుమ్ - మా - అబిత్తుమ్.
5. వలా - అన్‌తుమ్ - అబిదూన - మా - అఅ - బుద్.
6. లకుమ్ దీనుకుమ్ - వలయ - దీని.

అ. ఓ విశ్వాసులారా! 2. మీరు ఆరాధించునట్టి దానిని నేను ఆరాధించుటలేదు. 3. మరియు నేను ఆరాధించుచున్నవానిని మీరు ఆరాధించుటలేదు. 4. మీరు ఆరాధించినదానిని నేను ఆరాధించువాడను కాను. 5. మరియు మీరు నేను ఆరాధించు వానిని మీరు ఆరాధించువారుకారు. 6. మీ మతము మీకు, మరియు నామతము నాకు అని ఓ ప్రవక్తా! పలుకుము.

## 5. సూరయే - నసత్ - మక్కీ - 3 వాక్యములు

బిస్మిల్లా-హిర్రహ్మా - నిర్రహీం.

1. ఇజా - జాఅ - నస్ - రుల్లాహి - వల్ - ఫత్ హు -
2. వర - ఐ - తన్నాస - యద్- ఖులూన - ఫీ - దీనిల్లాహి - అఫ్ - వాజా-
3. ఫ - సబ్బిహ్ - బి - హమ్‌ది - రబ్బిక - వస్-తగ్- ఫిర్ హు - ఇన్నహూ- కాన - తవ్వాబా -

అ. దేవుని సహాయము, జయమును వచ్చినప్పుడు 2. మరియు ప్రజలు గుంపులు గుంపులుగా మతములోచేరుట నీవు చూచినప్పుడు 3. నీ ప్రభువు స్తోత్రముతో అతని పవిత్రతను కొనియాడుము. మరియు అతనితో క్షమాపణ వేడుకొనుము. నిశ్చయముగా అతను చాలా క్షమించువాడు.

## 6. సూరయే - లహాబ్ - మక్కీ - 5 వాక్యములు

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీం.

1. తబ్బత్ - యదా - అబీ - లహాబిన్ - వతబ్బ 2. మ - అగ్ నా అన్ హు- మాలుహూ - వమా - కసబ్ 3. సయస్‌లా - నారన్‌జాత - లహాబ్ 4. వమ్ - రఅ - తుహూహమ్మా - లతల్ హతబ్ 5. ఫీ - జీదిహా - హబ్ - లుమ్ - మిమ్ - మసద్.

అ. అబూలహాబ్ యొక్క చేతులు విరుగుగాత. మఱియు వాడు నశించుగాత. 2. వాని ధనమును వాడు సంపాదించినదియు వానికి పనికిరాలేదు. 3. ఇక శీఘ్రములోనే ప్రజ్వలించు నరకాగ్నిలో వాడును, 4. కట్టెలు మోసుకొని తెచ్చునట్టివాని భార్యయును ప్రవేశింతురు. 6. ఆమె మెడలో బాగుగ పేనిన యొక త్రాడుండును,

## 7. సూరయే - ఇఖ్లాస్ - మక్కీ - 4 వాక్యములు

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్.

1. ఖుల్ - హు వల్లాహు - అ హద్ 2. అల్లాహుస్ - సమద్ 3. లమ్ యలిద్
4. వ - లమ్ - యకుల్ - లహూ - కుఫ్ వన్ - అహద్.

అ. ఓ ప్రవక్త! ఆ దేవుడు అద్వితీయుడు, ఒక్కడు. 2. దేవుడు అక్కఱలేనివాడు. 3. అతడు కనలేదు. మరియు అతడు జన్మించిన వాడు కాడు. 4. మరియు అతనికి సమానుడు ఎవడును లేడు.

N. B:—వ్యాఖ్య = దేవుడు ఒక్కడు. స్వతంత్రముగా నుండునది ఎద్దియు లేదు. అతడు పుట్టినవాడు కాడు. అతనికి పుట్టినవారు ఎవ్వరు లేరు. అతడే సర్వస్వతుడు.

## 8. సూరయే - ఫలఖ్ - మదనీ - 5 వాక్యములు

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్.

1. ఖుల్ - అవూజు - బి - రబ్బిల్ - ఫలఖ్ - 2. మిన్ - షర్రి - మా - ఖలఖ్ 3. వమిన్ - షర్రి - గాసి - ఖిన్ - ఇజా - వఖబ్ - 4. వమిన్ - షర్రిన్ నఫ్ - ఫాసాతి - ఫిల్ - ఉఖద్ - 5. వమిన్ - షర్రి - హా - సిదిన్ - ఇజా - హాసద్.

అ॥ సర్వసృష్టియొక్క కీడునుండి క్రమ్ముకొను చీకటిరాత్రి యొక్క కీడునుండియు; ముడులలో మంత్రించి ఊదునట్టి స్త్రీల కీడు నుండియు; అసూయాపరుడు, అసూయ చేయునపుడు గలుగు కీడు నుండియు రక్షింపబడుటకై ఉదయమునకు ప్రభువగు దేవుని శరణు జొచ్చుచున్నాను.

## 9. సూరయే - నాస్ - మదనీ 6 వాక్యములు

బిస్మిల్లా - హిర్రహ్మా - నిర్రహీమ్. :
అమితదయగలవాడును, ప్రేమించువాడునగు దేవుని పేర

1. ఖుల్ - అఊజు - బి - రబ్బిన్నాస్ - 2. మలికిన్నాస్ - 3. ఇలా - హిన్నాస్ - మిన్ - షర్రిల్ - వస్ - వాసిల్ - ఖన్నాస్ - 5. అల్లజీ యువస్ - విసు - ఫీ - సుదూ - రిన్నాస్ - 6. మినల్ - జిన్నతి - వన్నాస్

అ. జిన్నాతుడుగాని, మనుష్యుడుగాని ఎవడు జనుల హృదయములలో కలతలు వేయుచు వెనుకకుమరలిపోవునో అట్టి సైతాను కీడునుండి రక్షణపొందుటకై, నేను జనుల స్వామియును, జనుల ప్రభువును, జనులపూజ్యుడును అగు దేవుని శరణుజొచ్చుచున్నాను.

N. B. 8 సూరయే-ఫలఖ్ 9 నాస్ 11 మహావాక్యములు పఠించి 3 సార్లు జపించి ఊదినవెంటనే రోగులు స్వస్థత నొందుదురు. బాలగ్రహాది దోషములు అంటవు. భగవద్గీత శ్లోకములుగాని, ఖురాన్ సూరాలుగాని, బైబిలు వాక్యములుగాని, తుదకు యీ గ్రంథమునుగాని అంతః బాహ్య శుద్ధిగలవారలై పఠింపవలయునే గాని అపరిశుద్ధులై ఎంతమాత్రము తాకుట - పఠించుట కూడదు.

# క్రైస్తవ ప్రార్థనాదికములు

## ఆదివారము చర్చిలో చేయు ముఖ్యప్రార్థన

సర్వశక్తియు, మిగుల కనికరమునుగల దేవా! మా ప్రభువైన యేసుక్రీస్తుయొక్క తండ్రీ! నీవు మాకనుగ్రహించుచున్న మేళ్ళన్నిటి నిమిత్తమును, మా యెడల నీకుగల కరుణావాత్సల్యము నిమిత్తమును నిన్ను స్తుతించుచున్నాము. ముఖ్యముగా నీప్రియకుమారుని మాకొరకిచ్చినందుకును, నీచిత్తమును, కృపను మాకుబయలుపరచినందులకును నీకు కృతజ్ఞతా స్తుతులు చెల్లించుచున్నాము. మేము యథార్థమైన మంచిహృదయములతో నీ వాక్యమును అంగీకరించి భద్రపరచుకొని సత్క్రియలు ఓపికతో చేయుచు ఫలమిచ్చునట్లు దానిని మాతో నాటింపుమని నిన్ను వేడుకొనుచున్నాము.

రక్షణకలిగించెడు నీ వాక్యమందలి పవిత్రమైన బోధయందు నీ సార్వత్రిక సంఘమును కాపాడి యేలుమనియు, అందువలన నీయందు మాకుగల విశ్వాసము బలపడి సకలజనులయెడల మాలో ప్రేమ వృద్ధిపొందినట్లు అనుగ్రహింపుమనియు మిగుల మనఃపూర్వకముగా నిన్ను వేడుకొనుచున్నాము.

నీ వెలుగును, నీ సత్యమును భూదిగంతములవరకు వ్యాపింపజేయుము. మా స్వజనులకును, సకలజనాంగములకును నీ సువార్తను

ప్రకటించుటకు నమ్మకమైన గురువులను, బోధకులను ప్రతిష్ఠించి వారి పనులన్నిటియందును వారిని నడిపించి, కాపాడి అభివృద్ధి కలుగ జేయుము.

సంఘమునకు కావలసిన శాస్త్రపాఠశాలలను, వేదపాఠశాలలను, ఇతర పాఠశాలలను దీవించుము. వానినుండి వాక్యసేవయందును, రోగులకును, కష్టములలోనుండువారికిని, బీదలకును పరిచర్య చేయుటయందును, జీవనోపాయములన్నిటియందును, నిన్ను సేవించు స్త్రీ పురుషులు బయలువెడలునట్లనుగ్రహింపుమని వినయముతో వేడుకొనుచున్నాము.

నీవాక్యమను వెలుగు మా గృహములయందు నిరంతరమును ప్రకాశింపనిమ్ము. పరిశుద్ధబాప్తిస్మమునందు నీవు బిడ్డలతో చేసిన ఒడంబడికను వారు నిలుపుకొనునట్లు సంఘపు బిడ్డల నందరిని కాపాడుము. వారిని నీయందు విశ్వాసము గలవారిగను, నీ చిత్తము ననుసరించి నడుచుకొనువారిగను, పెంచునట్లు తలిదండ్రులందరికి నీ కృప ననుగ్రహింపుము.

అధికారులందరికి ముఖ్యముగా మా రాజుగారికిని, రాజప్రతినిధి గారికిని, గవర్నర్లకును, శాసనసభ నిర్మాణసభకును, న్యాయాధిపతులు మొదలగువారి కందరికిని క్షేమమును, ఆరోగ్యమును అనుగ్రహింపుము. మేము సంపూర్ణదైవభక్తియు, యథార్థతయు కలిగి సమాధానముతో నెమ్మదిగ జీవించునట్లు, వారు దుర్మార్గుల నాటంక పరచి శిక్షించి నీతి న్యాయములను నిలువబెట్టి, దివ్యమైన నీ చిత్త ప్రకారము ఏలునట్లు వారికి నీ కృప ననుగ్రహింపుము.

ఓ దేవా! ఇబ్బంది, కొదువ, వ్యాధి, ప్రసవవేదన, మరణాపాయము అను వానిలోనైనను, మరియేవిధమైన ఆపదలోనైన నున్నవారందరును, ముఖ్యముగా నీ నామము నిమిత్తమును, నీ సత్యము నిమిత్తమును శ్రమపడుచున్నవారును తమబాధలు తండ్రి భావముగల నీ చిత్తముననుసరించి కలిగినవేయని తెలిసికొని సహించుకొనునట్లు వారిని, నీ పరిశుద్ధాత్మచేత నాదరింపుము.

ఓ మిగుల కరుణగలతండ్రీ! నీ న్యాయమైన కోపమునకును, అనేక దండనలకును మేము పాత్రులమైనను మా బాల్యకాల పాపములనుగాని, అనేకములగు మా యతిక్రమములనుగాని జ్ఞాపకముంచుకొనక శరీరాత్మలకు కలుగు హానినుండియు అపాయమునుండియు చెప్పశక్యముగాని నీ దయను, కృపను, కనికరమునుబట్టి మమ్మును కాపాడుమని నిన్ను వేడుకొనుచున్నాము.

నాశనకరమైన తప్పుబోధనల నుండియు; యుద్ధము, తెగులు, అగ్నివలన, నీటివలన కలుగు ఉపద్రవములు, వడగండ్లు, గాలివాన, పంటనష్టము, కరవు, మనోవేదన, దుర్మరణము అనువానినుండియు మమ్మును కాపాడి, నీ కృపనుగూర్చి నిరాశ చెందకుండునట్లు మమ్మును నడిపింపుము. కష్టకాలమందెల్లను సకలజనులకు ముఖ్యముగా నిన్ను నమ్మినవారికి తాత్కాలిక సహాయకుడవుగాను రక్షకుడవుగాను కనబరచుకొనుము.

యుక్తకాలమందు ఆవశ్యకమైన భూఫలములను మేమనుభవించునట్లు వానిని వృద్ధిపొందింపుము. భూమిమీదను నీటిమీదను జరుగు న్యాయమైన వృత్తులన్నిటికిని పవిత్రమైన విద్యలన్నిటికిని, ఉపయోగకరమైన జ్ఞానమును వికసింపజేసి యాశీర్వదింపుము.

బోధకుడు సభయుకలిసి ప్రభువు ప్రార్థనచెప్పవలెను. ఓ దేవా! ఈ మా మనవులను ఇంకను మేము నీ చిత్తప్రకారము నిన్ను అడుగవలసినవాటిని నీతోను పరిశుద్ధాత్మతోను సదా ఏకదేవుడై యుగయుగములు జీవించుచు, పరిపాలించుచు నుండు నీ యద్వితీయ కుమారుడును; మా ప్రభువును, రక్షకుడునైన యేసుక్రీస్తుయొక్క ఘోరశ్రమ మరణమునుబట్టి మాకు దయచేయుమని నిన్ను వేడుకొనుచున్నాము.

## ప్రభువు ప్రార్థన

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధపరచబడుగాక. నీ రాజ్యము వచ్చుగాక. నీ చిత్తము పరలోకమందు నెరవేరుచున్నట్లు భూమియందును నెరవేరుగాక. మా అను

దినాహారము నేడు మాకు దయచేయుము. మా యెడల అపరాధము లను చేసినవారిని మేము క్షమించియున్న ప్రకారము మా అపరాధ ములను క్షమించుము. శోధనలోనికి తేక దుష్టునినుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును, శక్తియు, మహిమయు నిరంతరము నీవియైయున్నవి. ఆమేన్.

## 1. విశ్వాసము - (బైబిలు)

లోకవ్యవహారములలో కూడ విశ్వాసము అవసరమై యున్నది.

1. విశ్వాసమునకు తెలివి అవసరము — రోమా 10 : 1 - 18
2. విశ్వాసమునకు తెలివి చాలదు. — యాకో 2 : 14 - 26
3. విశ్వాస మనగా దేవుని మాటను నమ్ముట — రోమా 4
4. విశ్వాసము కనబడని వాటిని నమ్మును — హెబ్రీ - 11
5. చూడకయే నమ్మువారు ధన్యులు — యోహా 20 : 19 - 31
6. విశ్వాసి ధైర్యము — 2. తిమొ 4 : 17
7. విశ్వాసుల జయగీతము. — రోమా 8 : 26 - 39

పై విశ్వాసగుణములు విశ్వాసమును నిరర్థక పరచకుండునట్లు మనలో నుండవలసిన జాగరూకత.

## దేవునియందుంచవలసిన విశ్వాసము

1. సువార్త విషయములు తెలుసుకొని నమ్మునదై యున్నది.
2. దేవుని మీద ఆనుకొనుటయై యున్నది.
3. అది నిజముగా పశ్చాత్తాప పడినవారికి తప్ప మరియొకరికి నుండదు.
4. దానిలో సంశయములుండవు.
5. అది మన మరణపర్యంతము అంతకంతకు వృద్ధినొందును.

## క్రైస్తవులు నేర్చుకొనవలసిన 5 ముఖ్యవిధులు

1. దేవుని పది ఆజ్ఞలు.
2. విశ్వాస ప్రమాణము.
3. ప్రభు ప్రార్థన.
4. పరిశుద్ధ బాప్తిస్మము.
5. ప్రభు రాత్రి భోజనము

## 2. విశ్వాస ప్రమాణము

భూమ్యాకాశములను సృజించిన సర్వశక్తిగల తండ్రియైన దేవుని నేను నమ్ముచున్నాను.

ఆయన ఏకకుమారుడును మన ప్రభువైన యేసుక్రీస్తును నమ్ముచున్నాను. ఈయన పరిశుద్ధాత్మవలన గర్భమున ధరింపబడి కన్యయైన మరియకుపుట్టి పొంతిపిలాతు అధికారముక్రింద శ్రమపడి శిలువవేయబడి చనిపోయి సమాధిచేయబడెననియు, అదృశ్యలోకము లోనికి దిగెననియు, చనిపోయినవారిలోనుండి మూడవదినమున లేచి పరలోకమునకెక్కి సర్వశక్తిగల తండ్రియగు దేవుని కుడిచేతివైపున కూర్చుండి యున్నాడని సజీవులకును, మృతులకును తీర్పుచేయుటకు అక్కడనుండి వచ్చునని నమ్ముచున్నాను.

పరిశుద్ధాత్మను నమ్ముచున్నాను. పరిశుద్ధ క్రైస్తవ సంఘమగు పరిశుద్ధుల సహవాసమును, పాప క్షమాపణయు, శరీర పునరుత్థానము, నిత్యజీవనము ఉన్నవని నమ్ముచున్నాను. ఆమేన్.

## 3. ప్రభువు ప్రార్థన

ప్రభువు తన శిష్యులకు నేర్పిన ప్రార్థన:—

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధ పరచ బడుగాక. నీ రాజ్యము వచ్చుగాక! నీచిత్తము పరలోకమందు నెరవేరు చున్నట్లు భూమియందును నెరవేరుగాక. మా అనుదినాహారము

నేడు మాకు దయచేయుము. మామెడల అపరాధములు చేసినవారిని, మేము క్షమించియున్న ప్రకారము మా అపరాధములను క్షమించుము. శోధనలోనికి తేక దుష్టులనుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును శక్తియు మహిమయు నిరంతరము నీవియై యున్నవి. ఆమేన్

## 4. పరిశుద్ధ బాప్తిస్మము

పరిశుద్ధ బాప్తిస్మము అనగానేమి?

పరిశుద్ధ బాప్తిస్మము పట్టినీళ్లు మాత్రమే కాదు. కాని దేవుని ఆజ్ఞతో కూడి ఆయన వాక్యముతో చేర్చబడిన నీళ్లు.

పరిశుద్ధ బాప్తిస్మమువలన ప్రయోజనము ఏమి?

దానివలన పాపపరిహారము కలుగజేయ బడుచున్నది. మరణమునుండియు, సాతానునుండియు విడిపింపబడుచున్నాము. దేవునివాక్య వాగ్దత్తముల నమ్మువారందరికి నిత్యజీవము, మోక్షము ఈయబడుచున్నది.

## 5. ప్రభు రాత్రిభోజనము

ప్రభు రాత్రిభోజన మన నేమి?

అది ప్రభువైన ఏసుక్రీస్తుయొక్క నిజమైన శరీరమును, రక్తమునై యున్నది. దీనిని రొట్టెతోను, ద్రాక్షరసముతోను తిని త్రాగుటకు క్రీస్తు తానే యీరాత్రి భోజనము నియమించెను.

ప్రభు రాత్రి భోజనమువలన లాభము:—

పాప పరిహారము కలుగుటకై మీకొఱకు ఈయబడు చున్న దనియు చిందించబడుచున్నదనియు చెప్పబడు మాటలు దీని ప్రయోజనము మనకు తెలియజేయుచున్నవి. ఏమనగా; ఈ మాటల వలననే ప్రభువు రాత్రి భోజనములో మనకు పాప పరిహారమును, జీవమును, మోక్షమును యీయబడు చున్నవి. ఎందుకనగా పాప పరిహారము ఎక్కడ యుండునో అక్కడనే జీవమును, మోక్షమును యున్నవి.

# హిందువుల ప్రార్ధనాదికములు

## గణపతి స్తోత్రము

శ్లో॥ నమస్తే బ్రహ్మరూపాయ, విష్ణురూపాయ తే నమః ।
నమస్తే రుద్రరూపాయ, కరిరూపాయ తే నమః ॥
విశ్వరూప స్వరూపాయ, నమస్తే బ్రహ్మచారిణే ।
భక్తప్రియాయ దేవాయ, నమస్తుభ్యం వినాయక ॥
లంబోదర నమస్తుభ్యం, సతతం మోదకప్రియ ।
నిర్విఘ్నం కురుమేదేవ, సర్వకార్యేషు సర్వదా ॥

## సూర్యని ధ్యానము

శ్లో॥ బ్రహ్మస్వరూపముదయే, మధ్యాహ్నంతు మహేశ్వరం ।
సాయంధ్యాయేత్సదావిష్ణుం, త్రిమూర్తించ దివాకరమ్॥
వినతాతనయో దేవ కర్మసాక్షీ సురేశ్వరః ।
సప్తాశ్వః సప్తరజ్జుశ్చ, అరుణోమే ప్రసీదతు ।
ఆదిత్యస్య నమస్కారం, యే కుర్వంతి దినేదినే ।
జన్మాంతర సహస్రేషు దారిద్ర్యం నోపజాయతే ॥

## బ్రహ్మ విష్ణు మహేశ్వర ధ్యానము

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

## విష్ణు స్తోత్రము

శ్లో॥ మేఘశ్యామం పీతకౌశేయ వాసం । శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగం,
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం । విష్ణుం వందే సర్వలోకైక నాథం ॥

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం ।
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్ధ్యాన గమ్యం ।
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం ॥

తా. శాంతస్వరూపుడు శేషాహి, పద్మము నాభియందు గలవాడు, ప్రపంచాధారుడు, ఆకాశ సదృశమై మేఘవర్ణముగల శుభలక్షితుడును, కమలములవలె నేత్రములుగల లక్ష్మీదేవి భర్తయును, యోగులకు తెలుసుకోదగినవాడును, భయ, శోకవినాశకుడును, సర్వలోకాధి నాధుడును అగు విష్ణుదేవునికి నమస్కరించుచున్నాను.

## శివ స్తోత్రము

శ్లో॥ వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగ భూషణం మృగధరం వందే పశూనాం పతిం
వందే సూర్యశశాంక వహ్ని నయనం వందే ముకుంద ప్రియం
వందే భక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరం॥

శ్లో॥ కర చరణకృతం, వాక్కాయజం కర్మజంవా
శ్రవణ నయనజంవా, మానసంవాఽపరాధమ్
విహిత యవిహితం వా సర్వమేతత్ క్షమస్వ
జయ జయ కరుణాబ్ధే శ్రీ మహాదేవ శంభో॥

తా. దయాసముద్రుడవగు ఓ ఈశ్వరా! చేతులచేతను కాళ్ళ చేతను, చెవులచేతను, నేత్రములచేతను, వాక్కుచేతను, శరీరము చేతను, క్రియచేతను, తుదకు మనస్సుచేతను, తెలియకయు, తెలిసియు నాచే గావింపబడిన అపరాధము లన్నిటిని క్షమించుము.

## హరి హర అభేద స్మరణము

శ్లో॥ శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే।
శివస్యహృదయం విష్ణు ర్విష్ణో శ్చ హృదయం శివః॥
యదా శివమయో విష్ణురేవం విష్ణుమయ శ్శివః
యధాంతర నపశ్యామి తథామే స్వస్తిరాయుషీ॥

తా. విష్ణురూపుడయిన శివునికి, శివస్వరూపుడైన విష్ణువునకు నమస్కారము. శివుని హృదయము విష్ణువు, విష్ణువుహృదయము శివుడు; శివస్వరూపము విష్ణువనియు, విష్ణుస్వరూపము శివుడనియు, శివవిష్ణువులకు భేదము లేదనియు ఏ మనుష్యుడు చూడగలడో అతనికి ఆయుః పర్యంతము శుభములు కలుగుచుండును.

## నందీశ్వర ధ్యానం

శ్లో॥ నందీశ్వర నమస్తుభ్యం శాంతానంద ప్రదాయకం।
మహా దేవేశ సేవార్థం అనుజ్ఞాం దాతు మర్హసి॥

తా. భక్తులకు శాంతము ఆనందము నిచ్చునట్టి ఓ నందీశ్వరా! సర్వేశ్వరుని సేవచేయువారికి అనుజ్ఞ ఇచ్చుటకు తగియున్న మీకు నమస్కారము.

(ముందు నందీశ్వరుని ధ్యానించి అనుజ్ఞపొంది శివుని ధ్యానించవలయుననుట)

## శ్రీ పార్వతి ధ్యానము

శ్లో॥ ముక్తాకుందేందుగౌరీం, మణిమయమకుటాం రత్నతాటంకయుక్తా
మక్షస్రక్పుష్పహస్తామభయవరకరాం చంద్రచూడాం త్రినేత్రాం
నానాలంకారయుక్తాం సురమకుటమణి ద్యోతితస్వర్ణపీఠాం
సానందాం సుప్రసన్నాం త్రిభువనజననీం చేతసా చింతయామి.

## శ్రీ లక్ష్మి దేవి ధ్యానము

శ్లో॥ వందేలక్ష్మీం వరశివమయీం శుద్ధజాంబూనదాభాం
తేజోరూపాం కనకవసనాం స్వర్ణభూషోజ్జ్వలాంగీం
బీజాపూరం కనక కలశం హేమపద్మం దధానాం
మాద్యాం శక్తిం సకలజననీం విష్ణువామాంకసంస్థాం॥

## శ్రీ సరస్వతీ ధ్యానము

శ్లో॥ యాకుందేందు తుషారహారధవళా యాశుభ్రవస్త్రాన్వితా
యావీణా వరదండమండిత కరా యాశ్వేతపద్మాసనా
యాబ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభి ర్దేవై స్సదా పూజితా
సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా॥

## శ్రీరాముని దర్శించునపుడు పఠించుధ్యానము

శా॥ శ్రీమద్దివ్యనిజాంఘ్రిపద్మములు సంసేవించుచున్ భక్తిచే
ధీమంతుండగు నాంజనేయుని లసద్దేహేంద్రియాతీతచి
ద్వ్యోమానందుడ నీవనేనని కృపం బోధించు శ్రీజానకీ
రామబ్రహ్మము నంతరంగమున నారాధించు నశ్రాంతమున్.

శ్లో॥ సీతామనో మానస రాజహంస । సంసార సంతాపహారి క్షమాళో
శ్రీరామ దైత్యాంతక శాంతరూప । శ్రీతారకబ్రహ్మ నమోనమస్తే॥

## శ్రీకృష్ణుని దర్శించునపుడు పఠించుధ్యానము

శా॥ కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్స్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుంకరే కంకణం
సర్వాంగే హరి చందనం చ కలయన్ కంఠేచ ముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః.

## శ్రీ వేంకటేశ్వర ధ్యానము

శ్లో॥ ఓం నమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే
ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమోనమః॥

తా॥ పరమపురుషుడును, మహాత్ముడును, నమస్కరించిన వారికష్టములను నశింపజేయువాడును, భూమిని పొందినవాడునుఅగు శ్రీ వేంకటేశ్వరస్వామికి నమస్కారము.

## ఆంధ్ర శివానందలహరి

శ్లో. గలంతీ శంభో త్వచ్చరితసరితః కిల్బిషరజో
దలంతీ ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్
దిశంతీ సంసారభ్రమణ పరితాపోపశమనం
వసంతీ మచ్చేతో హ్రదభువి శివానందలహరీ. 1

ఉ. చిందిడు నీకథానదిని వెల్వడి పాపరజమ్మునాడ్చి ని
స్తంద్రమతి ప్రసారణులదారులజొచ్చి భవోగ్రతాపమున్
మ్రందగజేసి డెందమనుమడ్గుననిల్చి యజస్రమున్ శివా
నంద ఝరీవరమ్ము శ్రితనందనమై వెలుగొందుగావుతన్. 1

తా: ఓ శంకరా! నీ చరిత్రములు మహానదులు, వాటినుండి ప్రవహించిపారుచు పాపములనెడు ధూళుల నణచుచున్న యీ శివానందలహరి బుద్ధియను పిల్లకాలువగుండ వచ్చి సంసారతాపము నణంచుచు నా హృదయమను పెద్దచెఱువులో పడినది. ఇది యికనెన్నడును వీడకుండ స్థిరముగానుండునట్లను గ్రహింపుము.

శ్లో. సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా
న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్
హరిబ్రహ్మాదీనామపి నికట భాజామ సులభం
చిరం యాచే శంభో శివ తవ పదాంభోజ భజనమ్ 2

చ. కొలదిగనిచ్చు వేలుపులు కోట్లకొలందిగలారు; వారలం
గొలుచుటనో ఫలంబు మదిఁ గోరనొకప్డును; నీకునాప్తులై
మెలగు విరించి విష్ణులకె మిక్కిలి దుర్లభమౌ భవన్మహో
జ్జ్వలపద పంకరుడ్భజన భాగ్యమె కోరెదనయ్య శంకరా! 2

తా॥ కొంచెము కొంచెము ఫలమిచ్చు దేవతలెందరో కలరు. వారిసేవ, వారిచ్చు ఫలములు నాకు కావలయుననుకోరిక కలనైనాలేదు. శంకరా! ఎల్లప్పుడును సమీపవర్తులైన బ్రహ్మాదులకుగూడ దొరకని మీపాదసేవయే దయచేయుడు. మిమ్ము ఎల్లవేళల వేడుచున్నాను.

శ్లో. మనస్తే పాదాబ్జే నివసతు వచస్స్తోత్రఫణితౌ
కరశ్చాభ్యర్చాయాం శ్రుతిరపి కథాకర్ణనవిధౌ,
తవ ధ్యానే బుద్ధిర్నయనయుగళం మూర్తివిభవే
పర గ్రంథాన్కైర్వా పరమశివ జానే పరమతః. 3

చ. మనము భవత్పదాబ్జమున, మాటభవన్నుతియందు, హస్తమ
ర్చనమున, వీను నీకథల సంశ్రవణమ్మునఁ, జూడ్కి మూర్తి ద
ర్శనమున, బుద్ధిధ్యానమున జానగు గావుత నాకు నంత క
న్నను నితరమ్ముఁ జూచుటకు నాకు దరంబెటులింక శంకరా! 3

తా॥ మనస్సు, వాక్కు, హస్తము, శ్రవణము, బుద్ధి, నేత్రము, అను నింద్రియములు సర్వకాల సర్వావస్థలయందు నీకైంకర్యములందే మునిగియున్నచో గ్రంథాంతర ప్రసక్తి గలుగదు. కనుక అట్లనుగ్రహింపుమని భావము.

శ్లో. సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశాశాఖాఝుటితి వైరస్వైరమభితః
కపాలిన్ భిక్షో మే హృదయ కపి మత్యంత చపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవ దధీనం కురు విభో. 4

మ. ఘనమోహాటవిలోఁ, వధూపృథు కుచగ్రావంబుపై మెట్టుచుం
డును, బేరాసలపేరి కొమ్మలపయిం దూకున్ యథేష్టమ్ముగా
ననిశం బిట్టటుజుట్టి క్రుమ్మరు మదీయస్వాంతకీశమ్ము, దా
నిని లోఁగొమ్మిక భక్తిరజ్జువున నెంతేఁగట్టి భిక్షుప్రభూ! 4

తా. కోతివలె సంసారారణ్యమందు చంచలముగా తిరుగుచున్న నాచిత్తమును భక్తియను గట్టిత్రాటితో బిగియగట్టి నీ స్వాధీనముచేసికొమ్ము. నా చిత్తమునకు తదేకశరణమైన భక్తి ననుగ్రహింపుము.

శ్లో. కదా వా కైలాసే కనకమణిసౌధే సహ గణై
ర్వసన్ శంభోరగ్రే స్ఫుటఘటిత మూర్ధాంజలిపుటః
విభో సాంబస్వామిన్ పరమశివ పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణమివ వినేష్యామి సుఖతః. 5

శా. కైలాసమ్మున హేమరత్నఖచితాగారాంతరక్షోణులన్
బాళిం బ్రామథపాళిఁగూడి తలపైఁ బాణిద్వయిన్ మోడ్చి శ
ర్వా! లోకేశ్వర! కావుమంచును దదగ్రస్థాయినై బ్రహ్మక
ల్పాళి న్నేను క్షణంబులంబలెను బాయం ద్రోచు టేనాటికో!

తా. కైలాసమునకు జేరి ప్రమథగణములతోగూడ పరమేశ్వరునియెదుట హేవిభో, హేసాంబ, హేస్వామిన్, హేపరమశివ, పాహి యనిపలుకుచు సంతోషముతో అనేక బ్రహ్మకల్పములు నిమేషంబులుగా కాలమెప్పుడు గడపుదునోగదా!

శ్లో. కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామర సురభిచింతామణిగణే
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థే ఽ ఖిలశుభే
కమర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః. 6

మ. కనకాహార్యము హస్తమందు, నికటక్ష్మాసీమ విత్తేశ్వరుం
డు, నికేతమ్మునఁ గల్పభూజ సురధేను స్స్వర్మణుల్, శీర్షసీ
మను జంద్రుండు, పదంబులం దఖిల సన్మాంగల్యముల్ గల్గు నీ
కు, నిఁకేమిచ్చి తరింతు నీశ! యిదె నా కొమ్మిత్తు మచ్చిత్తమున్.

తా. కైలాసవాసా! బంగారుకొండ నీచేతనున్నది. కుబేరుడు మిత్రుఁడుగా నీ దగ్గఱనున్నాఁడు. కోరికలనిచ్చు కల్పవృక్షము, కామధేనువు, చింతామణులును నీ యధీనములై నీ యింటనున్నవి. చంద్రుడు భూషణముగా నీ శిరస్సుననున్నాడు. సమస్తశుభంబులును నీ పాదంబులవలన కలుగుచున్నవి శంకరా! నేనొసంగదగిన దొక్కటియు కానరాదు. కనుక నా చిత్తము నర్పించెదను; చేకొనుము.

శ్లో. సారూప్యం తవపూజనే శివ మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తి ధుర్య జనతా సాంగత్య సంభాషణే,
సాలోక్యం చ చరాచరాత్మకతనుధ్యానే భవానీపతే
సాయుజ్యం మమసిద్ధ మత్ర భవతి స్వామిన్ కృతార్థోఽస్మ్యహమ్.

మ. అగు సారూప్యము నీ సమర్చను; శివాద్యాఖ్యోఘ సద్గీతిచే
నగు సామీప్యము; తావకాశ్రితజన వ్యాసంగ సద్గోష్ఠిచే
నగు సాలోక్యము; తచ్చరాచర సమేతాంగైక చింతాప్తిచే
నగు సాయుజ్యము; సర్వమిందె కల దీశా! నాకు లో టేమిఁకన్.

తా. దేవా! నీ పూజయందు సారూప్యమును, నీ నామసంకీర్తనమందు సామీప్యము, నీ భక్తులతో కూడి కథా కాలక్షేపములు చేయుపట్ల సాలోక్యము, చరాచరాత్మకమైన నీ మూర్తి ధ్యానమందు సాయుజ్యమును గూడ నాకీ లోకమందే దయ చేయు చుంటివి గాన ధన్యుడనైతిని.

శ్లో. ధీయంత్రేణ వచోఘటేన కవితా కుల్యోపకుల్యాక్రమై
రానీతైశ్చ సదా శివస్య చరితాంభోరాశి దివ్యామృతైః
హృత్కేదారయుతాశ్చ భక్తికలమ సాఫల్య మాతన్వతే
దుర్భిక్షా న్మమ సేవకస్య భగవ న్విశ్వేశభీతిః కుతః ? ౪

మ. మతి యేతాముగ, వాక్కు బొక్కెనగ, రమ్యంబౌ కవిత్వంబువి
స్తృత కుల్యాళిగఁ బాఱు నీ విమల చారిత్రాబ్ధి చంచన్మహా
మృతముం గ్రోలి, హృదుర్వి భక్తి యను పై రెల్లప్పుడుం బండ, నా
శ్రితు లౌ వారికి గాటకంబు గలదే? శ్రీ పార్వతీ వల్లభా!

తా. శంకరా! నీ చరిత్రమను మహాసముద్రములోని దివ్యామృతము కవిత్వ మను కాలువలు పిల్లకాలువలు మొదలగు వానిగుండ వాక్కనెడు బొక్కెనతో నాబుద్ధి యను మోటవలన హృదయమను పొలములోనికి ప్రవహించి భక్తియను సస్యమును ఫలవంతముగా చేయుచున్నది. ఇంక ఎంతకఱవు వచ్చినను నాకేమి భయము ?

శతావధానులు ఆధ్యాత్మిక వేదాంతోపన్యాసకులు,
శ్రీ మంచం బుచ్చిలింగప్పశాస్త్రిగారిచే రచింపబడిన

## శ్రీ అవతార్ మెహర్‌బాబా ఉదయపు ప్రార్థన

ఓసర్వరక్షకా । ఓసర్వసాక్షి । ఆదియులేదు నీ । కంతంబులేదు
నిర్ద్వంద్వమూర్తివి । నిరుపమానుడవు । నీ ప్రమాణమెఱుంగ । నేరరెవ్వరును ।
ఏరంగులేదు నీ । కేవ్యాఖ్యలేదు । ఏరూపమునులేదు । యేపోల్కలేదు
నీకుహద్దులులేవు । నినుకొల్వలేరు । ఊహలకావల । నుండువునీవు
గ్రహియింపశక్యమ్ము । కాదయెవ్వరికి । నిత్యుడవిలలేదు । నీకునాశమ్ము
విభజింపగానిన్ను । వీలులేదయ్య । దివ్యదృష్టికిగాని । దృశ్యమ్ముగావు
మున్నుంటి విపుడుంటి । ముందుండగలవు । అంతటికన్నింట కావలగలవు
అంతెఱుంగగరాని । యాదినిగలవు । సాకారివిమఱి ని । రాకారివీవు
లోకమ్ములన్నిట । లోకాలకవల । త్రిజగమ్ములందున । త్రిజగాలకవల
చింతింపగారాక । స్వేచ్ఛతోనుండి । వర్తించుచుందువు । స్వాతంత్ర్యవృత్తి
సర్వమ్ము సృష్టించు । స్రష్టవునీవు । ప్రభువులకెల్లను । ప్రభుడవునీవు
ఎఱుగుదుమనముల । నెల్లహృదయాల । సర్వశక్తుడవీవు । సాక్షివినీవు
అగణితజ్ఞానమ్ము । నగణితశక్తి । అగణితంబైయొప్పు । నానందమీవు

జ్ఞానవారిధివీవు । జ్ఞాతవునీవు । మహిమ త్రికాలములన్ । మదినెఱుంగుదువు
నీవెవిజ్ఞానమ్ము । నిక్కమ్ముగాను । అతిదయాసాంద్రుండ । వతిదయామతివి
వరలు నాత్మలకెల్ల । పరమాత్మవీవు । పెక్కురూపులనొప్పు । నొక్కడవీవు
సత్తుచిత్తానంద । సంపుటివీవు । సత్యమ్మనకునీవె । జగతిమూలమ్ము
ప్రేమదుగ్ధాబ్ధివై । వెలయుచుండెదవు । మొదటివాడవునీవు । పురుషోత్తముడవు
ప్రభుడవౌదువునీవె । పరమేశ్వరుడవు । దేవదేవులకును । తీతుండవీవు
పరపరబ్రహ్మమ్ము । పరమాత్మవీవు । "అల్లా" యిలాహీ"యను "యాజదాన్"నీవు
"అహురమజ్దా" గాడ్డు । "నాత్రైతి" వీవు । భక్తులు భజియించు ప్రభుడవునీవు ।
అర్చింపగాదగు । అధికారివీవు । దాన "ఈజాడం"చు । తలతురు నిన్ను ।
ఓసర్వరక్షకా । ఓసర్వసాక్షి । నీకు మా ప్రార్థనల్ । నీకు జేజేలు ॥

## పశ్చాత్తాప ప్రార్థన

ఓంకార రూపివై । యొప్పారుదేవ - హే పరబ్రహ్మమా ! । హే పరమాత్మ
స్వర్గసీమ జరించు । జనక ! సర్వేశ ! - నిన్ను గొల్చెదమయ్య । నిశ్చలభక్తి
పరితపింతుము మేము । పాపాలకెదలో - అనృతమధర్మంబు । నపరిశుభ్రమ్ము
నగు తలంపులకెల్ల । నాత్మగుందెదము - పలుకకూడనిపల్కు । పల్కినందులకు ।
చేయకూడనిపనుల్ । జేసినందులకు - భావమ్ములో మేము । పరితపించెదము !
స్వార్థమ్ముచేనైన । స్పర్థచేనైన - చేసిన మాదుష్ట । చేష్టలన్నిటికి
ఆడినమాటలు । కన్నియూహలకు - అధిక పశ్చాత్తాప । మందుచున్నాము
కామవాంఛలకు మా । కామవర్తనకు - ప్రత్యేకముగ మేము । పరితపించెదము
ప్రతి యసత్యమ్ముకు । ప్రతి మోసమునకు - పల్కినవాగ్దాన । భంగంబులకును
అపనిందలను మోపు నపరాధములకు - చెలుపులు తెలవెన్క జేసినందులకు
మేముదుఃఖించెదము మిక్కుటమ్ముగను - పరులను చెఱచెడి పనులకునెల్ల
పరులననొప్పించు పలుకుకున్ బనికి - పరులకువ్యథగూర్చు ప్రతికోరికకును
అధిక పశ్చాత్తాప మందెదము మేము - పారమ్ములేని యో పరమకృపాబ్ధి
మా పాపములనెల్ల మన్నించుమయ్య - నీయిచ్ఛకనువుగా నిలువగలేక

మనము వాక్కాయాల మాచేయు క్రియల
అన్నియు క్షమియింపు మనుచు ప్రార్థించు
భక్తుల మీశ్వరా ! పాలింపరార !
ఓం తత్సత్

శ్లో॥ నమస్తే సతే తే జగత్కారణాయ
నమస్తే చితే సర్వలోకాశ్రయాయ
నమోఽద్వైత తత్త్వాయ ముక్తి ప్రదాయ
నమో బ్రహ్మణే వ్యాపినే శాశ్వతాయ॥

తా. జగత్కారణుడవును, సత్స్వరూపుడవును, సర్వలోకాశ్రయుడవును; చిత్స్వరూపుడవును; మోక్షప్రదుడవును; అద్వైత రూపుడవును అగు నీకు నమస్కారము.

శ్లో॥ త్వమేకం శరణ్యం త్వమేకం వరేణ్యం
త్వమేకం జగత్పాలక స్వప్రకాశమ్
త్వమేకం జగత్కర్తృ పాతృ ప్రహర్తృ
త్వమేకం పరం నిశ్చలం నిర్వికల్పమ్॥

తా. నీ వొక్కడవే రక్షకుడవును, సర్వోత్కృష్టుడవును; జగత్పాలకుడవును; స్వయంప్రకాశకుడవును, జగత్తుయొక్క సృష్టిస్థితిలయకారకుడవును; నిర్వికల్ప స్వరూపుడవును, నిశ్చలుడవును నీవే సుమా !

శ్లో॥ భయానాం భయం భీషణం భీషణానాం
గతిం ప్రాణినాం పావనం పావనానామ్
మహోచ్చైః పదానాం నియన్తృత్వ మేకం
పరేషాం పరం రక్షణం రక్షణానామ్॥

తా. భయములకు భయమైనవాడవు, భయపెట్టు వారలకు భయంకరుడవు. పావనులలో అతి పవిత్రమైనవాడవు. శ్రేష్ఠులలో శ్రేష్ఠుడవు. రక్షకులలో రక్షకుడవు. గొప్ప గొప్ప స్థానములను నియమించువాడవు.

శ్లో॥ వయం త్వాం స్మరామో వయం త్వాం భజామో
వయం త్వాం జగత్సాక్షి రూపం నమామః
సదేకం నిధానం నిరాలంబ మీశం
భవాంభోధి పోతం శరణ్యం వ్రజామః॥

తా. జగత్తులకు సాక్షీభూతుడవు. సంసారార్ణవతారకుడవు. నిరాలంబుడవు. ముఖ్యాశ్రయుడవు. సమర్థుడవు అగు నిన్నే శరణుజొచ్చెదము; నిన్నే స్మరించెదము; నిన్నే సేవించెదము.

సూచన:— ప్రార్థన శ్లోకములు ప్రతి మతస్థులకు ఎంత దగ్గరసంబంధము కలిగి యున్నవో చూడుడు. అట్లే సమస్త ప్రార్థనాదికములు అందరికీ ఒకేవిధముగ యున్నవనుటలో ఆశ్చర్యము లేదు.

ఓం సహనావవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై ఓం శాన్తిః శాన్తిః శాన్తిః.

తా॥ శిష్యాచార్యులమగు మా యిద్దరిని రక్షించుము. మాయిద్దరికి తేజోవంతమైన బ్రహ్మవిద్యా సామర్థ్యమును, ఉపనిషదర్థమును ననుభవింపజేయుము. మా యిద్దరికిని ఎప్పుడును ద్వేషభావము కలుగకుండ జేయుము.

ఓం అసతో మా సద్గమయ
తమ సోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా మృతంగమయ

తా. అసత్తైన సంసారమునుండి నన్ను ముక్తుడను గావించి, మంచిమార్గమునందుంచుము. అజ్ఞానమును నశింపజేసి జ్ఞానజ్యోతిని ప్రకాశింపజేయుము. అమృతస్వరూపుడవగు నీవద్దకు నన్ను తీసుకొనిపొమ్ము. ఓ స్వప్రకాశకుడా! నా సన్నిధియందు ప్రకాశించుచుండుము.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.

తా. న్యాయమార్గముచేత రాజులు పుడమిని పాలింతురు. గాక. ప్రజలకు సుఖముచేకూరుగాక. గో బ్రాహ్మణులకు (అనగా గోవులు బ్రహ్మజ్ఞానము తెలిసినవారలకు) నిత్యము శుభము కలుగు గాక. ప్రపంచమునకు సుఖముచేకూరి సమస్త జీవరాసులు సుఖులై యుందురుగాక.

# ప్రార్థన

సృష్టి స్థితిలయ కారకుండు - సర్వజ్ఞుడు - ప్రేమమూర్తి - ఆద్యంతరహితుడు - పరమేశ్వరుడు - అల్లాః - యోహోవా - పేర్లం బరగు నొక్కండవగు శ్రీ దేవదేవుడైన ఓ పరమేశ్వరా ! ఓ సత్య సంకల్పా ! ఓ సర్వరక్షకా ! ఓ సర్వసాక్షీ! నీయమోఘాశీర్వాదముచే లోకములోని మేమందరము జ్ఞానాభివృద్ధినిబడసి నీవే మా అందరకు రక్షకుడవైన తండ్రివనియు, ఏ దేశమునందు, ఏఖండమందుజన్మించిన వారమైనను, ఏజాతికి, ఏకులమునకు, ఏమతమువార మైనప్పటికి, ఏవిధముగ నిన్ను ప్రార్థించినను, సేవించినను, అర్చించినను, ఉపాసన చేసినను, నీవు ఒక్కడవనియు, మేమంతా ఒకేజాతివారమని, ఒక్కటే మతమని సమస్త స్త్రీ పురుషులు నీబిడ్డలని మేము గ్రహించు సుదినము త్వరలో వచ్చునట్లు ఆశీర్వదింపుము.

సర్వేజనాః సుఖినోభవంతు
ఓం తత్ సత్
మంగళం మహత్
శ్రీ శ్రీ శ్రీ

ప్రతులకు :

గ్రంథకర్తగారి వద్దను,

వేంకట్రామ అండ్ కో., హెడ్డాఫీసు - విజయవాడ,

మరియు వారి అన్ని బ్రాంచీలయందును దొరకును.

వేంకట్రామ్ పవర్ ప్రెస్, ఏలూరు.